# ముందుమాట

శ్రీ స్వామి వివేకానందస్వామి వంగభాషలో రాసిన 'ప్రాచ్య ఓ పాశ్చాత్య' రచనకు ఆంగ్లానువాదమైన 'The East and the West' కు యీ పుస్తకం తెలుగు అనువాదం స్వయంవ్యక్తంగా వుండే యీ పుస్తకానికి పీఠిక అవసరంలేదు. కాబట్టి దీని ప్రాశస్త్యాన్ని గురించి మాత్రం ఒక్క మాట.

జగద్విఖ్యాత కవిసార్వభౌముడైన శ్రీ రవీంద్రనాథ ఠాకూర్ వంగవాఙ్మయ చరిత్ర రచయిత ఐన రాయ్‌బహదుర్ దినేశచంద్రసేన్‌తో యీ పుస్తకాన్ని గురించి యిలా అన్నాడు: ''వెంటనే వెళ్లి వివేకానంద రాసిన యీ పుస్తకాన్ని చదువు. వ్యావహారిక వంగభాష సజీవంగా, ప్రాణమయంగా ఎలా రూపొందగలదో దాన్ని చదివాక నీకు తెలుస్తుంది. ఏం భావాలు, ఏం భాష, విషయపరిశీలనంలో ఏం నిశితవిస్తృత దృష్టి! ప్రాచ్యపాశ్చాత్య భావసమన్వయ ఆదర్శం ఎంత అద్భుతావహంగా దీన్లో ప్రదర్శితమైంది!'' ఇలా అనటమే కాక ఆయన యీ పుస్తకాన్ని శతధా శ్లాఘించాడు.

గత ముద్రణలలోని భాష గ్రాంథిక పోకడలలో వుండటంతో, ఆధునిక పాఠకుడి సౌలభ్యం దృష్ట్యా భాషను సరళవ్యవహారంలోకి మార్పుచేయటం జరిగింది. విషయంలో కించిత్తూ మార్పులేదు.

పై సౌలభ్యం దృష్ట్యా తెలుగు పాఠకలోకం యీ పుస్తకాన్ని గతంలోకంటె మరింతగా సమాదరిస్తారని ఆశిస్తున్నాం

— ప్రకాశకులు.

# ప్రాచ్యం - పాశ్చాత్యం
## పరిచయం

వరదల్లో అపార విజృంభణ చూపి, మహోగ్రరూపాలై, నిర్నిరోధ వేగంతో ప్రవహించే సువిశాల గంభీర నదీరాజాలు; ఆ నదీతటాల పక్కన, స్వర్గంలోని నందనోద్యానాన్నికూడా సిగ్గింపచేసే కమనీయ క్రీడావనాలు; ఆ వన మధ్యంలో అత్యంత మనోజ్ఞ లలితకళాశోభితాలై, గగనతలం లాంటి, చక్కదనాలీనే, చలువరాతి నగళ్లు; వాటి పక్కల, ఎదుట, వెనుక, కూలిపోతున్న మట్టిగోడలపై, శిథిలాలపై, కప్పును కోల్పోయి, బైటకు కానవచ్చే వెదురు వాసాలనే అస్థిపంజరాలున్న కుటీరసమూహాలు; ఎన్నో శతాబ్దాలుగా అనుభవిస్తూన్న నైరాశ్య దారిద్ర్యాలచే ముఖాల్లో లోతైన రేఖ లేర్పడి, చీలికపేలికలు కట్టుకొని, యిటూ అటూ తిరుగాడే శల్యావ శిష్టదేహులైన యువకులు, వృద్ధులు; అని చోట్ల సర్వసామాన్యంగా సంచ రించే ఆవులు, ఎద్దులు, దున్నలు - వాటిలోకూడా అలాటిదే ఐన శరీర దౌర్బల్యం, త్రోవల పక్కల పెంటలు, చెత్తకుప్పలు, - ఇది నేటి హిందూ దేశం!

అతిప్రశస్త సౌధరాజాలను ఆనుకొనే జీర్ణావస్థలోని పూరిగుడిసెలు; దేవాలయాలకు అతిసమీపాననే పెంటపోగులు; అతివిలువైన వలువలు అలంకరణలు ధరించినవారి పక్కనే నడయాడే కౌపీనమాత్రధారులైన సన్న్యాసులు; సంపదలతో కడుపార తిని తిరిగేవారిని కాంతివిహీన నేత్రా లతో, దైన్యదృష్టులతో, చూస్తూన్న అన్నార్తులైన నిరుపేదలు; - వీరితో కూడిందే మన స్వదేశం.

భయంకరంగా చెలరేగి వినాశం గావించే విషూచి, మహామారి; జన సమూహాల ప్రాణాలనే నమిలివేసే మన్నెపు జ్వరం, ప్రకృతి సిద్ధదశల్లో ఒకటిగా తోపిస్తూ, అన్నిచోట్లా కనిపించే ఆకటిచిచ్చు, వికటతాండవకేళి

సల్పే మృత్యుతుల్యమైన కాటకం, రోగపరితాపాలకు కురుక్షేత్రం (యుద్ధ భూమి), దేశం ఆశను, కార్యతత్పరతను, ఆనందాన్ని, ధైర్యాన్ని కోల్పో యినవారి శల్యాలతో నిండిన విశాల శ్మశానం, దాని నడుమ మోక్షైకగమ్యం కలిగి, ఆత్మాన్వేషణ తత్పరత్వంలో గాఢధ్యాన నిమగ్నుడై, గంభీరమౌన ముద్ర దాల్చి ఆశీనుడైన యోగి, - భారతదేశ దర్శనార్థులై వచ్చే ఐరో పాఖండ బాటసారికి కనిపించే దృశ్యా లివే!

ఆకారంలో మాత్రం మానవులుగా తోచే ముప్పైకోట్ల జన సమూహం, స్వదేశీయులచేత, విదేశీయులచేత, స్వమతావలంబులచేత, పరమతావలంబులచేత, అణగదొక్కబడి ప్రాణాలనే చాలవరకు కోల్పో యిన ప్రజలు; పరిశ్రమలోను, కష్టానుభూతిలోను ఓర్పు కలిగీ ప్రారం భకశక్తి లేనివారై వుండటంచేత బానిసతుల్యులు, పూర్వాపరశూన్యులైన నిరాశాశీలురు; ఈ జీవితాన్ని - అదెంత అనిశ్చిత రూపంలో వున్నా - ఎలాగైనా కాపాడుకో చూసేవారు; బానిస స్వభావసిద్ధమైన ద్వేషబుద్ధి గలిగి, తోడిప్రజల అభ్యుదయాన్ని సహించలేనివారు; ఆసలన్నీ అడు గంటి, శ్రద్ధావిహీనులై, ద్రోహబుద్ధి కలిగివుండేవారు; అత్మసంరక్షణార్థం నక్కలమాదిరి తుచ్ఛులైన జిత్తులకు, ద్రోహానికి, కుయుక్తులకు పాల్పడే వారు; స్వార్థపరత్వ స్వరూపాలు, బలవంతుల పాదధూళి నాకుతూ, తమ కంటె కాస్త బలహీనులైనవారిని చావమోదేవారు; దుర్బలులై, భవిష్యదభ్యు దయ విషయంలో నిరాశాగ్రస్తులైనవారికి నైసర్గికంగా సంక్రమించే అస హ్యాలు, పైశాచికాలు ఐన వెర్రినమ్మకపు పుట్టలైనవారు; వెన్నెముకలా ఆ ధారభూతమైవుండే నీతి ప్రమాణమేదీ ఎరుగనివారు, ఇలాంటి ముప్పై కోట్ల జనం భారతదేశ శరీరంమీద నిండి - కుళ్లి కంపుగొట్టే పీనుగుపై క్రిములు ముసురుకొన్నట్లు - నివసిస్తున్నారు. ఇదే మనలను గురించి ఆంగ్లేయోద్యోగి మనస్సులో సహజంగా ఏర్పడే భావచిత్రం.

నూతనార్జిత అధికార మద్యంతో ఉన్మాదావస్థలో వుండేవారు; సవ్యాపసవ్యమార్గవివేచనాశక్తిరహితులు; భార్యాదాసులు, కామాతురులు,

ఆటవిక మృగాలలా క్రూరబుద్ధులు, మద్యంలో మునిగి, సౌశీల్యపారి శుద్ధ్యాలన్నా, నిర్మలమార్గాలు, నిర్మలాభాసాలన్నా యిలాటివనికూడా ఎరుగనివారు; భౌతికపదార్థం తప్ప వేరేదీ లోకంలో లేదనే భావం కలిగి, తమ నాగరికతను, దాని వివిధ ప్రయోగాలను మాత్రమే ఆధారభూతా లుగా చేసుకొన్నవారు, బలాత్కరించి, వంచించి, ద్రోహమొనర్చి యిత రుల దేశాలన్నూ, సంపదను, ఉపయోగించుకొని స్వీయౌన్నత్యాన్ని సాధిం చుకోవటానికి అలవడ్డ కుత్సితులు; పారలౌకిక జీవిత మొకటుందని విశ్వ సించక, దేహాన్నే ఆత్మగా భావించి, ఇంద్రియాల్లో, ఇంద్రియ సుఖాల్లోనే జీవించేవారు: - ఇలా పాశ్చాత్యులు ప్రత్యక్ష రాక్షసులుగా భారతీయుడికి తోస్తారు.

ఇరుపక్షాలవారికి పరస్పరం కలిగే యీ భావాలకు వివేచనా హీనత్వం, అసంపూర్ణ పరిచయం, లేక పరిచయరాహిత్యం మూలాలు. విదేశీయులు - యూరోపియన్లు - భారతదేశానికి వచ్చి, మన నగరాలలో పరిపూర్ణనైర్మల్యారోగ్యాలకు ఆటపట్టులైన ప్రాంతాలలో రాజప్రాసాదాలను పోలు విశాల భవనాల్లో నివసిస్తూ, మన ''నేటివ్'' (మనలను వారు 'నేటివ్'లు - అంటే యిక్కడే పుట్టినవారు - అంటారు) ప్రాంతాలను తమ దేశంలో తాము నిర్మలంగా, మనోజ్ఞంగా, నిర్మించుకొన్న నగరాలతో పోల్చిచూస్తారు; వారి వద్దకు పోతూ, వారికి చక్కగా పరిచితులైన భార తీయులంతా ఒకే తరగతివారు - అందరూ వారి కింద ఏదో ఒక కొలువు చేసేవారే. నిజానికి దౌర్భాగ్యం, దారిద్ర్యం, భారతదేశంలోలా మరెక్కడా కనిపించవు; ఇదిగాక అపరిశుభ్రత, మాలిన్యం అన్నిచోట్లా వుండటాన్ని ఎవరు కాదంటారు? ఇలాటి పంకిలం, దాస్యం, పతనం, జుగుప్స మొద లైనవాటితో నిండివుండే తావునుండి యోగ్యమైన దేదైనా వెలువడుతుం దనటం యూరోపియన్లకు అసంభవంగా తోస్తుంది.

ఇక మన బుద్ధికి తోచే ఊహ లివి. యూరోపియన్లు దొరికిన దంతా - వివేచన ఏమీలేక - తింటారు; మనకున్నట్లు పారిశుద్ధ్య భావాన్నే

ఎరుగరు; కులభేదాలనే పాటించరు; స్త్రీలతో ధారాళంగా కలివిడిగా వుంటారు; మద్యపానం చేస్తారు: స్త్రీ పురుషు లొకరొకరు కౌగిలించు కొని సిగ్గులేకుండా నాట్యసమయంలో నృత్యం చేస్తారు; - ఇదంతా చూసి యిలాటి జాతి ఎలాటి గుణాన్నైనా కలిగి వుంటుందా? అని మనం అబ్బు రంతో ప్రశ్నించుకొంటాం.

ఈ అభిప్రాయాలు రెండూ బాహ్యైకదృష్టి సంజనితాలు - ఆంతర పరిశీలన లోపంచే, పైపైన మాత్రమే దృష్టి పరపటంచే, కలిగాయి. విదేశీయులను మనం మన సమాజంతో కలసిమెలసి మెలగనివ్వం; వారిని 'మ్లేచ్ఛు'లంటాం. వారు మనలను బానిసలుగా చూస్తూ ద్వేషిస్తారు; మనలను 'నిగ్గర్లు' ,( నీగ్రో జాతివారు) అంటారు.

ఈ భావాలు రెంటిలోను కొంత నిజం వుందనటం నిస్సంశయం. కాని యిరుపక్షాలలో ఒక్కరూ మూలంలో వుండే సత్యాంశాన్ని కాంచ లేదు.

ప్రతి మానవుడిలో ఒక భావం వుంటుంది బైటికి కనిపించే మానవుడు ఆ భావం యొక్క బాహ్యగోచర రూపమాత్రుడు, ఆ ఆంతర భావానికి ఉచ్చారణోపకరణం వంటివాడు. అలాగే ప్రతి దేశ జాతికి ఒక్కో జాతీయభావం వుంటుంది. ఆ భావం లోక సమిష్టికోసం పాటుపడు తుంది. లోక సంగ్రహణానికి అది ఆవశ్యకం. లోక సంగ్రహణ కార్యానికి ఆ భావం ఏనాడు అనావశ్యకంగా ఏర్పడుతుందో, ఆనాడే ఆ భావానికి ఉనికి పట్టయిన మానవుడో, జాతో అంతరిస్తుంది. అపారమైన దౌర్భాగ్యం, క్లేశం, దారిద్ర్యం, హింస మనకు - బైటనుండి, లోపల నుండి - కలుగుతున్నా, భారతీయులమైన మనం యింకా సజీవులమై వుండ టానికి కారణం మన కొక జాతీయభావం వుండటం, అది లోకసంగ్ర హణ సాధనార్థం యింకా కావలసి వుండటం. యూరోపియన్లకు ఒక స్వకీయమైన జాతీయభావం వుంది; అది లేనిపక్షంలో లోకం నడువ లేదు; కాబట్టే వారంత బలిష్ఠులై వున్నారు. తన శక్తినంతా కోల్పోయిన

మానవుడు ఒక్క క్షణమైనా జీవిస్తాడా? జాతి అంటె మానవకోట్ల సమష్టే కదా. తన శక్తిని, కార్యతత్పరతను పూర్తిగా కోల్పోయిన జాతి జీవిస్తుందా? వెయ్యేళ్లుగా యిన్ని బాధలు, యిన్ని అల్లకల్లోలాలు, తనను ఎదుర్కొన్నా, యీ హైందవజాతి ఎందుకు అంతరించలేదు? మన ఆచార మర్యాదలు అంత హేయాలుగా వుంటే, యిప్పటికే మనం యీ భూలోకంనుండి ఎందుకు నిర్మూలించబడలేదు? మన దేశాన్ని జయించినవారు ఒక్కరైనా మనలను రూపుమాపే ప్రయత్నాల్లో ఏమైనా లోపం చేశారా? ఐనా యితర అనాగరిక దేశాల్లోని ప్రజల మాదిరి మన హిందువులు నిర్మూలింపబడకుండా ఎలా జరిగింది? భారతదేశం నిర్మానుష్యమొనర్చబడి, అరణ్యప్రాయంగా ఎందుకు చెయ్యబడలేదు? అలా జరిగి వుంటే, విదేశీయులు ప్రతి ముహూర్తంలోను హిందూదేశానికి వచ్చి, అక్కడ శాశ్వత నివాసా లేర్పరచుకొని సారవంతాలైన ఆ దేశ భూముల్లో - అమెరికా, ఆస్ట్రేలియా, ఆఫ్రికా దేశాల్లో వారిప్పటికీ చేస్తున్నట్టు - వ్యవసాయం చేసుకొంటూండేవారు. నా విదేశీయ మిత్రుడా, నువ్వనుకొన్నంత బలం నీకు లేదని, అదొక వెర్రి ఊహ అని దీన్నిబట్టి తెలుస్తోంది గదా! హిందూదేశానికి బలం వుందని బలిష్ఠమైన స్వకీయ వాస్తవికత దానికి యింకా వుందని ముందుగా తెలుసుకో. అంతేగాక హిందూదేశం యింకా జీవించే వుందని, ప్రపంచ నాగరికతా సమష్టికి తాను సమర్పించాల్సిన భాగాన్ని అది యింకా సమర్పించుకోవలసి వుండటమే అది జీవించి వుండటానికి కారణమని గ్రహించు. ఈ విషయాన్ని మీరూ - బాహ్యవేషం లోను, చింతనామార్గంలోను, భావసరణిలోను, పూర్ణంగా యూరపు దేశస్థుల ననుకరించి, కళ్లు వాచిపోయేటట్లు నిరంతర ధారగా విలపిస్తూ, ''మమ్మ రక్షించండి'' అని, ''మేం అధోగతిపాలయ్యాం, పశుదశకు దిగజారాం, యూరపు దేశస్థులారా, మీరే మాకు రక్షకులు, మాపట్ల జాలిపూని యీ పతనదశనుండి మమ్మల్ని ఉద్ధరించండి'' అని యూరపుదేశస్థులను సదా ప్రార్థించే మీరుకూడా తెలుసుకోండి. మీరూ

- హిందూదేశానికి ఏసుక్రీస్తు వచ్చినాడని, కాలం పరిపక్వమవటంచే దేవుడి విధి యీ రీతిని నెరవేరిందని వందన సమర్పణ గీతికలు ఆలా పించే మీరూ - దీన్ని తెలుసుకోండి. అయ్యో! ఏం వెర్రి! అలాటి దేమీ జరుగలేదు! ఏసుక్రీస్తు యిక్కడకు రాలేదు; ఎహోవాకూడా యిక్కడకు రాలేదు; ఇకమీదకూడా వారు రాబోరు; స్వవిషయాలను, స్వగృహ స్థితి గతులను, చక్కబెట్టుకొనే కార్యంలో వారు నిమగ్నులై, తీరికలేక వున్నారు. ఇక్కడ పురాణపురుషుడైన శివుడే యిప్పటికీ యథాప్రకారం ఆసీనుడై వున్నాడు; రక్తబలులు గైకొనే కాళీమాతా పూర్వపు సామగ్రితోనే, పూర్వం లాగానే అర్చించబడుతోంది, ప్రేమమూర్తి ఐన బృందావన గోపబాలుడు - శ్రీకృష్ణుడు - యథాపూర్వంగా వేణుగానం చేస్తున్నాడు. పూర్వకాలంలో యీ వృద్ధశివుడు తన వృషభాన్నెక్కి డమరుకం వాయిస్తూ, హిందూ దేశంనుండి బయల్దేరి ఒకవైపు సుమత్రా, బోర్నియో, సెలబీసు, ఆస్ట్రేలి యాలు చూసుకొంటూ అమెరికా సముద్ర తీరాల వరకూ, మళ్లీ మరో వైపున బయల్దేరి ఎద్దును బాగాతోలి టిబెట్, చైనా, జపాన్‌ల మీదుగా సైబీ రియా వరకు పయనించాడు. ఇప్పటికీ ఆయన యీ ప్రయాణాలు మానక చేస్తూనే వున్నాడు కాళీమాతా నేడూ చైనా, జపాన్ దేశాల్లో సైతం పూజలు గైకొంటూనే వుంది; మేరీ కన్యకూ మార్చి ఏసుక్రీస్తు తల్లిగా క్రైస్తవులు ఆరాధించేది ఆమెనే! హిమాలయాలవంక చూడండి. వాటి ఉత్తరంలో కైలాసగిరి - వృద్ధశివుని ప్రధాన నివాసస్థానం వుంది; పది తలలు, యిరవై చేతులు వున్న మహాబలశాలి రావణుడే ఆ సింహాసనాన్ని కదల్చలేకపోయాడు; - ఇప్పుడు క్రైస్తవ మతప్రచారకులా ఆ కార్యాన్ని పూనుకోవటం! ఎంత సాహసం, ఎంత వెర్రి!! ఇక్కడ భారతదేశంలో డమరు వాయిస్తూ ఆ వృద్ధశివుడే శాశ్వతంగా వుంటాడు. పశుబలులు గైకొంటూ కాళీమాతా వుంటుంది. పిల్లనగ్రోవిని ఊదుకొంటూ మనో హరమూర్తైన శ్రీకృష్ణుడూ వుంటాడు. వారు హిమాలయాల మాదిరి సుస్థిరంగా నెలకొని వున్నారు. ఎవరెన్ని ప్రయత్నాలు చేసినా - క్రైస్తవ

ప్రచారకులుగాని, యితర మత ప్రచారకులుగాని - వారిని తొలగించలేరు. వారి ఉనికి మీకు సైపరాకుంటే, బుద్ధితెచ్చుకొని యిక్కడనుండి వెళ్లి పోండి! మీ నలుగురైదుగురి వల్ల ఒక దేశప్రజంతా - శాంతిని కోల్పోయే వరకూ - విసుగు చెందుతుండాలా? దుర్భర పీడన మొందాలా? మీరు మరో చోటికి ఎందుకు పోకూడదు - మీ యిష్టం వచ్చినట్లు ధారాళంగా మేతమేయ అనువైన మైదానాలు వున్నచోటికి ఎందుకు పోకూడదు? ప్రపంచమంతా మీకుంది కదా! కాదు, అది జరగనిపని! అలా చెయ్యటానికి కావలసిన శక్తి వారికి లేదు. వృద్ధ శివుని కూటినేకుడిచి, ఆయన యింటి వాసాలనే లెక్కిస్తూ, ఆయన్నుగూర్చి నిరపనిందలాడుతూ, విదేశీయ రక్షకుడైన ఒకని మహనీయతను కీర్తిస్తూండాలి! ఎంత దుర్మార్గం! విదేశీయుల వద్దకు ఏడ్పుమొహాలతో వెళ్లి ''మేం అధమాతి అధములం, నీచులం, పతితులం, మాకున్నదంతా పైశాచికమైనదే'' అని మొరపెట్టుకొనేవారికి మేం చెప్పేది యిది: ''సరే, మీరు సత్యవ్రతుల మంటారు. మీ మాటలు నమ్మకపోవటానికి తగిన కారణం మాకేమీ లేదు. కాబట్టి మీరు చెప్పేదంతా నిజమే కావచ్చును. కాని, ఆ 'మేము' లో సమస్త జాతిని ఎందుకు చేరుస్తారు? అలా చెయ్యటం ఏం నీతో, మర్యాదో కాస్త చెప్పండి.''

మనం గ్రహించాల్సిన మొదటి విషయం. ఏదో ఒక జాతికి మాత్రం అధికారికంగా సంక్రమించిన సద్గుణాలేవీ లేవు కాకపోతే, వ్యక్తుల్లో మాదిరి, కొన్ని జాతుల్లో - తక్కిన జాతుల్లో కన్నా - కొన్ని సద్గుణాలు, దాదాపుగా చూస్తే, కాస్త ఎక్కువగా వుండొచ్చును.

మనకు ముఖ్య విషయం 'ముక్తి'; పాశ్చాత్యులకు ముఖ్య విషయం 'ధర్మం'. మనకు కావలసింది ముక్తి; వారికి కావలసింది ధర్మం. ఇక్కడ ధర్మ శబ్దం మీమాంసకులు వాడే అర్థంలో ఉపయోగించబడింది. ధర్మమంటే ఏమిటి? ఈ లోకంలోనో, పరలోకంలోనో, సుఖానుభూతిని కాంక్షింపచేసేదే ధర్మం. ధర్మానికి కర్మమే మూలం. అది మానవుణ్ణి, సుఖం వెంట పరిగెత్తిస్తూ, రేయింబవళ్లు దానికై పరిశ్రమింప చేస్తుంది.

ముక్తి అంటేవే ఏమిటి? ఇహలోకంగాని, పరలోకంగాని ప్రకృతి నిలయాలకు అతీతం కాదుకాబట్టి ఇహలోకంలోని సుఖం సైతం దాస్య మని, పరలోకంలోని సుఖంకూడా అలాటిదే అనీ బోధించేదే ముక్తి; కాని ఆ సుఖాల కొక వ్యత్యాసం వుంది - యిక్కడిది ఇనుప సంకెల. అక్కడిది బంగారు సంకెల. అంతేగాక సుఖమనేదంతా - ఎక్కడి సుఖమైనా సరే - ప్రకృతి నియమాలకు లోబడిందే కాబట్టి, అంతం పొంది తీరుతుంది. శాశ్వతంగా నిలిచివుండబోదు. కాబట్టి మానవుడు ముక్తుడవటానికి ప్రయత్నించాలి. శరీర దాస్యానికి అతీతుడవాలి; దాస్యాన్ని అంగీకరించ రాదు. ఈ మోక్షపథం హిందూదేశంలో తప్ప మరెక్కడా లేదు. కాబట్టి ముక్తాత్ములు హిందూదేశంలో మాత్రమే వున్నారని, మరెక్కడా లేరని అనేకమార్లు చెప్పబడేమాట సత్యమైందే. కాని భవిష్యత్కాలంలో యితర దేశాల్లో సైతం ముక్తులుంటా రనటమూ పూర్తిగా సత్యమే. అది శుభ వార్త, మనకెంతో సంతోషవార్త. పూర్వం ఒకప్పుడు ధర్మం ముక్తికి అను గుణమై వుండేది యుధిష్ఠిరుడు, అర్జునుడు, దుర్యోధనుడు, భీష్ముడు, కర్ణుడు మొదలైన ధర్మారాధకులు; వ్యాసుడు, శుకుడు, జనకుడు మొద లైన ముక్తివాంఛాపరులు అప్పుడు కలసిమెలసి వుండేవారు. బౌద్ధమతం ప్రవేశించగానే ధర్మమార్గం మూలత్రోయబడి, మోక్షమార్గం ఒక్కదానికే ప్రాముఖ్యం ఏర్పడింది. కాబట్టే అగ్నిపురాణంలో ఉపమారూపభాషలో యిలా వ్రాయబడి వుంది: ''గయాసురుడు - అంటె బుద్ధుడు[1] - అంద రికీ మోక్షమార్గాన్ని చూపి లోకాన్ని నాశనమొనర్చ చూశాడు; కాబట్టి దేవతలంతాచేరి, మంతనాలాడి, మోసంచే అతణ్ణి శాశ్వత నిష్క్రియత్వ మవలంబింపచేశారు '' ఇది ఎలావున్నా, ముఖ్య విషయం ఏమంటే, యిప్పుడు ఎందరిచేతనో ప్రస్తావించబడుతున్న మన దేశ పతనానికి

1. స్వామీజీ యీ భావాన్ని తరువాత మార్చుకొని ''అగ్నిపురాణంలోని గయాసుర కద బుద్ధుణ్ణి గూర్చింది కానేకాదు'' అని వ్రాశారు - వివేకానంద సాహిత్య సర్వస్వం, లేఖలు చూడండి.

కారణం ''ఈ ధర్మం'' పూర్తిగా నశించటమే. మన దేశస్థులంతా మోక్ష పథాన్నే అవలంబించి, అభ్యసిస్తే మంచిదే. కాని అది సాధ్యమా! భోగా నంతరంగాని పరిత్యాగబుద్ధి కలుగనే కలుగదు; ముందు భోగాలనుభ వించు; తరువాత త్యాగం చెయ్యగలవు. అలాగాక జాతి అంతా, వున్న ట్లుండి సన్న్యాసమార్గాన్ని తొక్కితే, ఉద్దిష్టవాంఛ నెరవేరదు సరేకదా, మొదట వుందికూడా చేతినుండి జారిపోతుంది - చేతిలోని పక్షి ఎగిరి పోయింది, పొదలోని పక్షి దొరకలేదు!

బౌద్ధమతం మహోచ్ఛదశలో వున్నకాలంలో ప్రతి మఠంలోను వేల కొద్ది సన్న్యాసులుండేవారు. అప్పుడే దేశం నాశనమవటానికి ప్రారంభ మైంది! బౌద్ధులు, క్రైస్తవులు, మహమ్మదీయులు, జైనులు అజ్ఞతచేత అందరికీ ఒకే శాసనం, ఒకేసూత్రం విధిస్తారు. అది ఎంతో పొరపాటు; విద్యావిధానం, ప్రవర్తనవిధులు, ఆచారాలు, శాసనాలు, సూత్రాలు, వ్యక్తి మానవులకు, జాతులకు వారివారి స్వాభావిక వ్యత్యాసాల కనుగుణంగా భిన్నాలై వుండాలి. బలాత్కరించి అందరికీ ఒకే మార్గం విధింపబోవటం ఎలా ఉపకరిస్తుంది? ''మోక్షానికంటె వాంఛనీయమైంది యీ జీవి తంలో ఏదీ లేదు, మీ రెవరైనా కానివ్వండి, ప్రతివారూ వచ్చి దాన్ని స్వీక రించండి'' అని బౌద్ధులు ప్రకటించారు. ''అది ఎన్నడైనా సాధ్యమౌ తుందా?'' అన్నదే నా ప్రశ్న. హిందూశాస్త్రాలు యిలా చెబుతున్నాయి: ''నువ్వు గృహస్థుడవు, నీ స్వధర్మాన్ని నిర్వర్తించు.'' ఇదే సరి! ఒక్క అడుగుకంటె గెంతలేనివాడు, ఒక్క గంతున సముద్రం దాటి లంకకు పోతాడట! ఇది యుక్తియుక్తమైన మాటేనా? `నీ కుటుంబాన్నే పోషించు కోలేవు; కాని ముక్తివెంట పరుగులు పెడుతున్నావు! ''మోక్షం ధర్మాని కంటె ఎంతో శ్రేష్ఠమవటం సత్యమే. కాని ధర్మాన్ని ముందు పూర్తిగా నిర్వ ర్తించాలి'' అని హైందవ శాస్త్రాదేశం. ఇక్కడే బౌద్ధులు తికమకపడి ఎన్నో అనర్థాలు కలిగించారు. అహింస మంచిదే; అన్యాయానికి ప్రతీకారం చెయ్యకుండా వుండటం మహోన్నతమే - ఇవి ఉదాత్త సూత్రాలనటంలో

ఏమాత్రం సందేహం లేదు; కాని శాస్త్రా లిలా అంటున్నాయి: ''నువ్వు గృహస్థుడివి. నిన్నెవరైనా ఒక చెంపపై కొట్టినప్పుడు నువ్వు 'కంటికి కన్ను, పంటికి పన్ను'గా మారుచేత చెయ్యకపోతే (బదులు చెల్లించకపోతే), పాపం మూటకట్టుకుంటావనటం నిస్సంశయం.'' మను విలా చెబుతున్నాడు: ''నిన్నెవడైనా చంపవస్తే - అతడు బ్రాహ్మణుడైనా సరే - నువ్వు తణ్ణి చంపటం పాపంకాదు'' (మనుస్మృతి VIII. 350) ఇది ఎంతో నిజం, మరచిపోకూడని విషయం. ''వీరభోగ్యావసున్ధరా'' - ఈ భూమిని అనుభవించేది వీరుడే - కాబట్టి నీ వీరత్వాన్ని ప్రదర్శించు; సందర్భాను సారంగా రాజనీతి నిర్దిష్టాలైన సామ దాన భేద దండోపాయాలను ప్రయోగించి (అంటే సంధి చేసుకొనో, ద్రవ్యదానమొసగో, పరస్పర వైరాలు రేకెత్తించో, ప్రత్యక్షంగా పోరుజరిపో) నీ విరోధిని వశం చేసుకొని ప్రాపంచిక భోగాలను అనుభవించటానికి ప్రయత్నించు - అప్పుడు నువ్వు ధార్మికుడవవుతావు. అలా చెయ్యక, ఎవరైనా నిన్ను కాలదన్ని నేలరాయాలని అలా చేస్తే, నువ్వు ఆ అవమానాలను మౌనంతో భరించి వూరుకుంటే, నీ జీవితమే అప్రతిష్ఠపాలవుతుంది, నీ ఐహికజీవితం నరకప్రాయమౌతుంది; పారలౌకిక జీవితం మరో నరకమౌతుంది. ఇదే శాస్త్రబోధ. నీ స్వధర్మాన్ని నిర్వర్తించు - ఇది సత్యం, సత్యాతిసత్యం. ప్రియమైన నా స్వమతస్థులారా! యిదే మీకు నా హితోపదేశం. చెడ్డ పనులు చెయ్యవద్దు, ఎవరినీ హింసించవద్దు, ఎవరినీ పీడించవద్దు, యితరులకు మీ శక్తిమేరకు ఉపకారం చెయ్యండి. కాని యితరులు చెరుపు చేసినప్పుడు మౌనంగా దాన్ని భరించి వూరుకోవటం గృహస్థుడికి పాపం; వెంటనే అదే రూపంలో మారు చెల్లించ ప్రయత్నించాలి. గృహస్థుడు పూర్ణపరిశ్రమతో, పరిపూర్ణోత్సాహంతో ధనం ఆర్జించి, స్వకుటుంబాన్ని, పరులను పోషించి వారికి సుఖం చేకూర్చాలి. అలా చెయ్యలేకపోతే మనిషని ఎందుకు చెప్పుకుంటావు? నువ్వు సరైన గృహస్థువు కూడా కావు - నీలాంటి వాడికి మోక్షం సుదూరం.

ధర్మం కర్మపై ఆధారపడి వుంటుందని యిప్పటికే చెప్పాం. సమర్థతకలిగి నిరంతర కర్మాచరణలో నిమగ్నుడై వుండటం ధార్మికునికి స్వాభావికం. కర్మాచరణం విధింపని వేదభాగాలు నిజానికి వేదాలే కావని కొందరు మీమాంసకులుకూడా అభిప్రాయపడుతున్నారు! ''ఆమ్నాయస్య క్రియార్థ త్వాదానర్థక్య మతదర్థానామ్'' అనేది ఒక జైమినీ సూత్రం. (వేదాలు కర్మప్రతిపాదనార్థకాలే కాబట్టి, కర్మాచరణంతో ప్రసక్తాలుకాని వేదభాగాలు నిరర్థకాలు )

''ఓంకారాన్ని నిరంతరం ఉచ్చరిస్తూ, దాని అర్థాన్ని గురించి ధ్యానిస్తుండటంతో, సర్వాన్ని సాధించవచ్చును;'' ''భగవన్నామ స్మరణం వల్ల సర్వపాపాలు నశిస్తాయి;'' ''ఈశ్వర సంకల్పానికే ఆత్మార్పణ మొనర్చుకొనేవాడికి సమస్తం లభిస్తుంది'' - అవును, శాస్త్రాలు, సిద్ధపురుషులు పలికిన యీ మాటలు నిస్సంశయంగా యథార్థాలే కాని, మనలో అసంఖ్యాకులు జీవితకాలమంతా ఓంకారాన్ని గురించే ధ్యానిస్తూ, భగవన్నామంలోని భక్తిచే పారవశ్యమంది, ''నీ సంకల్పమే నెరవేరుతుంది, నేను నీకు పూర్తిగా శరణాగతుడనైనాను'' అని పలుకుతున్నారు కదా. వారికి అందువల్ల ఏం ఉపకృతి చేకూరింది? - పూర్ణానుస్వారం! ఇందుకు కారణమేమిటో చెప్పగలరా? కారణం యిది, దాన్ని పూర్తిగా గ్రహించాలి. ఎవడి ధ్యానం వాస్తవం, కార్యసాధకం? భగవత్సంకల్పానికి ఎవడు పూర్తిగా ఆత్మార్పణ మొనర్చుకొంటాడు? ఎవడు పిడుగులాంటి నిర్నిరోధశక్తితో భగవన్నామాన్ని ఉచ్చరిస్తాడు? చిత్తశుద్ధిని సాధించినవాడే. అంటే ఎవడి చిత్తం కర్మాచరణంతో పరిశుద్ధమైందో వాడు, అంటే ఎవడు 'ధార్మికుడో' వాడు.

ప్రతి మానవుడు ఒక శక్తి ప్రదర్శన కేంద్రం. పురాకృతఫలంగా యీ శక్తి సంచితమై వుంది. మనలో ప్రతివాడూ యీ శక్తిని తన వెనుక వుంచుకొనే పుడుతున్నాడు. ఈ శక్తంతా కర్మాచరణ రూపంలో వ్యయమై నిశ్శేషమయేదాకా ఎవడైనా వూరకేవుంటాడా? అంతదాకా అతడు తన

సత్కార్మవల్ల సుఖాన్ని, దుష్కార్మవల్ల దుఃఖాన్ని అనుభవించే తీరాలి; కర్మాచరణం నిలుపుకొని వూరకే వుండటం అతడికి అశక్యం. అంతవరకు అనుభూతులను కర్మాచరణాన్ని నిలుపుకోవటం సాధ్యం కాకపోతే, దుష్కార్మలు చెయ్యటంకంటె సత్కార్మలు చెయ్యటం, దుఃఖ మనుభవించటంకంటె సుఖాన్ని అనుభవించటం మేలుగదా. రాంప్రసాద్[1] యిలా అనేవాడు: '' 'మంచి', 'చెడు' అనే రెండు మాటలు వాడుకలో వున్నాయి, వాటిలో 'మంచి' చెయ్యటమే శ్రేయస్కరం.''

మనం యిప్పుడు ఆచరించాల్సిన 'మంచి' ఎలాటిది? మోక్షాన్ని అర్థించేవాడి 'మంచి' ఒకటి, ధర్మాన్ని అర్థించేవాడి 'మంచి' మరొకటి. గీతావిష్కరణం చేసిన శ్రీకృష్ణభగవానుడు తేటపరచటానికి ఎంతో ప్రయత్నించింది యీ మహాసత్యాన్నే; హైందవ మతంలోని వర్ణాశ్రమ ధర్మ వ్యవస్థ, స్వధర్మ సిద్ధాంతం దీని ఆధారంమీదే నిర్మించబడ్డాయి.

''అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహఙ్కారః సమదుఃఖ సుఖః క్షమీ॥'' *(గీత - XII, 13)*

(ఏ భూతం పట్లగాని ద్వేషం లేనివాడు, అన్ని భూతాల్లోనూ మైత్రీ, కరుణా వున్నవాడు, 'నేను', 'నాది' అనే భావాలు లేనివాడు, సుఖ దుఃఖాలను సమబుద్ధితో చేసేవాడు, ఓర్పు గలిగి వుండేవాడు) ఈ వర్ణన అంతా మోక్షమే జీవిత లక్ష్యమైన వాడికి వర్తిస్తుంది.

''క్లైబ్యం మా స్మ గమః పార్థ నైత త్త్వయ్యుపపద్యతే।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరన్తప॥'' *(గీత - II, 3)*

---

1 రాంప్రసాద్ వంగదేశస్థుడైన ఒక సిద్ధపురుషుడు; కాళికాంబికా భక్తుడు, సహజకవి ఆమెను స్తుతిస్తూ గీతిక లనేకం రచించాడు. వాటిలో మహోదాత్తాలైన ఆధ్యాత్మిక సత్యాలు ఎంతో తేటమాటల్లో పొందుపరచబడ్డాయి ఆ గీతికలు జీవంతోను, భక్తిరసంతోను ఒప్పారుతూ, అపార ప్రచారం కలిగి జనాదరణం పొందాయి. అతి నిమ్నదశలోని కృషీవలులు మొదలు విద్యాధికుల వరకు అందరూ ఆ గీతికల నాలాపించేటప్పుడు పారమార్థిక భావావేశం పొందుతారు

(పార్థా, కాపురుషుడవు కావద్దు, అలా అవటం నీకు తగదు శత్రు తాపకారివైన ఓ అర్జునా, తుచ్ఛమైన యీ మనోదుర్బలత్వాన్ని విడిచి, లే); అంతేకాక

''తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ।
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్॥''
''మయ్యైవైతే నిహతాః పూర్వమేవ।
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥'' *(గీత - XI, 33)*

(కాబట్టి నువ్వు లేచి, కీర్తిని ఆర్జించు, శత్రువులను జయించు, సమృద్ధమైన రాజ్యాన్ని అనుభవించు నాచేత వారు యిప్పటికే చంప బడ్డారు. సవ్యసాచీ, నువ్వు నిమిత్రమాత్రుడవవు )

గీతలోని యిలాటి మాటలన్నీ ధర్మానికి తోవచూపటానికోసం భగవంతుడిచే ఉద్దేశించబడ్డాయి కర్మాచరణంలో ఎప్పుడూ మంచి చెడులు కలిసే వుంటాయనటం అంద రెరిగిన విషయమే కర్మాచర ణంలో కొంచెంగానో, ఎక్కువగానో పాపం చెయ్యటం తప్పదు ఐతేనేం? కానివ్వు. ఊరకుండటంకంటె కొంచెం కర్మనైనా చెయ్యటం మంచిది కదా - పస్తుండటం కంటె కాస్తయినా తినటం మేలుకదా, పుణ్యపాప మిశ్రమమైనా కర్మమొనర్చటం, నిర్వ్యాపారులమై, శిలల్లా జడులమై, నిర ర్థకజీవనం గడపటంకంటె మేలుకదా? ఆవు ఎన్నడూ బొంకదు, రాయి ఎన్నడూ దొంగిలించదు మానవుడు బొంకుతాడు, దొంగిలిస్తాడు. కాని మానవుడే భగవంతు డవుతాడు సత్త్వగుణ ప్రాబల్యంతో మానవుడు నిష్క్రియుడై ఎల్లప్పుడూ ధ్యానదశలో మునిగి వుంటాడు; రజోగుణ ప్రాబల్యంవల్ల సత్కర్మలను, దుష్కర్మలనుకూడా చేస్తాడు; తమోగుణ ప్రాబల్యంతో మరల నిష్క్రియుడు, జడుడు అవుతాడు. ఒక వ్యక్తిలో సాత్త్వికప్రాబల్యం ఏర్పడిందా, తామసిక ప్రాబల్యం ఏర్పడిందా అని బాహ్య దృష్టితో కనుక్కోవట మెలాగో చెప్పండి? మనం ప్రస్తుతం ప్రశాంత

దశలో - సుఖదుఃఖాతీతులమై, కర్మాచరణ దశాతీతులమై - వున్నామో; అధమాధమ తామసిక దశకు కూలి, నిర్జీవులమై, నిర్వ్యాపారులమై, జడులమై, మృతపదార్థంలా - శక్తివిహీనులం కాబట్టి ఏ పనీ చెయ్యలేక - నిశ్శబ్దంగా, కాస్తకాస్తగా కుళ్లుతూ, మురిగిపోతున్నామో తెలుసుకోవటం ఎలా? ఈ ప్రశ్నను తీవ్రబుద్ధితో అడుగుతున్నాను. బదులు చెప్పండి. మీ మనస్సులనే చూడండి, మీకు నిజం తెలిసిపోతుంది కాని సమాధానం కోసం వేచివుండటం ఎందుకు? పళ్లనుబట్టి వృక్షాన్ని తెలుసుకోగలం కదా. సత్త్వం ప్రాబల్యం వహించినప్పుడు మానవుడు నిష్కర్ముడై, శాంతుడై వుండటం నిజమే; కాని ఆ నిష్కర్మత మహాశక్తుల కేంద్రీకరణ ఫలం, ఆ శాంతత అపారకార్యోత్సాహం జన్మభూమి ఆ మహాసాత్త్విక స్వభావుడు, ఆ మహనీయాత్ముడు, మనలా యిక కాళ్లు చేతులతో పని చెయ్యనక్కర్లేదు - సంకల్పమాత్రంచే, ఆతని కార్యాలన్నీ తక్షణమే నిర్దుష్టంగా నెరవేరుతాయి. అలాటి సత్త్వాధిక్యుడే సర్వవంద్యుడైన బ్రాహ్మణుడు అతడు యింటింటికి వెళ్లి తనను ఆరాధించండని యితరులను ప్రార్థించాలా? సర్వశక్తి సంపన్న ఐన జగన్మాత అతని ఫాలభాగంమీద స్వర్ణాక్షరాలతో స్వహస్తంతో యిలా వ్రాస్తుంది: ''మీరెల్లరూ యీ మహాపురుషుని, యీ నా కుమారుని ఆరాధించండి.'' లోకం అది చదివి, అలా చేస్తూ, అతని ముందు విధేయతతో వినమ్రశిరస్కయై ప్రణమిల్లుతుంది అలాటి పురుషుడు వాస్తవంగా,

''అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ
నిర్మమో నిరహఙ్కారః సమదుఃఖ సుఖః క్షమీ''[1]

అంతేగాక ప్రతి మాటను నమిలినట్లు ముక్కుతో మాట్లాడుతూ, వారం రోజులుగా పస్తున్నవాడిలా హీనస్వరంపడి, చిరిగిపోయిన తడి పేలిక గుడ్డలావుండి, కాలితో తన్నినా నోరెత్తక, రోషపడక పిరికిపందలైన ఆడంగి

1 అర్థం వెనుకటి పుటల్లో వుంది

పురుషుల్లో కనిపించే గుణాలు అధమ తమస్సును సూచిస్తాయి. అవి మరణ లక్షణాలు - సత్త్వలక్షణాలు కావు - కుళ్ళిపోయి దుర్వాసనవేసేవి. అర్జునుడు యిలాటివారిలో కూలబోతున్నందువల్లనే, భగవంతుడు అతడికి అంత విపులంగా గీతలో బోధించాడు. ఇది సత్యంకాదా? భగవంతుడి నోటవచ్చిన మొట్టమొదటి పలుకులు వినండి - ''క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుప పద్యతే'' (ప్రార్థా, పౌరుషవిహీనుడవు కావద్దు, అది నీకు తగదు). అంతేగాక తరువాత అన్న పలుకులూ వినండి: ''తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ'' (కాబట్టి నువ్వు లే, కీర్తి నార్జించు). జైన బౌద్ధాదుల విషప్రాయ భావాలకు వశులమై, మనం యీ తామసిక జన దళంలో చేరిపోయాం, - యీ గడచిన వెయ్యేళ్లనుండి దేశవాతావరణాన్నంతా భగవన్నామంతో నింపుతూ, భగవంతుని ప్రార్థిస్తున్నాం; కాని భగవంతుడు వాటికి చెవి ఒగ్గటం లేదు. ఎందుకు ఒగ్గుతాడు? బుద్ధిహీనుడి మొరలను మానవుడే ఎన్నడూ పట్టించుకోడుగదా, భగవంతుడు వింటాడని అనుకోవటం సబబా? కాబట్టి మనం తప్పించుకొని బైటపడేమార్గం భగవంతుని గీతోపదేశవాక్కులను అనుసరించటం ఒక్కటే: 'క్లైబ్యం మాస్మగమః పార్థ . . . తస్మాత్త్వముత్తిష్ఠ యశోలభస్వ ''

ఇప్పుడు తిరిగి మన ప్రస్తుత విషయం - ''ప్రాచ్యం - పాశ్చాత్యా''నికి పోదాం ముందుగా దానిలోని వైపరీత్యాన్ని చూడండి ఐరోపా దేశస్థుల రక్షకుడైన ఏసుక్రీస్తు యిలా బోధించాడు: ''శత్రువులుగా ఎవరినీ పరిగణించవద్దు; నిన్ను దూషించేవారిని ఆశీర్వదించు; నీ కుడి చెంపపై కొట్టినవారి వైపుకు ఎడమ చెంపను కూడా తిప్పు; నీ కర్మాచరణాన్నంతా చాలించుకొని పరలోకయాత్రకు సిద్ధంగా వుండు. ప్రపంచం అతితొందరలోనే అంతంకాబోతోంది.'' ఇక మన భగవానుడు గీతలో యిలా అంటున్నాడు: ''ఎప్పుడూ పరిపూర్ణోత్సాహంతో పనిచేస్తూండు, నీ శత్రువులను నిర్మూలించు, లోకాన్ని అనుభవించు.'' కాని చివరికి ఏసుక్రీస్తు, శ్రీకృష్ణుడు ఉద్దేశించిన దానికి ప్రత్యక్ష విరుద్ధంగా జరిగింది.

యూరపు దేశస్థులు ఏసుక్రీస్తు బోధకు ప్రాముఖ్యం అంతగా యివ్వలేదు. ఎల్లప్పుడూ కార్యతత్పరత్వానికి అలవడ్డవారు, అపార రాజసిక స్వభావులు అవటంచే వారు యువకోత్సాహంతో, పూర్ణ సాహసంతో, ప్రపంచంలోని సమస్త దేశాల సుఖాలను, భోగాలను సమకూర్చుకొని వాటిని తనివితీర అనుభవిస్తున్నారు. ఇక మనం, మూటముల్లెలు సర్దుకొని, ఓ మూల కూర్చుని, రేయింబవళ్లు మరణవిచారణ చేస్తూ ''నళినీదళగత జలమతి తరళం తద్వజ్జీవన మతిశయ చపలమ్'' (తామరాకుమీది నీళ్లు అతిచంచలం, అలాగే యీ జీవితం ఎంతో అస్థిరం) అని పాడుకొంటుంటాం. తత్ఫలితంగా మృత్యుదేవుడైన యముని భీతిచే మన రక్తం చల్లబారి, మాంసం భయకంపితమౌతోంది. దురదృష్టవశాత్తు యముడూ మన మాటలనే విశ్వసించినట్లు మహామారి, తదితర భయంకర వ్యాధులు మన దేశంలో ప్రవేశించాయి గీతాబోధానుసారం యిప్పుడెవరు ప్రవర్తిస్తున్నారు? ఐరోపా దేశస్థులు. ఏసుక్రీస్తు సంకల్పానుసారం ఎవరు ప్రవర్తిస్తున్నారు? శ్రీకృష్ణుని సంతతివారు! ఈ విషయాన్ని పూర్తిగా అవగాహన చేసుకోవాలి.

మోక్షమార్గాన్ని ముందుగా కనుగొని ప్రకటించినవి వేదాలు. పిదప బుద్ధుడు, ఏసుక్రీస్తు మొదలైన ప్రవక్తలు బోధించినదంతా ఆ ఏకైక మూలంనుండే గైకోబడింది. ఈ ప్రవక్తలు సన్యాసులు కాబట్టి వారు ''ఎవరినీ శత్రువులుగా భావించుకోలేదు. అందరి పట్ల స్నేహంతో, దయతో వుండిరి.'' అది వారికి సముచితం. కాని ఆ మోక్షమార్గాన్నే అవలంబించమని లోకాన్నంతా బలాత్కరించే యీ ప్రయత్నం ఎందుకు? రుద్ది, తోమి సౌందర్యాన్ని ఉత్పత్తి చెయ్యటం సాధ్యమా? తనకు మోక్షం అక్కర్లేదన్నవాడికి, మోక్షానికి అనర్హుడైనవాడికి బుద్ధుడు, ఏసుక్రీస్తు ఏం నిర్ణయించారు? ఏమీ లేదు. - మానవుడు మోక్షాన్నైనా పొందాలి, లేక నాశనానికి సంసిద్ధుడై వుండాలి. వారు వివరించింది యీ రెండు మార్గాలనే; మధ్యేమార్గ మేదీలేదు మోక్షేతరార్థానికి ప్రయత్నించటానికి మానవులకు

లేశమంత స్వాతంత్ర్యంకూడా యివ్వబడలేదు - ప్రపంచ సుఖాన్ని కొంత కాలం ఒకింత అనుభవించే మార్గమేదీ చూపబడలేదు. అందుకు అనువైన మార్గాలన్నీ సంపూర్ణంగా బంధింపబడటమేకాక, అడుగడుగునా అడ్డం కులుకూడా కల్పించబడ్డాయి. వేదచోదిత మతమొక్కటే ధర్మార్థకామ మోక్షాలనే నాలుగు పురుషార్థాలను సాధించే మార్గాలను ఏర్పరచింది. బుద్ధుడు మనలను పాడుచేశాడు అలాగే క్రీస్తు గ్రీకు, రోములను పాడు చేశాడు! పిదప కాలక్రమంలో యూరోపియన్లు ప్రాటెస్టెంట్ సంప్రదాయాన్ని అవలంబించి, పోపు అధికారం కింద ప్రవర్తిల్లుతూన్న క్రీస్తు బోధనలను యిటూ అటూ దులిపేసి, తెప్పరిల్లి సంతోషపడ్డారు హిందూ దేశంలో కుమారిలుడు మరల కర్మమార్గాన్ని - కర్మాన్ని మాత్రం నిర్దేశించేమార్గం - వ్యాప్తిలోకి తెచ్చాడు. శంకర, రామానుజులు ధర్మార్థ కామ మోక్షాలను సామరస్యంతో సముచిత భాగాలుగా అనుభవించటానికి నిర్ణయించబడ్డ సనాతన వైదిక మతాన్ని సుస్థిరంగా స్థాపించారు. తాను కోల్పోయిన ప్రాణాన్ని పునర్లభ్య మొనర్చుకొనే మార్గంలో జాతి యిలా పెట్టబడింది. కాని హిందూదేశంలో ముప్పైకోట్ల జనాన్ని మేలుకొల్పాలి. కాబట్టి ఆలస్యమౌతోంది. ముప్పైకోట్ల మందిని ఒక్క రోజులో పునర్జీవితులను గావించటం సాధ్యమా?

బౌద్ధమత, వైదికమత ఉద్దేశాలు భిన్నాలు కావుగాని బౌద్ధం అనుసరించే మార్గం సరైనది కాదు. బౌద్ధుల మార్గం సరైనదై వుంటే, మనం యిలా యింత పూర్తిగా ఎందుకు వినాశదశకు వచ్చాం? కాలం గడచినందువల్ల యిలా జరిగిందనటం నిష్ప్రయోజనం. కార్యచరణ నియమాన్ని అతిక్రమించి కాలం ఏంచెయ్యగలదు?

కాబట్టి బౌద్ధులు, వైదిక మతస్థులు ఒకే గమ్యాన్ని సాధించాలని ప్రయత్నించినా, బౌద్ధులు అపసవ్యమార్గం అవలంబించి, హిందూ దేశాన్ని అధోగతిపాలు చేశారు. బహుశ నా బౌద్ధసోదరు లీ మాటకు కోపం తెచ్చుకొని చిరచిరలాడుతూ ఉద్రేకపడతారేమో! కాని అందుకు

నేనేం చెయ్యగలను? నిజం చెప్పే తీరాలి. తత్ఫలితం ఏమైనా నాకక్కర్లేదు. వేదనిర్దిష్ట జాతి ధర్మమే సవ్యమైంది, సరైంది. జాతి ధర్మమంటే వివిధ కులాలకు నిర్ణీతమైన ధర్మం - స్వధర్మం, అంటే స్వకీయధర్మం. ప్రతి వ్యక్తికీ అతడి శక్తినిబట్టి, పదవినిబట్టి నిర్ణయించబడ్డ ధర్మం. ఇదే వైదిక మతానికి, వైదిక సంఘానికి మూలాధారం. నా దేశస్థులను పొగడుతున్నానని తలచి మరికొందరు మిత్రులు కోపగించుకొంటారేమో. ఇక్కడ వారి కో మాట - ఒకేసారిగా - అడగనివ్వండి. అలాటి పొగడ్తలవల్ల నాకేం ఉపకారం కలుగుతుంది? ధనం యిచ్చిగాని, మరే విధంలోగాని వారు నన్ను పోషిస్తున్నారా? అలా చెయ్యకపోవటమేగాక నేను క్షామ పీడితులను, అనాధ శిశువులను సంరక్షించటంకోసం హైందవేతర దేశాల్లో యాచించి సంపాదించే ధనాన్ని నావద్దనుండి గుంజుకోవటానికి ప్రయత్నిస్తారు. నేను యివ్వకపోతే నన్ను తిట్టి అపవాదోక్తులాడతారు! విద్యాధికులైన నా దేశస్థులారా, - నా దేశస్థులు యిలాటివారు. ముఖస్తుతులచే వారివల్ల ఏదీ లభించదని నాకు బాగా తెలుసు నేను వారిని పూర్తిగా ఎరుగుదును. వారిని మతిభ్రష్టులుగా భావించాలని నాకు తెలుసు. మతిభ్రష్టునికి మందు యివ్వపూనేవాడు దానికి బహుమతిగా తన్నులకు, కాట్లకు సిద్ధమై వుండాలని నాకు తెలుసు, అలాటి బహుమతికి సిద్ధపడి, బలాత్కారంగా వారి నోట్లో మందుపోసి, వారి చర్యలను ఓర్పుతో భరించేవాడే వారికి నిజమైన మిత్రుడు.

ఈ జాతి ధర్మం, యీ స్వధర్మం, సర్వ దేశాలలో వున్న ప్రతి సంఘం క్షేమంపొందే మార్గం - చివరికి మోక్షానికి తీసుకెళ్ళే నిచ్చెన. ఈ జాతి ధర్మం, యీ స్వధర్మం క్షీణించటంవల్లే మన దేశం పతనమయింది. కాని యీ కాలంలో అగ్రకులాలవారు సామాన్యంగా గ్రహించే అర్థంలో జాతిధర్మం ( లేక స్వధర్మం) మనం తప్పించుకోవలసిన కొత్త ఆపద అవుతోంది జాతిధర్మాన్ని గురించిన పరిపూర్ణ జ్ఞానం తమకుందని వారి భావం. కాని నిజానికి వారికది తెలియనే తెలియదు తమ గ్రామంలో

అనుసరించబడే ఆచారాలే వేద ప్రతిపాదిత సనాతనాచారాలని తలచి, అధి కారాలన్నీ తమవిగానే భావించుకొని వారు నాశనంకేసి వెళుతున్నారు! నా మాటలు వంశపారంపర్య కులవ్యవస్థను గురించిగాని, గుణభేదాలచే నిర్ణ యించబడే కులవ్యవస్థను గురించి కాదు. గుణ నిర్ణీత కులవ్యవస్థే ప్రధ మంలో వుండేదని నేనూ అంగీకరిస్తాను. కాని రెండు మూడు తరాల్లో గుణానికి బదులు జననానికి ప్రాధాన్యమియ్యబడింది. ఇందువల్ల మన జాతీయజీవన ఆయువుపట్టుకు దెబ్బతగిలింది; లేకపోతే మనం యిలాటి పతనస్థితికి ఎందుకు కూలిపోయాం? గీతలో ''సఙ్కరస్య చ కర్తా స్యాము హన్యామిమాః ప్రజాః'' (నేను వర్ణసంకర కారకుడనౌతూ, ప్రజల వినా శానికి కారణమౌతాను) అని వుందికదా. ఈ ఘోరవర్ణ సాంకర్యం - అన్ని కులాల సాంకర్యం - ఇంత గందరగోళపరిచే విధంలో - ఎలా ప్రాప్తిం చింది? గుణభేదాలనే పాటించకపోవటం ఎలా సంభవించింది? మన పూర్వులకు వుండిన శ్వేతవర్ణం యిప్పుడెలా నలుపుగా మారింది? సత్త్వ గుణం నశించి రజోగుణ వేగంతో కూడిన తమోగుణం యిప్పుడెందుకు వ్యాపించి వుంది? దీనికి సుదీర్ఘ వివరణం అవసరం కాబట్టి మరోసారి యీ ప్రశ్నకు బదులు చెబుతాను ప్రస్తుతం యీ సంగతిని గ్రహించ టానికి ప్రయత్నించండి - జాతిధర్మం సక్రమంగా, యధార్థంగా పరిర క్షింపబడితే, జాతి ఎన్నటికీ పతనం చెందదు. ఇది నిజమైతే మన పత నానికి కారణమైనదేది? జాతి ధర్మమూలం చెరుపబడిన దనటానికి మన పతనమే స్పష్టమైన తార్కాణం. అంటే, మన మిప్పుడు జాతిధర్మమని తలచేది దానికి ప్రత్యక్ష విరుద్ధమైందని తేలుతోంది. ప్రధమంలో మీ శాస్త్రా లను జాగ్రత్తగా, పరిశీలనబుద్ధితో చదవండి. శాస్త్రాల్లో కులధర్మమని పేర్కొబడింది యీ దేశంలో సామాన్యంగా సర్వత్రా అదృశ్యమైందని మీ కప్పుడు సులభంగా తెలిసిపోతుంది. ఇప్పుడు యథార్థరూపమైన జాతి ధర్మాన్ని పునరుద్ధరిస్తే, దేశానికి మహోపకారం చేసినవారౌతారు. నేను నేర్చింది, గ్రహించింది మీకు స్పష్టంగా తెలుపుతున్నాను. మీ రక్షణార్థం

ఏదో ఒక విదేశంనుండి నేనిక్కడకు పంపబడ్డవాణ్ణిగాను. కాబట్టి మీ వెర్రి మొర్రి ఆచారాలన్నింటినీ ప్రమాణీకరించి, అవి శాస్త్రసమ్మతాలని సమర్థించటం నా పని కాదు; మన విదేశీయ మిత్రులు ఆ పనిని నిర్వ్యాయంగా చెయ్యగలరు. కనుక వారికది కష్టంకాదు. మీరు వారిని స్తుతించి కరతాళ ధ్వనులతో వారిని సంతుష్టుల నొనరించండి. వారు కోరే పదార్థం అదే. కాని నేను మీ ముఖాలమీద బురదను, దుమ్మును పులిమితే, అది నా ముఖంమీదకూడా పడుతుందని మీ రెరుగరా? ఐతే ఏం?

ప్రతి జాతికీ ఒక జాతీయ కర్తవ్యం వుంటుందని నేను వేరే సందర్భంలో చెప్పాను. ప్రకృతి నియమానుసారంగానో, మహాపురుషుల మహోత్కృష్ట బుద్ధిబలంతోనో, ప్రతి జాతి సాంఘికాచార మర్యాదలు ఆ జాతీయ కర్తవ్యం సిద్ధించటానికి అనువుగా ఏర్పరుపబడుతూన్నాయి. ప్రతి జాతి జీవితంలోను, ఆ కర్తవ్యం, దాని సిద్ధికి అత్యావశ్యకాలై వుండే ఆ ఆచారమర్యాదలు తప్ప తక్కినవన్నీ అనావశ్యకాలు. ఆ అనవసర ఆచార మర్యాదలు అభివృద్ధి పొందినా, అదృశ్యమైనా ఒక్కటే; కాని జాతీయ జీవన ముఖ్య కర్తవ్యానికి హాని దాపురిస్తేమాత్రం జాతి అంతంపొందే తీరుతుంది.

మేం చిన్నప్పుడు తన ప్రాణం ఒక చిన్నపక్షిలో వుండే ఒక రాక్షసి కథ విన్నాం ఆ పక్షిని చంపితేగాని ఆ రాక్షసి చావదు. జాతి జీవితంకూడా యిలాంటిదే. మరో విషయాన్నికూడా మీరు గమనించవచ్చు. జాతీయ కర్తవ్యానికి అంతగా సంబంధించని హక్కులు కొన్ని లాక్కోబడ్డా, జాతికి అధికకష్టం తోపదు - కొన్ని ఎందుకు, అన్నీ లాక్కోబడ్డా ఉంతే. కాని, తన జాతీయ కర్తవ్యానికి - తన జాతీయ జీవనానికి ఆధారమైనదానికి - ఏ కొంచెంపాటి దెబ్బతగిలినా, అది అపారశక్తితో ప్రతీకారం చూపుతుంది.

మూడు సజీవ జాతుల - ఫ్రెంచ్, ఆంగ్లేయ, హైందవ - చరిత్రలు మీరు చాలవరకు ఎరుగుదురు ఆ జాతుల విషయాన్ని ఉదాహరణగా తీసుకోండి; ఫ్రెంచ్ వారి మనస్తత్వానికి రాజకీయ స్వాతంత్ర్యమే వెన్నెముక

లాంటిది. ఫ్రెంచ్ ప్రజలు నానారకాల ఒత్తిడులను శాంత[illegible] భరిసారు; అధిక పన్నులు విధించండి, వారేమాత్రం ఆక్షేపించరు, [illegible]తినంతా సైన్యంలో చేరమనండి, వారేమీ మొరపెట్టుకోరు; కాని ఎవరైనా వారి రాజకీయ స్వాతంత్ర్యం జోలికిపోయారా, జాతంతా ఏకమై లేచి ఉన్మత్తావేశంతో ప్రతిఘటిస్తుంది. "మాపై అధికారం చెలాయించే పదవి నెవ్వరినీ ఆక్రమించుకోనివ్వం. మా దేశాన్ని పరిపాలించుకోవటంలోను, మా సంఘాన్ని మా యిష్టానుసారం నడుపుకోవటంలోను ప్రాజ్ఞులకు, అజ్ఞులకు, ఉన్నత నిమ్నశ్రేణులకు - మాకందరికీ సమానాధికారం వుంది." ఇదే ఫ్రెంచ్‌వారి స్వభావంలోని మూలసూత్రం. ఈ స్వాతంత్ర్యం జోలి కెళ్లేవారు ఆపదల పాలవుతారు.

ఆంగ్ల జాతీయ మనస్తత్వంలో "ఇచ్చిపుచ్చుకోలు" మార్గం - వణిజసహజమైన వర్తకమార్గం - స్వాభావికమై వుంటుంది. ఆంగ్లేయులు నిష్పాక్షికత్వాన్ని, అధికారాల పంపకంలో హెచ్చుతక్కువలు లేకుండటాన్ని ముఖ్యంగా గమనిస్తారు. ఆంగ్లేయుడు రాజుకు, కులీనుల అధికారాధిక్యాలకు వినమ్రతతో లోబడి వుంటాడు; కాని తను ఒక దమ్మిడీ యియ్యవలసి వచ్చినా అందుకు కారణం వివరణ సైతంగా తెలుసుకోగోరతాడు. రాజు వుండటం అతడి కిష్టమే; రాజు ఆజ్ఞకు బద్ధుడై వుండటానికి, అతణ్ణి గౌరవించటానికి అతడు సంసిద్ధుడు. కాని ఆ రాజు ద్రవ్యం కోరితే ఆంగ్లేయుడిలా అంటాడు: "సరే; కాని అది ఎందుకోసం కావాలి, దాంతో ఎలాటి ఉపకారం కలిగేది నాకు ముందు చెప్పండి; తదనంతరం ఆ ద్రవ్యాన్ని ఎలా వెచ్చించాలో ఆ విషయాన్ని గూర్చి నా అభిప్రాయం యివ్వాలి; ఆ తరువాతే నేను ధనాన్నిస్తాను." ఆంగ్లేయులనుండి బలాత్కారంగా ధనం లాక్కోవాలని చూసిన రాజొకడు పెద్ద విప్లవాన్ని కలిగించాడు. ఆ రాజును వారు చంపేశారు

రాజకీయ స్వాతంత్ర్యం, సాంఘిక స్వాతంత్ర్యం మంచివే, ఉపయుక్తాలే, కాని అసలు విషయం - మనకు యథార్థంగా కావలసింది - పార

మార్థిక స్వాతంత్ర్యం, ముక్తి అని హిందువంటాడు. ఇదే మన జాతీయ పరమలక్ష్యం; వైదికుడుగాని, జైనుడుగాని, అద్వైతిగాని, విశిష్టాద్వైతిగాని, ద్వైతిగాని అందరూ యీ విషయంలో ఒకే అభిప్రాయం కలిగి వుంటారు. ఒక్క విషయాన్ని మాత్రం వదిలిపెట్టి, నీ యిష్టం వచ్చినట్లు చెయ్యి. హిందువు నోరెత్తక, అప్రసక్తుడై వుంటాడు. కాని ఆ విషయంలో అతణ్ణి దూషించావా జాగ్రత్త, నీ వినాశం సిద్ధం. అతడి ఆస్తినంతా దోచుకో, అతణ్ణి కాలతన్ను, అతణ్ణి 'నిగ్గర్' (నీగ్రో) అనో, అలాటి మరో పేరనో సంబోధించు అతడు అంతగా పట్టించుకోడు; ఆ ఒక్క మార్గాన్ని మాత్రం - మత సంబంధమైన ద్వారాన్ని మాత్రం - నిరాటంకంగా, ఉప ద్రవరహితంగా వుండేట్లు తెరిచివుంచు. పఠాను రాజశ్రేణులు ఎలా వస్తూ, పోతూ వున్నారో చూడండి కాని భారత సామ్రాజ్యాన్ని వారెవరూ సుస్థి రంగా వశం చేసుకోలేకపోయారు. హిందూమతాన్ని వారు ఎప్పుడూ ప్రతి ఘటిస్తుండటమే యిందుకు కారణం. ఇక మొగలాయి రాజ్యం వంక చూడండి అది ఎంత సుస్థిరంగా, ఎంత బలిష్ఠమై వుండినది! ఎందువల్ల? మొగలాయీ సామ్రాజ్యానికి హిందువులే ప్రాపులై వుండిరి. జహంగీర్, షాజహాన్, దారాశికోహ: వీరందరి తల్లులూ హిందువులే అని మీరెరుగరా? ఇప్పుడు దీన్ని చూడండి - దుర్విధిప్రేరితుడైన ఔరంగజేబు దాని జోలికి పోగానే, అతివిస్తృతమైన మొగలాయీ సామ్రాజ్యం ఒక్క క్షణంలో కలలా అదృశ్యమైంది. ఆంగ్లేయ ప్రభుత్వం హిందూదేశంలో యింత స్థిరంగా పాదుకొని వుండటానికి కారణం ఏమిటి? వారు యీ దేశ మతాన్ని ఏ విధంగానూ తాకకుండటమే ప్రజ్ఞావంతులమని భావించుకొన్న క్రైస్తవ మత ప్రచారకులు దాన్ని తాకి చూశారు. అందుకు ఫలితమే 1857 వ సం॥ సిపాయిల తిరుగుబాటు! ఆంగ్లేయు లీ విషయాన్ని పూర్తిగా గ్రహించి వుండబట్టే వారి ప్రభుత్వం చెడక, నిశ్చలంగా నిలిచివుంది. ఆంగ్లే యులు - వారిలో దూరదృష్టివున్న ప్రాజ్ఞులు - కూడా యీ విష యాన్ని గ్రహించి అంగీకరిస్తారు - లార్డ్ రాబర్ట్ ''ఫార్టీవన్ ఇయర్స్ ఇన్

ఇండియా'' ('ఇండియాలో నలభై ఒక్క సంవత్సరాలు') అనే గ్రంథంలో 30,31 అధ్యాయాలు చదివి చూడండి.

ఈ రాక్షసి ఆత్మ ఎక్కడ నెలకొనివుందో మీకిప్పుడు స్పష్టంగా తెలిసింది గదా - మతంలో. దాన్నెవరూ నశింపచెయ్యలేకపోయారు. కనుక హిందూజాతి ఎన్నో కష్టాలను, ఎన్నో ఆపదలను అనుభవించీ, యింకా జీవించి వుంది. ''జాతి ఆత్మను మతంలో వుంచటం ఎలా ఉపయుక్తం? తక్కిన జాతుల్లా మనమూ దాన్ని సాంఘిక స్వాతంత్ర్యంలోనో, రాజకీయ స్వాతంత్ర్యంలోనో ఎందుకు నిలుపకూడదు?'' అని విద్వాంసుడొకడు ప్రశ్నిస్తున్నాడు. అలా మాట్లాడటం తేలికే. మతం, పారమార్థిక స్వాతంత్ర్యం, ఆత్మ, ఈశ్వరుడు, ముక్తి! యివన్నీ యథార్థాలు కావని చర్చ నిమిత్తం అంగీకరిద్దా మనుకోండి. అప్పుడు విషయం ఎలావుంటుందో చూడండి. ఒకే అగ్ని వివిధ రూపాలను దాల్చి ఎలా కనిపిస్తుంటుందో అలాగే ఒకే మహాశక్తి ఫ్రెంచ్‌వారిలో రాజకీయ స్వాతంత్ర్యంగాను, ఆంగ్లేయుల్లో వాణిజ్య నైపుణ్యంగాను, నైతిక ప్రవర్తన సీమాభివ్యాపనంగాను, హిందువుల్లో మోక్షేచ్ఛ (లేక) పారమార్థిక స్వాతంత్ర్యంగాను అభివ్యక్తమౌతోంది. ఫ్రెంచ్‌వారి, ఆంగ్లేయుల ప్రస్తుత జాతీయశీలం అనేక శతాబ్దాల భాగ్య పరిణామ ద్వారంలో, ఆ మహాశక్తి ప్రోద్బలంచేతనే రూపొందిందని, హైందవజాతి శీలంకూడా అలాగే, ఆ మహాశక్తి ప్రోద్బలంచేతనే, ఎన్నో వేల శతాబ్దాలు పరిణామమొంది యిప్పటి రూపానికి వచ్చిందని, జ్ఞప్తిలో వుంచుకోవాలి మిమ్మల్ని నేను యీ ప్రశ్నను తీవ్ర బుద్ధితో అడుగుతున్నాను: ఎన్నో వేల సంవత్సరాలుగా పరిణామమొందిన స్వజాతీయ శీలాన్ని విడనాడటం సులభమా, కొన్ని నూర్ల సంవత్సరాల లోపే మనలో మిశ్రితమైన విదేశ జాతీయ శీలాన్ని విడనాడటం సులభమా? ఆంగ్లేయులు తమ సమరశీలతను మర్చిపోయి, కలహాలను, రక్తపాతాన్ని విడిచిపెట్టి, తమ మతాన్ని జీవిత పరమార్థంగా చేసుకోవటంలోనే శక్తినంతా ఏకాగ్రం చేసి ప్రశాంతంగా, మౌనంగా ఎందుకు కూర్చోరు?

అసలు సంగతేమంటే, ఏరు తన జన్మస్థానమైన పర్వతాలనుండి వెయ్యి మైళ్లు ప్రవహించింది. ఇప్పుడది తన జన్మస్థానానికి పోతుందా, పో గలదా? ఎప్పుడైనా అది వెనక్కు మరలాలని ఉద్యమిస్తే బహుముఖాలుగా చెదరి, ఎండిపోతుంది. ఎలాగైనా ఆ ఏరు త్వరగానో, ఆలస్యంగానో మైదాన మనోజ్ఞ సమభూమిగుండా ప్రవహించో, మురికినేలగుండా పెనగు లాడి ప్రవహించో సముద్రంలో చేరటం నిస్సంశయం. ఈ పదివేల ఏళ్ల నుండి సాగివస్తూన్న మన జాతీయ జీవితం ప్రమాదజనిత మార్గాన్ని పట్టివుంటే, యిప్పుడు దాన్ని సరిచేసే దారిలేదు; నూతన శీలాన్ని యిప్పుడు నిర్మించుకోవాలనుకుంటే దానివల్ల కలిగే అనివార్యఫలం మన మరణమే.

కాని అలా తలచటం - మన జాతీయాదర్శం ప్రమాద జనితమని తలచటం - కేవలం అజ్ఞత అని, అపార్థ కల్పనాఫలమని నా ఉద్దేశం. ఇలా అన్నందుకు నన్ను క్షమిస్తారని ఆశిస్తాను. ముందుగా యితర దేశాలకు వెళ్లి, ఆ దేశాల ఆచారాలను, అక్కడి స్థితిగతులను స్వయానా మీ కళ్లతో - యితరుల కళ్లతో కాదు - జాగ్రత్తగా గమనించి, వాటిని గురించి సవి చారబుద్ధితో - మీ కలాటిది వుంటే - యోచించండి; పిదప మీ దేశ శాస్త్రాలను, మీ ప్రాచీన వాఙ్మయాన్ని అధ్యయనం చేసి, హిందూదేశం అంతటా పర్యటించి, వివిధ ప్రాంతాల్లోని ప్రజల ఆచార వ్యవహార మార్గా లను పూర్ణవికసిత నేత్రాలతో, పరిశీలన దృష్టితో - మూఢదృష్టితో కాదు - కనిపెట్టండి. అలా చేశారంటే, జాతి యింకా చెక్కుచెదరక జీవించే వుందనీ, జాతీయ జీవితం నిస్సంశయంగా స్పందిస్తూందనీ విస్పష్టంగా - మధ్యందిన మార్తాండుడంత విస్పష్టంగా - కనిపిస్తుంది అంతేగాక జాతీయ జీవితాగ్ని బూడిదచే కప్పబడి వుండటంతో నిర్జీవవస్తువుగా తోస్తున్నా అది రగులుతోనే వుందని, మతమే మన జాతి జీవమని, మతమే దాని భాష అని, మతమే దాని భావమని, మీకప్పుడు తెలుస్తుంది; ఇంతే కాక మీ రాజ్యతంత్రం, మీ సంఘం, మీ పురపాలక సమాజం, మీ మహా

మారి నిరోధనోద్యమం, మీ క్షామ నివారణానికై మీ రొనరించే ప్రయత్నం, ఇవన్నీ యిక్కడ - గతంలో ఎప్పుడూ చేయబడేటట్లే యిక మీద కూడా - మతమూలంగానే చేయబడుతుందని మీ కప్పుడు తెలియ వస్తుంది. లేకపోతే మిత్రమా, ఉద్రేకపూర్వకాలైన యీ ఏడ్పులు, అర్పులు వ్యర్థాలుగా పరిణమిస్తాయి.

అంతేగాక ప్రతిదేశంలో ఆచరించబడేది నిజానికి ఒకే మార్గం; - అంటే కొంతమంది బలవంతులు ఎలా చెప్తారో అలాగే జరగటం. తక్కి నవారంతా 'గొర్రెదాటు'గా ఆ మార్గాన్ని అనుసరిస్తారు అంతే. మీ పార్ల మెంటును, మీ సెనెట్‌ను, మీ ఓటును, మెజారిటీని, మీ బ్యాలెట్‌ను నేను చూశాను. మిత్రమా, అన్ని ప్రాంతాల్లోను జరిగేది ఒక విధంగానే, ప్రతి దేశంలోను ప్రబలులైనవారు తమకు యిచ్ఛవచ్చినట్లు సమాజాన్ని నడిపిస్తున్నారు. ఇతరులను గొర్రెమందలకు పోల్చవచ్చును. హిందూ దేశంలో యీ ప్రజలెవరు అనేదే యిప్పటి ప్రశ్న - వారు ఋషులు, ఆచా ర్యులు, అవతారపురుషులు. మన సంఘాన్ని నడిపించేది వీరే; అవసర మైనప్పుడు మన సాంఘిక నియమాలను, సాంఘికాచారాలను మార్చేదీ వారే; వారి మాటలను మనం నోరెత్తక విని, వారి ఆజ్ఞను శిరసావహిస్తాం. మన పద్ధతిలో వున్న విశేషం యిది, ఇతర దేశాలలో మాదిరి 'మెజా రిటీ', 'ఓటు', 'బ్యాలెట్', మొదలైన వాటితో అనావశ్యకమైన ఆర్భాటం, గందరగోళం, తత్సంబంధాలైన పోరాటాలు మన దేశంలో వుండవు. అంతే.

ఓటు, బ్యాలట్ మొదలైన వాటివల్ల పాశ్చాత్య దేశాల్లో సామాన్యునికి లభించేటంత లౌకిక విషయజ్ఞానం మనకు లభించదనటం నిజమే; కాని రాజ్యవ్యవహార నిర్వహణమనే పేరుతో ఇతరులను దోచుకొని, ప్రజా సామాన్య జీవిత రక్తాన్నే తాగి, బలిసి కొవ్విన వర్గంవారు యూరప్‌లో మాదిరి మన దేశంలో లేరు. ఈ రాజ్యతంత్రజ్ఞుల వ్యవహార నిర్వహణ రంగానికి వెనుక కానవచ్చే ఘోరదృశ్యాన్ని - అలాటి సమయాల్లో

అభ్యసించబడే ఆ లంచగొండితనపు ఉన్మత్తావేశ నృత్యాలు, ఆ పట్టపగటి యింటి దోపిళ్లు, మానవులు చేసే ఆశాపిశాచ తాండవాలు - మిత్రమా, నువ్వెన్నడైనా చూడటం తటస్థిస్తే, మానవుణ్ణి గురించి నిరాశాగ్రస్తుడ వవుతావు! ''పాలు అమ్మటంకోసం యింటింటికి వెళ్లి విచారించాలి, కాని కల్లుదుకాణం మనుషులతో కిక్కిరిసి వుంటుంది. సౌశీల్యభూషిత స్త్రీకి మానాన్ని కాపాడుకొనేపాటి వస్త్రమైనా దొరకదు, కాని బజారుకెక్కిన స్త్రీ మోయలేనన్ని సొమ్ములు ధరించి కులుకుతుంది.''[1] ధనవంతులు దేశ పరిపాలనాన్ని తమ చేతిలో వుంచుకొని, ప్రజల్లోని సారాన్నంతా పీల్చి పిప్పిచేసి, పరాయిదేశాల్లో యుద్ధం చేసి చావటానికి వారిని సైనికులుగా పంపుతున్నారు. విజయం దక్కితే, రణాంగణంలో ఆ ప్రజలు తమ రక్తాని ధారపోసి సంపాదించిన ధనంతో బొక్కసాలు నింపుకొనే మార్గం యిది. ఇక ఆ వశవర్తులైన ప్రజల విషయం ఏమిటి? రక్తాన్ని సమర్పించటమే వారి పని! ఇదే రాజ్యతంత్రం! మిత్రమా, ఆశ్చర్యపడొద్దు, ఆ వ్యూహంలో చిక్కుకొని మైమరవొద్దు

ప్రథమంలో యీ విషయాన్ని గ్రహించటానికి ప్రయత్నించు. శాస నాలను మనిషి నిర్మిస్తాడా, మనిషిని శాసనాలు నిర్మిస్తాయా? ధనాన్ని మనిషి ఆర్జిస్తాడా, మనిషిని ధనం ఆర్జిస్తుందా? పేరు ప్రతిష్ఠలను మనిషి సంపాదిస్తాడా, మనిషిని అవి సంపాదిస్తాయా?

మిత్రమా, ముందు 'మనిషి'వవు; అప్పుడు యివీ, తదితరాలూ తమంతట తామే నిన్ను వెతుక్కొని వస్తాయి హేయమైన ఆ అసూ యను, కుక్కల మాదిరి పరస్పరం కాట్లాడుకొంటూ, మొరుగుతూ వుండటాన్ని విడిచిపెట్టండి, సదుద్దేశాలను, సత్సాధనాలను, నైతిక పౌరు షాన్ని చేపట్టి ధీరుడవై వుండు. మానవజన్మ ఎత్తినందుకు, చేటుచెంద

---

1 ఇదొక విజ్ఞుని భావం చిత్తశుద్ధినిగాని, సద్గుణాన్నిగాని లక్ష్యపెట్టక, ఇంద్రియాలకు యింపొనగూర్చే విషయాలకే ప్రాముఖ్యమిచ్చే సంసార విధానాన్ని కవి యిక్కడ చిత్రించాడు

జాలని జాడలను నీ వెనుక నిలిపిపో. "ఓ తులసీ,[1] నువ్వు యీ ప్రపంచంలో ముందుగా ప్రవేశించినప్పుడు లోకం సంతోషించింది, నువ్వు ఏడ్చావు. నువ్వు యీ లోకాన్ని వదలిపోయేటప్పుడు నీకోసం లోకం ఏడ్చేటట్లుగా, నువ్వు ఆనందంతో నవ్వుతున్నట్లుగా, ఏర్పడే రీతుల్లో కార్యాలొనరుస్తూ జీవితాన్ని గడుపు" ఇలా చెయ్యగలిగితే, నీ మానవ నామం సార్థకమౌతుంది. చెయ్యకపోతే, నువ్వు పుట్టి ఏంచేసినట్లు?

మిత్రమా, నువ్వు పిదప గ్రహించాల్సిన విషయం. మనం యితర జాతులనుండి నేర్చుకోవలసిన విషయాలు ఎన్నో వున్నాయి. తాను నేర్చుకోవలసిన విషయం యింకేదీ లేదని చెప్పేవాడు అవసానదశకు వచ్చాడని స్పష్టం. తనకు సమస్తం తెలుసునని పలికే జాతీ వినాశదశకు వచ్చేస్తుంది. "నాలో ఊపిరి వున్నంతదాకా నేను నేర్చుకొంటూనే వున్నాను." కాని మనం యీ సందర్భంలో గమనించాల్సిన విషయం ఒకటుంది - యితరులనుండి మనం గ్రహించే అన్నిటిని మన మార్గానికి అనువుగా మలచుకోవాలి. ఇతరులు నేర్పగలదంతా మనకున్నదాన్లో చేర్చుకొంటాంగాని స్వకీయమైనదాన్నంతా చెక్కుచెదరకుండా కాపాడుకోవటానికై జాగ్రత్త పడాలి. ఒక ఉదాహరణ: యూరోపియన్ల విధానంలో నేను వంట చేయించుకోవాలనుకుంటాను. భోజనం చేసేటప్పుడు యూరోపియన్లు కుర్చీలపై కూర్చుంటారు, మనం నేలమీద కూర్చుంటాం. వారి ననుకరించటానికి నా భోజనాన్ని బల్లమీద పెట్టమని నేను గంటకంటె ఎక్కువ సేపు కుర్చీలో కూర్చుంటే, నా కాళ్లు యమద్వారానికి వెళ్లటానికి తయారై, నేను బాధతో గిజగిజలాడసాగుతాను. దీనికి నువ్వేమంటావు? వారి రీతి వంటకాన్ని ఆరగిస్తున్నా, భోజనకాలంలో నేను మనలాగా నేలపైనే కూర్చోవాలి. ఇలాగే మనం యితరులనుండి ఏం నేర్చుకొన్నా, దాన్ని

1. తులసీదాసు కవి, భక్తుడు, హిందీ రామాయణ కర్త కవి తనకుతానే యిక్కడ బోధించుకొంటున్నాడు. పారమార్థిక భావపూర్ణాలు, ప్రాపంచిక జనానికి హితోపదేశ రూపాలు ఐన యిలాటి వాక్యాలు ఆ గ్రంథంలో ఎన్నో వున్నాయి.

మన దారికి అనువుగా మార్చుకోవాలి; మన జాతీయ విశిష్టతను పూర్తిగా నిలబెట్టుకోవాలి. నన్నో ప్రశ్న అడగనివ్వండి: ''మనిషి దుస్తులు ధరిస్తాడా, దుస్తులు మనిషిని ధరిస్తాయా? అసాధారణ బుద్ధిగలవాడు ఏ వస్త్రాన్ని ధరించినా, గౌరవాన్ని పొందుతాడు; కాని నావంటి బుద్ధిహీనులు చాకలిగాడిద మాదిరి ఎన్ని వస్త్రాలు ధరించినా, వారి నెవరూ లక్ష్య పెట్టరు.''

## ప్రాచ్య పాశ్చాత్య ఆచారాలు

ఉపోద్ఘాతంగా వ్రాయబడ్డ పూర్వోక్త విషయం సుదీర్ఘంగా పరిణమించింది. కాని యిదంతా చెప్పాక యీ రెండు జాతులను పోల్చటం కాస్త తేలిక అవుతుంది వారు మంచివాళ్లే - మనమూ మంచివాళ్లమే. ''ఒకరిని నిందించి మరొకరిని స్తుతించటం సరికాదు; త్రాసులోని రెండు పళ్లాలు సరిసమానంగానే వున్నాయి.'' కాని మంచిలోనూ తరతమత్వాలుంటాయి గదా. అంతే.

మానవుని నిర్మాణంలో శరీరం, మనస్సు, ఆత్మ అనే మూడు వస్తువులుంటాయని మనవారంటారు. ఈ అన్నిటిలో వెలుపలిదైన శరీరాన్ని ముందుగా తీసుకొందాం.

శరీరంలో ఎన్ని రకాలైన భేదాలున్నాయో ముందు చూద్దాం - ఎన్ని రకాలైన ముక్కులు, ముఖాలు, వెంట్రుకలు, పొడవులు, రంగులు, లావులు మొదలైనవి! శరీరం రంగులు రక్తమిశ్రణం వల్ల రకరకాలుగా మారతాయని మానవ శరీర శాస్త్రజ్ఞుల అభిప్రాయం ఆయా ప్రాంతాల శీతోష్ణస్థితులు రంగును కొంత మార్చగలిగి వున్నా, మార్పుకు ముఖ్య కారణం మాత్రం వంశపారంపర్య సంబంధమైనదే. ప్రపంచంలో అత్యంత శీతల ప్రాంతాల్లోకూడా నల్లరంగువారు కనిపిస్తారు అలాగే అతిఉష్ణ ప్రాంతాల్లో తెల్లవారు వుంటారు. అమెరికా ఖండంలోని కెనడా దేశంలో ఆదిమవాసులది, ఉత్తరధ్రువ ప్రాంతంలోని ఎస్కిమోలది తెల్లరంగుకాదు;

కాని భూమధ్యరేఖా ప్రాంతంలోని బోర్నియో, సెలెబీసు మొదలైన చోట్లలోని ఆదిమవాసులది తెలుపురంగు!

హైందవ శాస్త్రానుసారం హిందువుల్లో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలు మూడు, హిందూదేశానికి బైటవుండే చీన్, హూణ, దరద్, పహ్లవ, యవన, ఖశ జాతులన్నీ ఆర్యజాతులు శాస్త్రాల్లో పేర్కొ బడ్డ యీ చీనులు ఆధునిక చైనీయులు కారు. అసలు ఆ కాలపు చైనా దేశ స్థులకు చీనులనే పేరేలేదు. కాశ్మీర ఈశాన్య ప్రాంతంలో చీనులనే ఒక బలిష్ఠజాతి - ప్రత్యేకమైంది - వుండేది. హిందూదేశానికి, ఆఫ్ఘని స్థానానికి మధ్య - యిప్పుడు కొండజాతులు నివసించే చోట - దరదులు వుండేవారు. ఈ ప్రాచీన చీనుల్లో మిగిలినవారు నేటికీ కొంతమంది వున్నారు 'దరిదిస్థానం' యిప్పటికీ నిలిచే వుంది కాశ్మీర చరిత్ర గ్రంథమైన 'రాజతరంగిణి' లో శక్తివంతమైన దరద్ ప్రభుత్వ ఆధిపత్యం అనేకమార్లు సూచించబడింది హిందూదేశ వాయవ్య ప్రాంతాల్లో ప్రాచీన హూణజాతి చాలకాలం ప్రాభవం నెరపింది. ధిబెట్‌వారు ప్రస్తుతం హూణులనే పేరు ధరించారు కాని యీ హూణశబ్దం 'హియూన్' శబ్దంగా తోస్తుంది మనువు పేర్కొన్న 'హూణులు' యిప్పటి ధిబెట్‌వారు కాధు. కాని యీ ఆధునిక థిబెట్ జాతీయులు ప్రాచీనకాల ఆర్యహూ ణుల, మధ్య ఆసియా నుండి ధిబెట్‌కొచ్చిన యితర మొగల్ జాతుల కలయికతో ఏర్పడ్డవారని అనుకోవటానికి అవకాశం వుంది ఇప్పటికీ ఆర్య జాతివారి మాదిరి ముఖాలు, కళ్ళు వున్నవారు ·ధిబెట్‌లో కొన్ని ప్రాంతాల్లో వున్నారని రష్యన్ బాటసారి ప్రియేవలస్కీ, ఫ్రెంచ్ బాటసారి డుక్ డార్లియాన్ వ్రాశారు. గ్రీసు దేశస్థులకు యవనులని పేరు ఏర్పడ్డది. ఈ పేరు మూలాన్ని గూర్చి ఎంతో చర్చ జరిగింది ఐయోనియాలో వుండిన గ్రీసుజాతి వారిని సూచించటానికి యీ యవనశబ్దం మొదట వాడబడిందని, కాబట్టి అశోకచక్రవర్తి పాళీ శాసనాలలో గ్రీసువారు 'యోనులు' అని పేర్కొబడ్డారని, అనంతకాలంలో యీ యోనశబ్దంలో

నుండి సంస్కృత యవన శబ్దం ఉత్పత్తి అయిందని కొందరి అభిప్రాయం. ప్రాచీన భారతదేశ చరిత్ర సమీక్షకులు కొందరు యీ యవనశబ్దం గ్రీకుల పేరేకాదు అంటారు. కాని యీ అభిప్రాయాలన్నీ తప్పే. 'యవన' అనేదే మూలశబ్దం హిందువులే కాక, ప్రాచీన ఐగుప్తు దేశస్థులు, బాబిలోనియా దేశస్థులు గ్రీసువారిని యవన పేరుతోనే పేర్కోటం యీ భావానికి ఆధారం. పహ్లోవ శబ్దం పహ్లోవీ భాష మాట్లాడుతూండిన ప్రాచీన పార శీకుల నామం. ఖశ శబ్దం పర్వతప్రాంతాల్లో, హిమాలయాల్లో నివసించే అసంపూర్ణ నాగరికజాతుల పేరై వుంది. ఆ శబ్దం ఆ అర్థంలో నేటికీ వాడుకలో వుంది. ఆ అర్థంలో నేటి యూరోపియన్లు ఖశ జాతివారి సంతతికి చెందినవారు. అంటే ప్రాచీనకాలంలో అనాగరికులై వుండిన ఆర్య జాతులన్నీ ఖశ జాతికి చెందినవే

ఆర్యుల శరీరచ్ఛాయలు కాస్త ఎరుపు కలిసిన తెల్లనివనీ, వారి వెంట్రుకలు నల్లనివిగాగాని, ఎర్రనివిగా గాని వుండేవనీ, ముక్కులు చిన్నవనీ, కళ్లు తీర్చిదిద్దినట్లు చక్కనివనీ ఆధునిక శాస్త్రజ్ఞుల అభిప్రాయం. కపాల ఆకృతి కేశవవర్ణాన్నిబట్టి కొంత మారుతుందట. శరీరచ్ఛాయ నల్లగా వుండటం పరిశుద్ధమైన (అమిశ్రిత) ఆర్య రక్తం నల్లని జాతులలో కలవటంచేత కలిగిన మార్పుట హిమాలయ సరిహద్దులకు పడమట యిప్పటికీ అమిశ్రితార్యరక్తం వున్న కొన్ని జాతులు వున్నాయనీ, తక్కినవారంతా మిశ్రమ రక్తం గలవారనీ, కాకపోతే వారు నల్లగా వుండటానికి కారణం లేదనీ వారి అభిప్రాయం కాని యీ యూరోపియను విద్వాంసులు యిప్పటికొక విషయం ఎరిగి వుండాలి. దక్షిణ భారతదేశంలోని కొన్ని ప్రాంతాల్లో ఎందరో శిశువులు ఎర్రని వెంట్రుకలతో జన్మిస్తారు; ఆ వెంట్రుకలు రెండు మూడేళ్లకు నల్లగా మారతాయి, హిమాలయాల్లో అనేకులకు ఎర్రని వెంట్రుకలు, నీలం రంగో, బూడిదరంగోగల కన్నులుంటాయి.

ఆ పండితులు తమలోతాము వివాదాలాడుకుంటారు, మొదటి నుండి తాము ఆర్యులమని చెప్పుకొనేవారు హిందువులే పరిశుద్ధ రక్తం

గలవారైనా, మిశ్రిత రక్తంగలవారైనా హిందువులు ఆర్యులే; అది నిస్సంశయ విషయం. ఆర్యులమైన మనలను - మనం నల్లవార మవటంచేత - యూరోపియన్లు అంగీకరించకపోతే - వారు మరో పేరు పెట్టుకొంటారు, - దాంతో మనకేంపని?

శరీరం రంగు నలుపైనా, తెలుపైనా ఒకటే, ప్రపంచ జాతులన్నింట్లో హిందువుల రూపురేఖలే మనోజ్ఞతమమైనవి వారు నా జాతివారటంవల్ల నేనేమీ దంభం పలుకటంలేదు, అతిశయోక్తు లాడటంలేదు - నేను చెప్పింది లోకంలో అంతటా ప్రఖ్యాతమైనదే. హిందూదేశంలో తప్ప మరెక్కడా అధిక సంఖ్యాకుల కింత చక్కని రూపురేఖలున్నాయి? మన దేశస్థుల శరీరాలు తక్కిన దేశస్థుల శరీరాలకంటె ఎంతో ఎక్కువగా బైటికి కనిపిస్తున్నా, అవి అందంగా కనిపించటానికి వాటిలో ఎంత ఆధిక్యముండాలోననే విషయాన్నికూడా గణించాలి. మనోజ్ఞంగా వస్త్రాలంకరణతో, సౌందర్యహీనులు అందంగా కనిపించటానికే యితర దేశాల్లో సర్వదా మహాప్రయత్నం చేస్తూన్నారు.

మన ఆరోగ్యంకంటె పాశ్చాత్యుల ఆరోగ్యం ఎంతో బాగుంటుందనటం నిస్సంశయం. పాశ్చాత్య దేశాల్లో నలభై ఏళ్ల పురుషులు, ఏభై ఏళ్ల స్త్రీలువయస్సులో వున్నవారే మంచి ఆహారం తినటం, చక్కగా దుస్తులు ధరించటం, శీతోష్ణస్థితి అనుకూలంగా వుండే దేశంలో నివసించటం - అన్నిటికంటె ముఖ్యం - చిన్న వయస్సులోనే వివాహం చేసుకోకపోవటం కూడా నిస్సంశయంగా కారణాలు. మనలోని బలిష్ఠ జాతులను, వారు వివాహం చేసుకొనే వయస్సేదో విచారించండి కొండజాతుల వారిని - ఉదా: గుర్ఖాలను, పంజాబీలను, జాట్‌లను, ఆఫ్రిడీలను - వారు ఏ ఈడున వివాహం చేసుకొంటారో కనుక్కోండి. పిదప మీ శాస్త్రాలను చదివి చూడండి - బ్రాహ్మణులకు ముప్పై ఏళ్లు, క్షత్రియులకు ఇరవై ఐదేళ్లు, వైశ్యులకు ఇరవై ఏళ్లు నిర్ణీత వయస్సు. దీర్ఘాయువు విషయంలోను, శారీరక, మానసిక పటుత్వ విషయంలోను పాశ్చాత్యులకు,

మనకు ఎంతో వ్యత్యాసం వుంది నలభై ఏళ్లు వచ్చేసరికి మన ఆశలు, శారీరక, మానసిక, బలాలు క్షీణింపసాగుతాయి. వారో యీ యీడున యువజన బలోత్సాహాలతో, ఆశా పరిపూర్ణులై, జీవిత ప్రారంభ దశలోనే వుంటారు.

మనం శాఖాహారులం, - మన వ్యాధుల్లో ఎక్కువ జీర్ణకోశ సంబంధమైనవి. మన వృద్ధులు - స్త్రీలు, పురుషులు - జీర్ణకోశ వ్యాధులతోనే సామాన్యంగా మరణిస్తారు. పాశ్చాత్యులు మాంసాహారులు - వారి వ్యాధుల్లో అధికపాలు హృదయ సంబంధితాలు; వారి వృద్ధులు - స్త్రీలు, పురుషులు - హృదయంవల్లా, శ్వాసకోశ వ్యాధులవల్లా సామాన్యంగా మరణిస్తారు పాశ్చాత్య వైద్యనిపుణు డొకడు కాలికాలైన జీర్ణకోశ వ్యాధులున్న వారు వ్యాకులశీలురుగా, త్యాగశీలురుగా వుంటారని, హృదయసంబంధ రోగాలు, శరీరోర్ధ్వభాగ సంబంధాలైన యితర రోగాలున్నవారు, అవసాన కాలందాకా ఆశ, విశ్వాసం కలిగి వుంటారని చెప్పాడు; విషూచీ వ్యాధి గ్రస్థుడు ముందునుండి మరణభీతి కలిగి వుంటాడు; క్షయరోగి చివరి ఘడియదాకా తన రోగం నయమవుతుందని ఆశాపూరితుడై వుంటాడు. హిందువులు సదా మరణాన్ని గూర్చి, త్యాగాన్ని గూర్చి మాట్లాడటానికిదే కారణమా? అని నా చికిత్సక మిత్రుడు ప్రశ్నించటం యుక్తియుక్తమేమో? ఈ ప్రశ్నకు నాకింతదాకా తృప్తికరమైన సమాధానం లభించలేదు. కాని అది సత్యబీజం వుందిగానే తోస్తూంది, పూర్తిగా విచారించ దగ్గదిగానే వుంది.

మన దేశంలో దంతరోగాలు, కేశరోగాలు వున్నవారు అరుదు; పాశ్చాత్యదేశాల్లో సహజాలు (జన్మసిద్ధాలు), జాడ్యగ్రస్తాలు కానివి ఐన దంతాలు వుండేవారు అరుదు; అంతటా బట్టతలలు కనిపిస్తుంటాయి. మన స్త్రీలు ఆభరణ ధారణార్థం ముక్కులను, చెవులను కుట్టించుకొంటారు పాశ్చాత్యదేశంలో అగ్రశ్రేణులవారు యీ కాలంలో యిలా అంతగా చెయ్యటంలేదు కాని, వారు అందంగా కనిపించటానికై, నడుములను

గట్టిగా అణచుకొని, వెన్నెముకను వక్రం చేసుకొని, తత్ఫలితంగా యకృత్ప్లీహాలకు స్థానభ్రష్టత్వం కల్పించి, ఆకృతిని వికృతం చేసుకొని, మరణవేదన లనుభవిస్తుంటారు. దీనిమీద దుస్తుల భారం! ఆ దుస్తులను ధరించటం మూలంగా తమ రూపురేఖలు సాధ్యమైనంత అందంగా కనిపించాలని వారి తాపత్రయం. వారి పాశ్చాత్య వేషంలో ఒక గుణంమాత్రం వుంది. పని చేయటానికి మన వేషంకంటె అనుకూలంగా వుంటుంది. ధనవంతులైన స్త్రీలు సభల్లో ధరించే దుస్తులు తప్ప, తక్కిన స్త్రీల వేషం సామాన్యంగా వికృతంగా వుంటుంది. మన స్త్రీల చీర, పురుషుల చొక్కా (ఒక విధమైన అంగరఖా), చాప్‌కాన్ (మరో రకం పొడుగు కోటు), తలగుడ్డ వేష సౌందర్య విషయంలో ఎలాటి పోటీకైనా ఆగుతాయి. వదులుగా వుండి, సహజంగా ముడతలుపడివుండే ఉడుపులతో బిగుతుగా, శరీరానికి అంటి వుండే దుస్తులు సౌందర్యానికి దీటురావు. కాని మన దుస్తులన్నీ వదులై, ముడతలుపడి వుండటంతో పనిచెయ్యటానికి తగవు. పనిచేసేటప్పుడవి చెడి, నిష్ప్రయోజనమైపోతాయి. పాశ్చాత్యదేశంలో ఫ్యాషన్[1] అనే దొకటి వుంది వారి ఫ్యాషన్ ఉడుపుల్లోను, మనది ఆభరణాల్లోను ఏర్పడి వుంటుంది. కాని యీ రోజుల్లో మన ఫ్యాషన్ దుస్తులకుకూడా కొస్తకొస్త వ్యాపిస్తోంది. స్త్రీల దుస్తుల ఫ్యాషన్‌కు 'ప-రీ' (ప్యారిస్) నగరం, పురుషుల దుస్తుల ఫ్యాషన్‌కు లండన్ నగరం కేంద్రాలు సామాన్యంగా 'ప-రీ' నగ రంలోని నటీజనం యీ ఫ్యాషన్లను రూపొందిస్తారు. ఆయా కాలంలో ప్రఖ్యాతినొందిన నటి ఏ కొత్త ఫ్యాషన్ దుస్తులు ధరిస్తుందో, అలాటి దుస్తులు ఫ్యాషన్ కెక్కి-వుండేవారంతా తక్షణమే అవలంబిస్తారు. దుస్తులు కుట్టే గొప్ప కంపెనీవారు ఫ్యాషన్లను ప్రస్తుతం రూపొందిస్తున్నారు. పాశ్చాత్య దేశాల్లో దుస్తులు కుట్టించుకోవటంలో ప్రతియేటా ఎన్ని కోట్ల పౌండ్లు వ్యయంచేస్తున్నారో మనం ఏమాత్రం వూహించలేం. దుస్తులు తయారుచేసే పని యిప్పుడొక ప్రత్యేక విద్య (ఒక రకమైన సైన్సు)గా

1 అందానికి, నాగరికతకు ఎప్పటికప్పుడు ఏర్పడే వైఖరి

మారింది - ఏఏ బాలికల దేహచ్ఛాయకు, కేశవర్ణానికి ఏఏ రంగు దుస్తులు అనువుగా వుంటాయో, ఏఏ బాలికల దేహాల్లో ఏఏ అంగాల వైఖరి మరుగు పరచాలో, ఏఏ అంగాలను సాధ్యమైనంత అనుకూలంగా కనుపరచాలో - ఇవీ, యిలాటి ముఖ్యాంశా లనేకం, దుస్తులు కుట్టేవారు అత్యంత జాగ్రత్తతో ఆలోచించి నిర్ణయించాలి మరో విషయం అత్యున్నత పదవిలో వుండే స్త్రీలు ఏ దుస్తులు ధరిస్తుంటారో, యితరులుకూడా అలాటి వాటినే ధరించాలి. లేకపోతే వారు 'కులాన్ని' కోల్పోతారు! 'ఫ్యాషన్' అంటే యిలాటిది.

అంతేగాక యీ ఫ్యాషన్ రోజురోజూ మారిపోతుంటుందని చెప్పవచ్చును; సంవత్సర నాలుగు ఋతువుల్లో అది నాలుగుసార్లు మార్పు చెందటం తప్పదు. అప్పుడుకాక యింకా అనేకసార్లుకూడా మారుతుంది ధనికవర్గంవారు తమ దుస్తులను నిపుణులుగా ఖ్యాతిగాంచిన కంపెనీల వద్ద అప్పటప్పటి ఫ్యాషన్ ప్రకారం కుట్టించుకొంటారు; మధ్యవర్గంవారు తమ యిళ్లవద్ద దర్జీ స్త్రీలచేత వాటిని కుట్టించుకొంటారు; లేక తామే కుట్టుకొంటారు కొత్త ఫ్యాషన్ అంతకుముందున్న చివరి ఫ్యాషన్‌కు దగ్గరగా వుంటే, తదనుకూలంగా వారి దుస్తుల్లో మార్పులు చేసుకొంటారు, అలా కానిపక్షంలో కొత్త దుస్తులు కొనుక్కొంటారు మారిపోయిన ఫ్యాషన్ దుస్తులను ధనికవర్గంవారు తమ ఆశ్రితులకు, సేవకులకు యిచ్చేస్తారు గొప్పయింటి స్త్రీల పరిచారికలు, అనుచారిణులు వాటిని అమ్ముకొంటారు. అవి యూరోపియన్లచే ఆఫ్రికా, ఆసియా, ఆస్ట్రేలియా ఖండాల్లో స్థాపించబడ్డ వలసప్రాంతాలకు ఎగుమతి చెయ్యబడి, అక్కడ తిరిగి ఉపయోగించబడతాయి గొప్ప ధనవంతులు తమ దుస్తులన్నింటిని 'ప-రీ' నగరంనుండే తెప్పించుకొంటారు, సామాన్య ధనికులు తను దేశంలోనే తమ దర్జీలచేతనే ఆ ఫ్యాషన్ ప్రకారం వాటిని కుట్టించుకొంటారు. కాని ధనికస్త్రీల టోపీలు ('హేట్స్') మాత్రం 'ప-రీ'లో తయారుచెయ్యబడ్డవిగానే వుండాలి నిజానికి, ఇంగ్లండ్ స్త్రీల, జర్మన్ స్త్రీల దుస్తులు అందంగా

వుండవు, వారు సామాన్యంగా - అగ్రవర్గంలోను, ధనిక వర్గంలోను చేరిన ఏ కొద్దిమందో తప్ప - 'ప-రీ' నగర ఫ్యాషన్లను అనుసరించరు కాబట్టి యితర దేశస్త్రీలు వారిని హేళనలతో పరిహసిస్తారు. కానీ ఇంగ్లండ్‌లోని పురుషులు మాత్రం అతిచక్కని దుస్తులే ధరించటం వాడుక. అమెరికా లోని స్త్రీ పురుషులంతా ఎంతో ఫ్యాషన్‌గల దుస్తులనే ధరిస్తారు. విదేశ వస్తువులు తమ దేశానికి రావటాన్ని అడ్డగించటానికి అమెరికా ప్రభుత్వం, లండన్, 'ప-రీ' నగరాలనుండి దిగుమతి చెయ్యబడ్డ దుస్తులమీద అత్యధిక సుంకాన్ని విధించినా, ఆ దేశ స్త్రీలు తమ దుస్తులను 'ప-రీ' నగరంనుండి, పురుషులు లండన్‌నుండి తెప్పించుకొంటూనే వుంటారు. వివిధ రీతులు, రంగులున్న ఉన్ని, సిల్కు దుస్తులను అంగడి వీథికి కొత్తగా చేరవెయ్యటానికి వేలకొద్దిమంది స్త్రీ పురుషులు నియోగింపబడతారు. ఆ వస్త్రాలతో నానావిధాలైన దుస్తులు వేలమంది తయారుచేస్తుంటారు తమ దుస్తులు ఆనాటి ఫ్యాషన్‌కు అనువుగా వుంటేగాని, గొప్పవారైన స్త్రీ పురుషులు - ఫ్యాషన్ల అనుసరించేవారి పరిహాసాలకు గురికాక - వీథుల్లో నడవలేరు మన దేశంలో దుస్తుల ఫ్యాషన్‌కు సంబంధించిన యీ బాధ అంతగా లేదు గాని, దానికి బదులు ఆభరణాల ఫ్యాషన్ కొంతదాకా వుంది. ఆ దేశాల్లో సిల్కు[1], ఉన్ని మొదలైన వాటితో వ్యాపారంచేసే వర్తకులు ఫ్యాషన్ ఎలా మారుతోందో, ఎలాటి వస్తువులు జనాదరణలోకి వస్తున్నాయో, సర్వదా ఎంతో జాగ్రత్తతో కనిపెట్టి వుంటారు, లేక స్వబుద్ధితో వారే ఒక కొత్త ఫ్యాషన్ కనిపెట్టి, జనం దృష్టిని అది ఆకర్షించేటట్లు ప్రయత్నిస్తారు. ఇట్టి ప్రయత్నంలో ఏ వర్తకుడైనా విజయం పొందితే, అతడి అదృష్టం పండినట్లే - అతని జీవితం ధన్యమైనట్లే మూడవ నెపోలియన్ ఫ్రాన్స్ చక్రవర్తిగా వున్నప్పుడు, అతడి భార్య ఆయ్‌గెనీ చక్రవర్తిణి పాశ్చాత్య ప్రజలందరిచేత ఫ్యాషన్ అవతారంగా ఎన్నబడేది. కాశ్మీరదేశ శాలువులపట్ల ఆమెకు అమిత

---

1. సిల్కు అంటే పట్టు కాని యీ రోజుల్లో ఆంధ్రులు యీ రెంటికీ భేదాన్ని పాటిస్తారు కాబట్టి సిల్కు శబ్దమే యిక్కడ వాడబడింది

మైన అభిమానం వుండేది. కాబట్టి ఆమె కాలంలో కోట్ల విలువైన కాశ్మీర శాలువలు ఏటేటా యూరప్‌కు ఎగుమతి చెయ్యబడేవి. మూడవ నెపోలియన్ పదవీభ్రష్టుడయ్యాక ఫ్యాషన్ మారిపోయింది కాశ్మీర శాలువలు యిప్పుడు కొనేవారు లేరు. ఇక మన దేశవర్తకులంటే, వారు వాడుకపడ్డ పాత మార్గాన్నే ఎల్లప్పుడూ నడుస్తారు. కాలం మార్పునుబట్టి, పాశ్చాత్యుల దృష్టినాకర్షించగల కొత్తవైఖరిని దేన్నీ వారు వూహించి ప్రవేశపెట్ట లేరు. అందుచే ఆ దేశంలో వారి సరుకుల కిప్పుడు గిరాకీ పూర్తిగ పోయింది. కాశ్మీర దేశానికి గట్టిదెబ్బ తగిలింది. అందలి ధనాఢ్యులైన గొప్ప వర్తకులు హఠాత్తుగా దివాలా తీశారు

నీకు కళ్లుండి చూడగలిగితే, యీ ప్రపంచం నీది కాకపోతే నాది; ఎవరైనా మరొకరికోసం వేచివుంటారనుకొంటావా? ప్రపంచంలోని రకరకాల భోగాలను, సుఖాలను ఆకర్షించటానికి పాశ్చాత్యులు కొత్త ఉపాయాలను, కొత్త మార్గాలను కనిపెడుతున్నారు. వారు పది కళ్లతో స్థితిగతులను చూస్తున్నారని, రెండు వందల చేతులతో పనిచేస్తున్నారని చెప్పవచ్చును; ఇక మనమో, శాస్త్రకారులు గ్రంథస్థం చెయ్యనివాటిని ఎన్నటికీ చెయ్యం. కాబట్టి మనం పాతబడి నలిగిన తోవనే నడుస్తున్నాం. స్వబుద్ధి జనితమైన మార్గాలను, కొత్త మార్గాలను అవలంబించే యత్నమే మనకు లేదు అందుచేత అలాచేసే సామర్థ్యంకూడా మనకిపుడు నశించింది దేశం సమస్తం అన్నంకోసం ఆకాశం పగిలేలా అరుస్తూ, పస్తులుపడి చస్తోంది. ఇది ఎవరి తప్పు? మనదే. ఈ శోచనీయ స్థితినుండి - బైటపడేమార్గం మనమేమైనా అవలంబిస్తున్నామా? - ఏమీ లేదు, సున్న! మనం చేసేదంతా నిరర్థక దాంభిక ప్రసంగాలతో గొప్పశబ్దం చెయ్యటమే. మరేమీ చెయ్యటం లేదు మీ యిరుకు మూలంనుండి బైటికొచ్చి, కళ్లు పూర్తిగా తెరిచి, ప్రపంచం ఎలా పురోగమిస్తోందో ఎందుకు చూడకూడదు? అలాచేస్తే మనస్సు వికసించి, ఆలోచనాశక్తి, సమయోచిత కార్యాచరణశక్తి వాటంతట అవే వస్తాయి దేవాసురుల కథ మీకు తప్పక తెలిసే వుంటుంది.

దేవతలకు తమ ఆత్మలోను, భగవంతుడిలోను, అనంతర జీవితంలోను విశ్వాసం వుంది. అసురులు యీ జీవితానికే ప్రాముఖ్యమిచ్చి, ప్రాపంచిక భోగాలనుభవించటానికి, శారీరకసౌఖ్యాలు నానారకాలుగా పొందటానికి ఎప్పుడూ ప్రయత్నిస్తుంటారు. దేవతలు అసురులకంటె ఉత్తములో, అసురులే దేవతల కంటె ఉత్తములో అనే విషయం యిక్కడ చర్చనీయాంశం కాదు. కాని పురాణాల్లోని వర్ణనలనుబట్టి పురుష నామానికి దేవతలకంటె అసురులే నిజానికి ఎక్కువ అర్హతగలవారని, దేవతలకంటె ఎక్కువ పౌరుషం వున్నవారని తోస్తుంది. దేవతలు అసురులకంటె అనేక విషయాల్లో హీనులనటానికి సందేహం లేదు. ఇపుడు ప్రాచ్య, పాశ్చాత్యాలను తెలుసుకోవటానికి, హిందువులు దైవసంభూతులని, పాశ్చాత్యులు అసురసంభూతులని భావించటంకంటె ఉత్తమమార్గం కనిపించటం లేదు.

దేహ నైర్మల్యాన్ని గూర్చి, వారి భావాలను ముందు చూద్దాం. నైర్మల్యమంటె శారీరక, మానసిక నైర్మల్యం. దీన్లో మొదటిది నీరు మొదలైనవాటి నుపయోగించటంచేత కలుగుతుంది హైందవుడు నీటిని ధారాళంగా వినియోగిస్తాడు. శారీరక నైర్మల్య విషయంలో లోకంలో మరే జాతివారు హైందవుడితో సరిరారు. ఏ కొన్ని జాతుల్లోనో తప్ప నీటిలో దూకి స్నానం చెయ్యటం హైందవేతర జాతుల్లో అపురూపం. హిందూ దేశంతో సంపర్కం కలిగిన పిదప ఆంగ్లేయులు దాన్ని వారి దేశంలో ప్రవేశపెట్టారు. విద్యార్జనార్థం ఇంగ్లండ్‌లో నివసించినవారిని అడిగితే ఆ దేశంలో స్నానానికి ఏర్పాట్లు ఎంత తక్కువగా వుంటాయో తెలుస్తుంది. పాశ్చాత్యులు స్నానం చేసినప్పుడు - అది వారాని కొకసారి - తమ లోపలి ఉడుపులు మార్చుకొంటారు. ఇప్పుడిప్పుడు ధనవంతు లనేకమంది ప్రతి రోజు స్నానం చేస్తున్నారు. అమెరికన్లలో స్నానం చేసేవారి సంఖ్య యింకా ఎక్కువ; జర్మనులు ఎప్పుడో ఒకరోజే స్నానం చేస్తారు! ఫ్రెంచ్‌వారు, తదితరులు ఎంతో అరుదుగాగాని స్నానం చెయ్యరు! స్పెయిన్, ఇటలీ దేశాలు

ఉష్ణప్రాంతాలు. కాని అక్కడ స్నానం బహుఅరుదు! వారు వెల్లుల్లిని ఎక్కువగా తిని, రేయింబవళ్లు అమితంగా చెమరుస్తారు. కాని స్నానం మాత్రం చెయ్యరు! దీన్ని ఊహించుకోండి! దయ్యాలే వారినుండి పారి పోయి తీరతాయి. ఇక మనుషుల మాట వేరే చెప్పాలా! పాశ్చాత్య దేశాల్లో స్నానం అంటె అర్థం ఏమిటి? ముఖం, తల, చేతులు - అంటె ఉడుపులతో కప్పబడని అంగాలు - వీటిని మాత్రం కడుక్కోవటమే స్నానం!

కోటీశ్వరుడైన నా మిత్రుడొకడు నన్నోసారి 'ప-రీ'కి రమ్మని ఆహ్వా నించాడు 'ప-రీ' నగరం ఆధునిక నాగరికతకు కేంద్రం - భోగాలకు, ఫ్యాషన్లకు, ఉల్లాస జీవనానికి, ఇహలోక స్వర్గప్రాయమైంది, - విద్యలకు, కళలకు కేంద్రం. నా మిత్రుడు రాజగృహాన్ని పోలిన ఒక హోటల్లో నాకు బస ఏర్పాటు చేశాడు అక్కడి భోజన ఏర్పాట్లు రాజాధిరాజులకు అర్హమై వుంటాయి. కాని స్నానానికి ఏర్పాట్లు? - ఆ పేరే అక్కడ కనిపించదు! దీన్ని నేను రెండు రోజులు మౌనంతో భరించాను - చివరకు యిక భరించ లేక, నా మిత్రుడికి యిలా చెప్పాల్సి వచ్చింది. ''ప్రియసోదరా! ఈ రాజ భోగం, నువ్వు నీవారు మాత్రం అనుభవించండి! ఇక్కడనుండి బైట పడటానికి నేను ఉక్కిరిబిక్కిరి లాడుతున్నాను. ఇంత ఉష్ణనాలావర ణంలో స్నానసౌకర్యం లేనేలేదు! ఇదే స్థితిలో కొంతకాలముంటే నాకు పిచ్చెక్కి, పిచ్చికుక్కనయ్యే ప్రమాదం అధికంగా వుంది '' ఇది విని నా మిత్రుడు ఎంతో బాధపడి, హోటల్ అధికారులమీద ఎంతో కోపగించు కొని, నాతో యిలా అన్నాడు ''నిన్ను నేనింక యిక్కడ వుండనివ్వను. వెళ్లి మంచి అనుకూలంగా వుండే స్థలాన్ని కనిపెడదాం '' అక్కడు ముఖ్య మైన పన్నెండు హోటళ్లు తిరిగి చూశాం. కాని వాటిలో ఎక్కడా స్నానానికి తావేలేదు! ప్రత్యేక స్నానమందిరాలు కొన్ని వున్నాయి అక్కడికెవరైనా వెళ్లి నాలుగైదు రూపాయలు చెల్లించి ఒకసారి స్నానం చెయ్యవచ్చును సర్వే శ్వరా, ఏమిటీ స్థితి! ఒక వృద్ధ స్త్రీ స్నానపుతొట్టెలో ప్రవేశించి వెంటనే

మరణించిందని ఆనాటి మధ్యాహ్నం నేనొక వార్తాపత్రికలో చదివాను! ఈ విషయంలో డాక్టర్ల అభిప్రాయం ఏమైనా నిజమైన కారణం యిదిగా నాకు తోస్తోంది: అన్ని నీళ్లను ఒక్కసారిగా చూసి వాటిలో ప్రవేశించటం ఆమెకు అదే మొదటిసారై వుంటుంది; ఆ ఆకస్మికాఘాతానికి శరీరం తట్టుకోలేక ఆమె ప్రాణాలను కోల్పోయి వుంటుంది ఇందులో అతిశయోక్తి ఏమీ లేదు. ఇక రష్యా దేశస్థులు, మరికొందరు యీ విషయంలో చెప్పలేనంత అపరిశుద్ధంగా వుంటారు. ధిబెట్ మొదలు, ఆ ప్రాంత దేశాలన్నింట్లోను స్థితి యిదే. కాని అమెరికా హోటల్ లన్నింట్లోను ఒక స్నానాలగది, దానిలో గొట్టపు నీరు వచ్చే సౌకర్యాలు వున్నాయి.

ఇక యిక్కడ మన దేశ స్థితి ఎంత వ్యత్యాసమో చూడండి. హిందువులమైన మనం ఎందుకు స్నానం చేస్తాం? - పాపం కలుగుతుందనే భయం చేత. పాశ్చాత్యులు తమ ముఖాన్ని, చేతులను కడుక్కోవటం పారిశుధ్యం నిమిత్తం స్నానమంటె మన అర్థం దేహంమీద నీళ్లు పోసుకోవటం, - చమురు, మురికి అంటుకొని కనిపిస్తున్నా సరే! ఇక మన దాక్షిణాత్య సోదరులు ఎంతో పొడవైన, వెడల్పైన బొట్లతో తమను అలంకరించుకొంటారు! వాటిని పూర్తిగా పోగొట్టటానికి ఒక పూమిస్ రాయితో[1] రుద్ద వలసి వుంటుందేమో! మన దేశంలో స్నానం చెయ్యటం సులభం - ఎక్కడో ఒకచోట నీళ్లలో దూకేయటమే, కాని పాశ్చాత్యదేశాల్లో అలా కాదు. వారు ఒక మోపెడు ఉడుపులను ముందు విప్పివెయ్యాలి - అందులో ఎన్ని గుండీలు, ఎన్ని కొక్కేలు, ఎన్ని నేత్రాకృతిగల బెజ్జాలుంటాయో! మన దేహం యితరులకు కనిపిస్తే తప్పేమీ కాదు. వారిలో అది భయంకరమైన దోషం! కాని యిద్దరు - తండ్రి, కుమారులవంటి - మగవారైతే ఔచిత్యదోషం లేదు. స్త్రీల ముందు మాత్రం ఆపాదమస్తకం దుస్తులుండే తీరాలి

---

1 మరకలు పోగొట్టటానికి ఆ పేరున్న రాయితో పాశ్చాత్యదేశాల్లో రుద్దుకుంటారట

బాహ్య పారిశుద్ధ్యాచారం దీర్ఘకాలానుభవంలో - ఆచారాలన్నిటిలా - కొన్ని చోట్ల, ఆచార విరుద్ధమైన ఒక హింసాత్మక కార్యంగా ఏర్పడుతుంది. శరీర సంబంధాలైన సమస్త విషయాలు ఏకాంతంలోనే చూసుకోవాలని యూరోపియన్ల అభిప్రాయం. సరే. ''ఇతరులు చూసేటప్పుడు ఉమ్మి వెయ్యటం అసభ్య ప్రవర్తన. ఇతరుల ముందు నోటిని పుక్కిలించి కడుక్కోవటం అవమానకరం'' అందుచేత, యితరుల ఆక్షేపణకు భయపడి, వారు భోజనానంతరం నోటిని కడుక్కోరు. ఫలితంగా దంతాలు క్రమక్రమంగా క్షీణిస్తాయి! సంఘానికి భయపడి, నాగరికతా భిన్నప్రవర్తనమని తలచి, పారిశుద్ధ్యాన్ని విడిచిపెట్టటాని కిదొక నిదర్శనం. మనది యిందుకు విరుద్ధమైన ''అతి'' - అందరిముందు పుక్కిలించి నోటిని కడుగుకోవటం, వీధిలో కూర్చుని వాంతివచ్చేట్లు శబ్దాలు చేస్తూ, యిలా చెయ్యటం - ఇదీ హింసాత్మక క్రియే అనిపించుకొంటుంది. ఇలాటి పనులను ఏకాంతస్థలంలో నిశ్శబ్దంగా చేయవలసిందే; కాని సంఘానికి భయపడి అవి మానుకోవటంకూడా అంతటి తప్పే.

అంతేగాక, ఆయా దేశాల శీతోష్ణస్థితుల్లో అనివార్యాలై వుండే ఆచారాలను సంఘం ప్రశాంతంగా భరించి, ఆమోదసూచక ప్రవర్తనాన్ని అవలంబిస్తుంది. మన దేశంలాంటి ఉష్ణదేశాల్లో మనం చెంబులకొద్దీ నీళ్లు తాగుతాం; అలా చేసేవారు త్రేపులనుండి ఎలా తప్పించుకోగలరు? పాశ్చాత్యదేశాల్లో త్రేపటం ఎంతో అసభ్యం. కాని అక్కడ భోజన సమయంలో చీది, జేబులోని చేతిగుడ్డలో దాన్ని దాచటం నిరాక్షేపణీయం. మనకది రోతపని వారి దేశంవంటి శీతలదేశంలో అప్పుడప్పుడలా చెయ్యటం అనివార్యం.

హిందువులమైన మనకు పెంట అంటె ఎంతో ఏవగింపు కాని నిజానికి మనం ఎక్కువసార్లు మాలిన్యం కలిగేవుంటాం పెంటను తాకితే మనం స్నానం చేస్తాం - పెంట అంటె మనకంత ఏవగింపు. కాబట్టి మనకు అది దూరంగా వుండటంకోసం దాన్ని కుప్పవేసి యింటి సమీపంలోనే

వుంచుతాం. అక్కడ అది మురుగుడువాసన కొడుతూ, కుళ్ళుతుం టుంది; దాని విషయంలో మనం జాగ్రత్త తీసుకోవలసింది ఒక్కవిషయం లోనే - దాన్ని తాకకూడదు! కాని మనం వాస్తవంగా నరకంలోనే నివ సిస్తున్నామని ఎన్నడైనా అనుకొంటున్నామా? ఒక రకమైన అపరిశుద్ధత నుండి తప్పించుకోవటానికి, మనం మరో అపరిశుద్ధతను - అంతకంటె ఎక్కువ అపకారిని ఆశ్రయిస్తున్నాం. ఒక కీడు పొందకుండా వుండటానికై మనం మరో కీడును - అంతకంటె ఉధృతమైనదాన్ని - వెన్నాడుతున్నాం. ఇంటిలో పెంటను కుప్పచేసి వుంచుకొనేవాడు పాపం చేస్తున్నాడు. అందుకు సందేహం లేదు దానికి ప్రతిఫలమైన శిక్షకోసం అతడు జన్మాం తరందాకా వేచివుండనక్కర్లేదు. త్వరలోనే యీ జన్మలోనే అది అతని తలమీదికి ఒరిగిపడుతుంది.

లక్ష్మి (భాగ్యదేవత), సరస్వతుల (విద్యాదేవత) ప్రసాదదృష్టి యీ కాలంలో పాశ్చాత్యదేశస్థులమీద ప్రసరిస్తోంది. వారు భోగ్య వస్తువుల నార్జించుకోవటంతో తృప్తిపడరు. వారి కార్యాలన్నింటిలోను వారొక విధ మైన సౌందర్యాన్ని, నాజూకును అర్థిస్తారు తమ గృహాల్లో, పరిసరాల్లో, ప్రతి విషయంలోను వారొక సర్వతోముఖ లాలిత్యాన్ని చూడగోరతారు. ఆ లక్షణం మనకూ ఒకే కాలంలో - దేశంలో ద్రవ్యసమృద్ధి, ఐశ్వర్యం వున్నప్పుడు - వుండేది. ఇప్పుడు అపరిమిత దారిద్ర్యదశ మనకు పుట్టింది. కాని మన స్థితి యింకా చెడేట్లు మనం రెండు విధాలుగా వినాశ నాన్ని తెచ్చిపెట్టుకొంటున్నాం. అవి: మనకు స్వతంత్రమైనదాన్ని పారేసు కోవటం, యితరుల ఆదర్శాలను, ఆచారాలను సంపాదించుకోవటానికి వ్యర్థప్రయాసపడటం. మనకున్న జాతీయ సుగుణాలు క్రమక్రమంగా అదృశ్యమౌతున్నాయి. పాశ్చాత్యుల సుగుణాలు మన కేవీ పట్టుపడటం లేదు! కూర్చోవటం, నడవటం, మాట్లాడటం మొదలైనవాట్లో మనకొక సాంప్రదాయిక విశిష్టలక్షణం ప్రాచీనకాలంలో వుండేది - అదిప్పుడు నశిం చింది - కాని పాశ్చాత్య మర్యాదావిధాలను సంపాదించుకొనే శక్తి మనకు

లేదు పూర్వకాలానుగతమై మనకు లభించిన పారమార్థిక ఆచారాలు, సాధనలు, చదువులు మనం గంగలో కలిపి కొట్టుకొనిపోయేట్లు చేశాం, - కాని వాటికి బదులు క్రొత్తదేదీ, కాలానుగుణ్యమైంది, యింకా మనకు ఏర్పడి సుస్థిరత కలుగలేదు ఈ రెంటిమధ్య చిక్కి ఊగిసలాడుతూొం డటంలోనే మన ప్రస్తుత దురవస్థ అంతా వుంది! భవిష్యత్తులో రూపొంద వలసిన వంగదేశం యింకా సుస్థిరరూపం పొందలేదు. కళల విషయంలోనే మనం అన్నిటికంటె అధికంగా నష్టపోయాం. పూర్వం మన వృద్ధ స్త్రీజనం మన యిళ్ల గచ్చుపై, తలుపులపై, గోడలపై కలిపిన బియ్యపు పిండితో అనేక రకాలైన చక్కని ఆకృతులను చిత్రించేవారు. అన్నం వడ్డించే అరటి ఆకులను అందంగా కోసేవారు. రకరకాల భోజన పదార్థాలను ఆకులపై ముచ్చటగా వడ్డించటంలో తమ కళానైపుణ్యాన్నంతా వినియోగించేవారు. ఈ కాలంలో ఆ కళ లించుమించుగా అన్నీ అదృశ్యమైపోయాయి. ఇప్పటికీ నిల్చివున్నవి యిప్పుడు నశిస్తున్నాయి.

మనకు తెలియని క్రొత్త విషయాలను మనం నేర్చుకొని ప్రవేశపెట్టి, అభ్యసించ వలసిందే, కాని పాతవాటి నన్నిటిని - పాతవిగా వున్నమాత్రా ననే, అకారణంగా - ఆమూలం తొలగించి అలా చెయ్యాలా? మీరు కొత్త వాటిని ఏమి నేర్చుకొన్నారు? - ఏమీ లేదు, గందరగోళంగా కలిసివుండే కొన్ని మాటలు తప్ప! వాస్తవోపయోగం వున్న ఏ కళను, ఏ విద్యను మీరా ర్జించారు? ప్రాచీనకాలపు కొయ్యపనితనం, ఇటుకరాతి పనితనం దూర గ్రామాల కెళ్లి యిప్పుడైనా చూడండి మీ నగరవాసపు వడ్రంగి ఔచిత్యా మున్న ఒక తలుపుల జతనైనా చెయ్యలేడు - అవి గుడిసెకోసం చెయ్య బడ్డవో, భవంతికోసం చెయ్యబడ్డవో కనుక్కోవటం కష్టం! విదేశీయోప కరణాలను కొనటంలోనే వారి నేర్పంతా - వడ్రంగం అంటే అదితప్ప యింకేం కానట్టు! అయ్యో! మన దేశంలో అన్ని విషయాలకు అదేగతి పట్టింది మనకు స్వకీయమై వున్నదంతా అదృశ్యమై పోతూంది కాని విదేశీయులవద్ద మనం నేర్చుకొన్నది ప్రసంగవిద్య ఒక్కటే. చదవటం,

మాట్లాడటం మాత్రమే! ఆహా! వంగదేశస్థులు, యూరపులో ఐర్లండు దేశస్థులు ఒకే మూసలో నిర్మించబడినవారు - నిర్విరామంగా మాట్లాడటం, మాటమాటకు బదులాడటం! వ్యర్థాలైన గంభీర ప్రసంగాలు చెయ్యటంలో యీ రెండు జాతులవారు గొప్ప నిపుణులు. ఏ కొద్దిపాటి అభ్యాసయోగ్య కార్యం చేయవలసి వచ్చినా వారెందుకూ ఎక్కరు, - ఇదే కాక, జీవితకాలమంతా వారు ఒకర్నొకరు దూషణవాక్కు లాడుకొంటూ, కలహించుకొంటారు.

పాశ్చాత్య దేశస్థులకు తమ వస్తువుల నన్నింటిని అందంగా, శుభ్రంగా వుంచుకోవటం అలవాటు అతిదరిద్రులుకూడా యిలా వుంచుకోవటానికి శ్రద్ధపూనుతారు. ఈ నైర్మల్యాభ్యాసం వీరికి వుండేతీరాలి. ఎందుకంటె, పరిశుభ్రమైన దుస్తులు లేనివారి నెవ్వరూ తమ కొలువులో వుంచుకోరు. వారి పరిచారకులు, పరిచారిణులు, వంటవారు మొదలైనవారంతా స్వచ్ఛమైన వస్త్రాలను ధరిస్తారు. వారి ఇళ్లు ప్రతిరోజు తుడిచి, కడిగి, దుమ్ముదులిపి పొందికగా వుంచబడుతాయి వస్తువులను ఎక్కడెక్కడో పడవెయ్యక ప్రతి వస్తువును దాని నిర్ణీతస్థలంలో వుంచటం మర్యాదతో కూడిన ప్రవర్తనలో ఒక భాగం. వారి వంట యిళ్లు పరిశుభ్రంగా, కాంతివంతాలై కనిపిస్తాయి. కూరగాయ తొక్కలు మొదలైన వ్యర్థ వస్తువులు ప్రస్తుతం వేరుగా ఒక పాత్రంలో వుంచుతారు. పిదప వాటిని పాకీవాడు దూరంగా తీసుకెళ్లి అందుకోసం కేటాయించిన స్థలంలో పడేస్తాడు అలాటి వస్తువులను వారు రోడ్లమీద, తమ దొడ్లలోను పారెయ్యరు.

సంపన్నుల గృహాలు, యితర కట్టడాలు, అవశ్య దర్శనీయాలు - రేయింబవళ్లవి సక్రమస్థితిలో, పారిశుధ్య నిధానాలై అద్భుతంగా వుంచబడతాయి! ఇదంతాకాక, యితర దేశాలనుండి కళానిక్షేపాలైన వస్తువులను సమకూర్చుకొని, వాటితో తమ గృహాల నలంకరించుకోవటం వారికి వాడుక. ఇక మన సంగతి? మనం - వారిలా - యితర దేశ కళారాధకులు చేసిన వస్తువులను తెచ్చుకోవటం - ప్రస్తుత కాలంలో - అవసరం లేదు, నిజమే;

కాని మనకుండేవాటిని నశించకుండా పదిలపరచుకోవాలా లేదా? చిత్ర కళలోను, శిల్పకళలోను వారికున్నంత శక్తిని, కౌశలాన్ని మనం ఆర్జించు కోవటానికి చాలకాలం పడుతుంది. ఈ రెంటిలోను మన కేనాడూ పూర్తి నైపుణ్యం లేదు. యూరోపియన్ల ననుకరించి మన మొకరిద్దరు రవివర్మ లను మనలో ఉత్పత్తి చేయగలిగాం! కాని అలాటి కళారాధకులకంటె వంగ దేశంలో దేవతల ''చాల్‌చిత్రా''[1] లను నిర్మించే మన ముచ్చీలు ఎంతో శ్రేష్ఠం. వారి పనిలో ప్రకాశవంతాలైన రంగులనైనా ఉపయోగించరు. రవివర్మ, యితరుల చిత్రాలు చూసి మనం లజ్జచే తల ఎక్కడన్నా పెట్టు కోవాలి! జయపూర్ వారు నిర్మించే బంగారు మలామా విగ్రహాళు, మనకు పూర్వంనుండి వున్న దుర్గాదేవి ''చాల్చిత్రాలు''[1] యింతకంటె ఎంతో బాగుంటాయి. యూరోపియన్ల శిల్పకళను గూర్చి, చిత్రకళను గూర్చి నా అభిప్రాయాలను తరువాత మరేదో సందర్భంలో తెల్పుతాను. అది అపార విస్తృత విషయం కాబట్టి యిక్కడ దానిలో ప్రవేశించడానికి వీలులేదు.

పాశ్చాత్యుల పాకకళను గూర్చి యిప్పుడు కొంత చెబుతాను వినండి. మన దేశ వంటలోగల పారిశుధ్యం మరే దేశంలోను లేదు. కాని ఆంగ్లేయులు భోజనంలో పాటించే వేళా, నియమం, ఏర్పాటు, శుచి మనకు లేదు. మన వంటవాడు ప్రతిరోజా స్నానం చేసి, గుడ్డలు మార్చు కొన్నాకగాని వంటగదిలోకి అడుగుపెట్టడు; అన్ని పాత్రలను, పొయ్యిని తోమి, నీళ్లతో శుభ్రపరుస్తాడు; తన ముఖాన్నిగాని, ముక్కునుగాని, దేహంలో మరే అంగాన్నికాని తాకితే, అతడు చేతులను కడుక్కొనే భోజన పదార్థమేదైనా తాకుతాడు. పాశ్చాత్య వంటవాడు స్నానం చెయ్యటమే అరుదు అంతేగాక, తాను చేసే వంటకాన్ని అతడు గరిటతో తీసి రుచి చూస్తాడు. అ గరిటనే మళ్లీ అందులో ముంచటం అతనికి తప్పుగా

---

1 'చాల్‌చిత్రం' అంటే దేవతావిగ్రహాలమీద అమర్చబడే ధనురాకృతిగల 'మందహాసం ' పురాణకథల్లోని స్త్రీ పురుషుల రూపాలు అందులో చిత్రించబడి వుంటాయి దాని అంచున అలంకారికమైన పనితనం వుంటుంది

తోచదు. చేతిగుడ్డను తీసి అతడు దాన్లో గాఢంగా చీదుతాడు; మళ్లా ఆ చేతితోనే పిండిపిసగడమూ చెయ్యవచ్చును! బైటనుండి వచ్చేటప్పుడు చేతులను కడుక్కోవాలని అతడికి తోచనే తోచదు. రాగానే వంటపని ప్రారంభిస్తాడు. కాని యివన్నీ యిలావున్నా, అతడు హిమస్వచ్ఛాలైన దుస్తులను,, టోపీని ధరిస్తాడు. అతడు పిసిగే పిండిమీద ఎక్కి తొక్కినా తొక్కుతాడు, - ఎందుకంటె శరీరభారమంతా దానిమీద పడితే పిండి చక్కగా మెదుగుతుంది గదా, ముఖంమీద చెమట దాన్లో ఒకవేళ కలిసినాసరే! (అదృష్టవశాత్తు, ఈ కాలంలో యీ పనినంతా యంత్రాలు నిర్వహిస్తున్నాయి.) ఈ అకార్యమంతా ముగిసి, రొట్టె తయారయ్యాక, దాన్నొక పింగాణిపాత్రలో వుంచి, మరకలేని తెల్లని తువ్వాలుతో కప్పి, ఒక పరిచారకుడు - స్వచ్ఛమైన దుస్తులను, తెల్లని చేతిజోడును (గ్లోవ్స్) ధరించినవాడు - తీసుకెళ్లి, నిర్మలమైన గుడ్డతో కప్పబడ్డ భోజనపు బల్లమీద వుంచుతాడు ఇక్కడ జ్ఞాపకం వుంచుకోండి - వట్టి వేళ్లతో అతడు దేన్నీ తాకకుండా వుండటానికోసం గ్లోవ్స్ ధరిస్తాడు

ఇక మన వంట విషయం చూద్దాం మన వంట బ్రాహ్మణుడు ముందు స్నానంచేసి పరిశుద్ధుడై, పిదప చక్కగా తోమబడ్డ పాత్రలతో వంట చేస్తాడు కాని దాన్ని మనకు పెట్టేది నేలమీద మట్టి, ఆవుపేడ కలిపిన తరువాత ఆ నేల అలుకబడుతుంది అతని వస్త్రం ప్రతిరోజూ ఉదుకబడ్డా, ఎన్నడూ ఉదుకబడనంత మురికిబట్టలా కనిపిస్తుంది. మన భోజన పళ్లెంగా అప్పుడప్పుడు వాడబడే అరిటాకు - చిరిగిపోయి వుంటే - మనకు వడ్డించే పులుసు తడినేలతోను, ఆవుపేడతోను కలిసే అవకాశం వుండి ఒక అద్భుత రుచినిస్తుంది!

మనం చక్కగా స్నానం చేశాక, చమురు జిగట అంటుకొన్న ఒక మురికిబట్టను ధరిస్తాం. పాశ్చాత్య దేశస్థులు స్నానంచెయ్యక, మురికి దేహంమీద, స్వచ్ఛమైన ఉడుపులను ధరిస్తారు ఈ సంగతిని బాగా తెలుసుకోవాలి - ఎందుకంటె ప్రాచ్య పాశ్చాత్యాలకున్న ముఖ్య వ్యత్యాసం

ఇక్కడే. హిందువు అంతర్ముఖత్వం, పాశ్చాత్యుని బహిర్ముఖత్వం వారి ఆచారాల్లో, అభ్యాసాల్లో స్పష్టంగా కనిపిస్తుంది. హిందు ఎప్పుడూ అంతర దృష్టిని, పాశ్చాత్యుడు బాహ్యదృష్టిని కలిగి వుంటాడు. హిందువు వజ్రాలను ఒక గుడ్డపేలికతో చుట్టి, పాశ్చాత్యుడు మట్టిబెడ్డలను బంగారు భరిణలో పెట్టి దాస్తారని చెప్పవచ్చును! హిందువు తన దేహాన్ని నిర్మలంగా వుంచుకోవటంకోసం స్నానం చేస్తాడు. తన దుస్తులు ఎంత మురికైనా అతనికి పట్టదు. పాశ్చాత్యుడు స్వచ్ఛమైన ఉడుపులను ధరించటంలో శ్రద్ధ వహిస్తాడు. దేహంమీద మురికివుంటే ఏం? హిందువు తన గదులను, తలుపులను, నేలను, ఇంట్లోని ప్రతిభాగాన్ని సొబగుగా, నిర్మలంగా వుంచుకొంటాడు - ముఖద్వారం బైట పెంటకుప్ప వుంటే అతనికేం? పాశ్చాత్యుడు ఇంటి నేలమీద ప్రకాశవంతాలు, మనోహరాలు అయిన తివాసీలను పరచి వుంచుతాడు. వాటికింద ఎంతో మట్టి, దుమ్ము పేరుకొని వుంటుంది. కాని అవి కనిపించక వున్నప్పుడు, ఆక్షేపణ ఏమీ వుండదు. హిందువు తన రొచ్చుకాలువలను వీథిలోకి ప్రవహింపనిస్తాడు - ఆ దుర్వాసన అంతగా ఆక్షేపణీయం కాదు! పాశ్చాత్యదేశంలో రొచ్చుకాలువలు భూమికింద వుంటాయి - అవి విషజ్వర మూలాలు!! హిందువు ఆంతర పారిశుద్ధ్యాన్ని, పాశ్చాత్యుడు బాహ్యపారిశుద్ధ్యాన్ని గమనిస్తాడు.

నిర్మల శరీరంమీద నిర్మల వస్త్రాలు ధరించే ఆదర్శస్థితి. పుక్కిలించి నోటిని కడుక్కోవటం, పళ్లు తోముకోవటం ఇలాటివన్నీ చేయవలసిందే, - కాని ఇతరుల ముందు కాదు. కాపురంవుండే ఇళ్లు, వీధులు, బాహ్యప్రదేశాలన్నీ శుభ్రంగా వుండాలి. వంట చేసేవాడు తన బట్టలనేకాక, దేహాన్నికూడా పరిశుభ్రంగా వుంచుకోవాలి. అంతేగాక సొంపుగా, పరిశుద్ధంగా వుంచబడ్డ స్థలంలో భోజనం చెయ్యాలి. భోజన సమయంలో పరిశుద్ధమైన గిన్నెలను, పాత్రలను ఉపయోగించాలి. ఆచారాలను లేక నిర్ణీత విధులను అనుష్ఠించి జీవించటం ఆస్తికధర్మ జీవనానికి ప్రథమ సోపానం. అందులో మనశ్శరీర పారిశుద్ధ్యం, సర్వతోముఖ పారిశుద్ధ్యం అత్యంత

ముఖ్యభాగం. ఆచారబాహ్యుడు ఆస్తికధర్మ జీవనాన్ని ఎన్నటికైనా అవలం
బించగలడా? అనాచారపరులు పడే పాట్లు ప్రత్యక్షంగా చూడటం లేదా?
అనాచారజనిత దుర్భర బాధలనెరిగీ, మనం సరైన జీవిత విధానాన్ని అభ్య
సించ పనిలేదా? మన్నెపుజ్వరం, విషూచి, మహామారి వ్యాధులు హిందూ
దేశంలో శాశ్వత నివాసమేర్పరచుకొని, లక్షలకొద్దీ జనాన్ని కొనిపో
తున్నాయి. ఇది ఎవరి తప్పు? నిస్సంశయంగా మనదే మన అనాచారం
అపారం!

"ఆహార శుద్ధౌ సత్త్వశుద్ధిః సత్త్వశుద్ధౌ ధ్రువా స్మృతిః"[1] (ఆహార
శుద్ధివల్ల మనస్తత్త్వం - అంతస్తత్త్వం - పరిశుద్ధమౌతుంది, అంతస్తత్త్వం
పరిశుద్ధమైనప్పుడు స్మృతి - ఆత్మ పరిపూర్ణత యొక్క జ్ఞప్తి - సుస్థిరత
పొందుతుంది) అనే సుప్రసిద్ధ స్మృతి వాక్యంలోని సత్యాన్ని హైందవమత
శాఖలన్నీ అంగీకరిస్తాయి. కాని ఆహార శబ్దం ఇంద్రియాలకు అన్వయి
స్తుందని శంకరాచార్యుడు, ఆహారానికి అన్వయిస్తుందని రామానుజుడు
చెబుతారు. ఈ రెంటిని సమన్వయపరచటం ఎలా? రెండూ అవసరమే
అని అన్ని శాఖలూ చెబుతున్నాయి కాబట్టి మనం ఆ మాటను రెంటికీ
అన్వయించాలి. నిర్మలాహారం లేనిది ఇంద్రియాలు తమతమ ధర్మాలను
ఎలా నిర్వహిస్తాయి? అపరిశుద్ధాహారం వల్ల ఇంద్రియాలు గుణగ్రహణ
శక్తిని కొంత కోల్పోవటమో, సంకల్ప విరుద్ధ ప్రవర్తనాన్ని అవలంబించ
టమో జరుగుతుందని ప్రతివ్యక్తీ అనుభవపూర్వకంగా ఎరుగును. అజీర్ణ
వ్యాధివల్ల వస్తు స్వరూపం వికృతి నొందుతుందనీ, ఫలితంగా ఒక వస్తువు
మరో వస్తువులా కనిపిస్తుందనీ, ఆహార విహీనతవల్ల కళ్ళ మాపు, ఇతరేం
ద్రియశక్తులు బలహీనమై, మందగిస్తాయని అందరూ ఎరుగుదురు.
అలాగే ఒక్కొక్క విధమైన ఆహారం ఒక్కొక్క విధమైన మనశ్శరీరశక్తులని కలి
గిస్తుందని మనకెన్నోసార్లు తెలియవస్తుంది. హైందవ సంఘం ఎంతో
నిష్కర్షగా అనుష్ఠించాలని నియమించిన - "ఇలాంటి ఆహారాన్ని పుచ్చు

1. ఛాందోగ్యోపనిషత్ - VII-26-2

కోవాలి, యిలాటి ఆహారాన్ని పుచ్చుకోకూడదు'' - అని నియమించి వుండే - విధులకు మూలం యీ సత్యమే. కాని అనేకసార్లు మనం యీ మూలసత్యాన్ని - కొబ్బరిలాంటిదాన్ని - మరచి, పై పెంకు విషయంగా కలహిస్తూ, దాన్ని జాగ్రత్తగా కాపాడుకొంటుంటాం.

ఆహారం అపరిశుద్ధ మొనరుస్తుందని తాను చెప్పే మూడు విధాలైన దోషాలను పరిత్యజించమని రామానుజాచార్యులు నియమించి వున్నారు. దీనిలో మొదటిది జాతి దోషం; అంటే కొన్ని ఆహార వస్తువుల్లో, - ఉదా: వెల్లుల్లి, నీరుల్లి మొదలైనవాటిల్లో - వున్న సహజదోషం యివి ఉద్రేకకారక స్వభావం గలవి. వీటిచే మనస్సు కలతచెందుతుంది; అంటే బుద్ధి ఆందోళనంలోను, రెండవది ఆశ్రయదోషం; అంటే ఆ ఆహారం ఎవరివద్దనుండి వస్తుందో వాటి స్వభావంలోని దోషం. దుష్టుడు తెచ్చిన ఆహారం తిన్నవాణ్ణి అపవిత్రుణొనర్చి, దుష్టభావాలు తలపచేస్తాయి. సత్పురుషుడు తెచ్చిన ఆహారం ఉన్నత భావకారణ మవుతుంది. ఇక మూడవది నిమిత్తదోషం అంటే మురికి, దుమ్ము, పురుగులు, వెంట్రు కలు మొదలైన బాహ్యదోషాల కలయికచే కలిగే దోషం - అలాటి ఆహారం వల్లకూడా మనస్సు అపవిత్ర మవుతుంది. ఈ మూడు దోషాల్లో ప్రతి వాడూ జాతి, నిమిత్త దోషాలను తప్పించుకోవచ్చును; కాని ఆశ్రయ దోషాన్ని తప్పించుకోవటం అందరికీ సులభంకాదు ఈ ఆశ్రయదోష పరి హారార్థమే మన కీ కాలంలో యింత ఎక్కువగా వుండే అస్పృశ్యత, ''నన్ను ముట్టుకోవద్దు'' ''నన్ను ముట్టుకోవద్దు'' అనే మాట ఉచ్చరించబడు తోంది. కాని అనేకసార్లు యీనియమంయొక్క నిజమైన అర్థాన్ని మనం గ్రహించక, విపరీత ప్రవర్తన మవలంబించటంతో యిది చిత్రం, ఘోరం అయ్యే మూఢభావంగా ఏర్పడుతుంది ఇలాటి విషయాల్లో మనం లోకా చారాన్నిగాక, మన ఆచార ప్రముఖు లవలంబించిన మార్గాన్ని అనుసరిం చాలి. చైతన్యదేవునివంటి మహాపురుషుల, యితర మతాచార్య సత్తముల జీవితాలను చదివి వారు యీ విషయంలో జనసామాన్యంతో ఎలా

ప్రవర్తించిందీ తెలుసుకోవాలి. భోజన విషయక జాతిదోష పరిశీలనకు హిందూదేశమంత అనుకూలమైనది మరో దేశం లేదు. ప్రపంచంలోని సమస్త దేశ జాతుల్లో హిందువులే నిర్మలతమమైన ఆహారాన్ని తీసుకొంటారు; ఆహార జాతి నైర్మల్యం హిందూదేశంలోనే ఎంతో జాగ్రత్తగా పాటించబడుతోంది. ఇప్పుడు మనం నిమిత్తదోష విషయంలో యింకా కొంత ఎక్కువ శ్రద్ధవహించటం మంచిది. అది మనకిప్పుడు అపారమైన కీడు కలిగిస్తోంది. బజారులోని మిఠాయి దుకాణంలో తినుబండారాలు కొనటం ప్రస్తుతం బాగా అలవాటైపోయింది; ఆ పదార్థాలు నిమిత్తదోష దృష్ట్యా ఎంత మలినాలో మనమే ఆలోచించవచ్చును బైటపెట్టి అమ్మటం చేత, వీథిలోని మురికి, దుమ్ము, చచ్చిన పురుగులు వాటిని అంటుకొని వుంటాయని, అవి ఒక్కొక్కసారి ఎంతో పాతబడి, ఎంతో భ్రష్టాలై వుంటాయని వూహించవచ్చును. ప్రతి యింట యిప్పుడు సాధారణంగా కానవచ్చే అజీర్ణవ్యాధికి, నగరవాసుల నింతగా బాధించే మధుమేహవ్యాధికి బజారులో అమ్మే మలినాహారాన్ని తినటమే కారణం. ఈ వ్యాధులు గ్రామస్థుల కింతగా లేకుండటానికి ముఖ్యకారణం లూచీ (పూరీవంటి ఒక భక్ష్యం), కచూరీ (వంగదేశంలో జనం తినే భక్ష్యవిశేషం) మొదలైన విషసమానాహారం స్వేచ్ఛగా లభించే అంగళ్లు అక్కడ లేకపోవటమే. ఈ విషయాన్ని నేనింకాసవివరంగా పిదప ప్రస్తావిస్తాను.

ఆహారాన్ని గూర్చి పూర్వపు సామాన్య నియమాన్ని యిక్కడ సంగ్రహంగా చెప్పాను. కాని దీన్నిగూర్చి అభిప్రాయభేదా లెన్నో వున్నాయి. ఇప్పుడూ వున్నాయి. అంతేగాక పూర్వకాలంలో మాదిరి యిప్పుడూ మాంసాహారం తినటం మంచిదా చెడ్డదా, లేక శాఖాహారంతోనే జీవించాలా, మాంసాహారం మనకు క్షేమకరమా కాదా అనే విషయాన్నిగూర్చి గొప్పవాదం వుంది. ప్రాణం తియ్యటం పాపమని, అలా ఎన్నడూ చెయ్యకూడదని ఒక పక్షంవారు వాదిస్తారు. ''మీ అభిప్రాయం ఆదరించతగ్గది కాదు! జంతుహింస చెయ్యక బతకటమే అసాధ్యం'' అని రెండో పక్షం

వారు దీనికి జవాబిస్తారు. ఈ విషయంలో శాస్త్రాలుకూడా భిన్నాభిప్రాయాలు వ్యక్తంచేస్తూ బుద్ధిని కలవరపెడుతున్నాయని చెప్పవచ్చును "యజ్ఞాల్లో జంతువధను గావించండి" అని శాస్త్రం ఒకచోట ఆదేశిస్తుంది. మరోచోట అదే "ప్రాణాన్నెప్పుడూ తీయ్యవద్దు" అని చెబుతోంది. యజ్ఞాల్లో తప్ప జంతువధ గావించటం పాపమని హిందువుల మతం. కాని యజ్ఞంలో వధించబడ్డాక ఆ జంతువు మాంసాన్ని తినే సుఖాన్ని నిరాపేక్షంగా అనుభవించవచ్చును. గృహమేధికి విధింపబడ్డ నియమాల్లో అతడు శ్రద్ధాదులైన కొన్ని అవసరాల్లో జంతువులను వధించాల్సి వుంటుంది. ఆ అవసరాల్లో జంతువధ గావించకపోతే అతడు పాపం చేసినట్లు నిందార్హు డవుతాడు. శ్రాద్ధాలకు, మరికొన్ని కర్మలకు ఆహుతులైనవారు అక్కడ వుంచబడిన మాంసాహారాన్ని తినకపోతే, వారు జన్మాంతరంలో జంతువులై పుడతారని మనువు చెప్పాడు. కాని జైనులు, బౌద్ధులు, వైష్ణవులు యిందుకు ఆక్షేపించి "హైందవ శాస్త్రాదేశాలను మేం విశ్వసించం; హింసాచరణం ఎలాంటి సందర్భాల్లోను సహించ కూడదు" అంటారు. బౌద్ధమతావలంబి చక్రవర్తి అశోకుడు యజ్ఞాలు చేసేవారిని, ఏ కర్మలోగాని ఆహుతులకు మాంసాహారాన్ని పెట్టేవారిని శిక్షిస్తుండేవాడని గ్రంథాల్లో పేర్కొనబడింది. ఆధునిక వైష్ణవులు కొంత కష్టస్థితిలో వున్నారు. వారు దేవతలుగా పూజించే రాముడు, కృష్ణుడు మద్యపాన మాంసభక్షణ మొనర్చినట్లు, సీతాదేవి గంగానదీ దేవతకు మాంసాన్ని, అన్నాన్ని, నెయ్యి కుండల మధువును సమర్పింప మొక్కుకున్నట్లు రామాయణ[11] మహాభారతాల్లో వుంది.

---

11 సీతామాదాయ బాహుభ్యాం మధుమైరేయకం శుచి।
పాయయామాస కాకుత్స్థః శచీమింద్రో యథామృతమ్॥
మాంసాని చ సుమృష్టాని వివిధాని ఫలాని చ।
రామస్యాభ్యవహారార్థం కింకరాస్తూర్ణమాహరన్॥

(సీతను రెండు బాహువులతో కౌగిలించుకొని కాకుత్స్థ వంశస్థుడైన రాముడు శుచి అయిన మైరేయము మధువును, - ఇంద్రుడు శచీదేవిచేత అమృతం తాగించినట్లు,

మాంసాహారం ఆరోగ్య హానికరమా కాదా, శాఖా[illegible] పుష్టికరమైనదా కాదా అనే వివాదాలు పాశ్చాత్య దేశాల్లో వు[illegible]యి. మాంసాహారులు సకల శారీరక వ్యాధులతో పీడింపబడతారని ఒ[illegible] వాద టారు. రెండో పక్షంవా రది ఒప్పుకోక యిలా అంటారు: [illegible] మిథ్యాకల్పన. అదే నిజమైతే ఆరోగ్య విషయంలో సమస్త జాతుల్లో హిందువులు అధికతమయులై వుండివుండాలి; మాంసాహారమే ప్రధానంగా వున్న ఆంగ్లేయులు, అమెరికన్లు మొదలైన బలిష్ఠ జాతులు, సర్వవిధ జాడ్యాల కాహాలై యిప్పటికి నిర్మూలులైపోయి వుంటారు.'' మేక మాంసం మేకబుద్ధిని, పందిమాంసం పందిబుద్ధిని, చేపమాంసం చేప బుద్ధిని కలిగిస్తాయని ఒక పక్షంవా రంటారు. అలాగైతే బంగాళా దుంప బంగాళాదుంపబుద్ధిని, కూరగాయలు కూరగాయలబుద్ధిని - అంటే జడాన్ని, నిర్జీవపదార్థ తుల్యాన్ని జడ బుద్ధిని - కలిగిస్తాయని వాదించవచ్చని రెండవ పక్షంవా రంటారు. బుద్ధి జడమై నిర్జీవపదార్థంలా మాంద్యం పొందివుండటంకంటె సజీవ జంతుబుద్ధిని పొందటం శ్రేష్ఠం కాదా? శాఖాహారపు రసాయనిక సమ్మేళనంలోని వస్తువులే జంతువుల్లో

---

- ఆమెచేత తాగించాడు సేవకులు శీఘ్రంగా సుమృష్ట మాంసాహారాలను, నానారకాలైన పళ్లను రాముడికి పట్టించారు )

సురాఘట సహస్రేణ మాంసభూతోదనేన చ।
యక్ష్యే త్వాం ప్రీయతాం దేవి పురీం పునరుపాగతా॥
(దేవీ, మాపట్ల కృప కలిగివుండు, నేను తిరిగి పురాన్ని చేరినప్పుడు వెయ్యి కుండల కల్లుతోను, మాంసంతో వండిన అన్నంతోను నిన్ను పూజిస్తాను.)

—రామాయణం.

ఉభౌ మధ్వాసవక్షీబావుభౌ చందన భూషితౌ।
స్రగ్విణౌ వరవస్త్రౌ తౌ దివ్యాభరణభూషితౌ॥
(ఆ కృష్ణార్జునులు యిరువురూ ఇప్పపువ్వు కల్లుతాగి, చందన చర్చితాంగులై పూదండలను, శ్రేష్ఠమైన వస్త్రాలను, దివ్యాభరణాలను ధరించి వుండటాన్ని నేను చూశాను )

—మహాభారతం, ఉద్యోగపర్వం, అధ్యా: 59,5.

కూడా వున్నాయని ఒక పక్షంవారు చెబుతారు. రెండవ పక్షం యీ వాదాన్ని పరిహసించి ''ఎందుకు? అవి గాల్లో కూడా వున్నాయి. కాబట్టి వెళ్లి వాయుభక్షణం చేసి జీవించు'' అంటారు శాఖాహారులు ఎంతో పాటుపడగలరనీ, గాఢమై దీర్ఘ పరిశ్రమ అవసరమైన కార్యాన్ని నిర్వహింప గలుగుతారని ఒక పక్షంవారు వాదిస్తారు. ''అది నిజమైతే, శాఖాహార జాతులు ప్రపంచంలో అగ్రస్థానంలో వుండాలని, వారలా లేరనీ, మాంసా హారులే బలిష్ఠులై అగ్రస్థానాన్ని ఆక్రమించి వున్నారని'' రెండో పక్షంవారు దీనికి బదులిస్తారు. ''హిందువులను, చైనా దేశస్థులను చూడండి, ఎంత దౌర్భాగ్యస్థితిలో వున్నారో. వారు మాంసాహారం తినరు; అన్నం, నానా రకాల శాకాలు తిని ఆ అల్పాహారంతో ఎలాగో జీవిస్తుంటారు. వారి దుస్థితిని పరికించండి. జపాన్ దేశస్థులూ యిలాటి దుర్దశలోనే వున్నారు. కాని మాంసాహారాన్ని తినటానికి ఆరంభించాక వారి స్థితే మారిపోయింది. హైందవ సైనికదళాల్లో ఒకటిన్నర లక్షలమంది ఆ దేశస్థులైన సిపాయీ లున్నారు, అందులో ఎంతమంది మాంసాహారులో చూడండి. వారిలో శ్రేష్ఠులైన సిక్కులు, గూర్ఖాలు మొదలైనవారు శాకాహారులు కానేకారు'' అని మాంసాహార పక్షంవారు వాదిస్తారు ''మాంసాహారం అజీర్ణవ్యాధికి మూలం'' అని ఒక పక్షంవారు వాదిస్తారు ''అవన్నీ వెర్రిమొర్రి, అర్థంలేని మాటలు. శాఖాహారులకే జీర్ణకోశవ్యాధు లెక్కువగా వస్తాయి'' అని ''శాఖాహారం శరీరానికి చక్కని విరేచనకారిగా వుండొచ్చును. కాని అంత మాత్రంచేతే లోకమంతా ఆ ఆహారాన్నే స్వీకరించాలా?'' అనీ రెండో పక్షంవా రంటారు.

ఈ రెండు పక్షాలవారు ఏం చెప్పినా, మాంసాహార జాతులు ఎల్ల ప్పుడూ, ధీరత్వంచేత, సాహసంచేత, యోచనాపరత్వంచేత ప్రసిద్ధులై వుండటమే సామాన్యంగా కనిపిస్తుంది. మాంసాహార జాతు లిలాకూడా అంటారు: ''యజ్ఞధూమం మింటికెగసేటప్పుడు, ఆహూత పశుమాం సాన్ని తినే కాలంలోనే హిందువుల్లో ప్రతిభాగ్రగణ్యులైన మతాచార్యులు,

అసమానమహితమైన బుద్ధిగలవారు పుట్టేవారు కాని వారు 'బాబాజీ'ల వద్ద శాకాహారాభ్యాసం అలవరచుకొన్నాక, వారిలో ఒక్కడైనా మహాపురుషుడు, ఉపజ్ఞాశక్తిమహితుడు ఉద్భవించలేదు '' ఈ భావాన్ని పరిగణించి మన దేశంలోని మాంసాహారులు ఆ ఆహారాన్ని మానుకోవటానికి భయ పడుతున్నారు. ఆర్యసామాజికుల్లో యీ విషయంలో అభిప్రాయభేదాలు న్నాయి. వారిలో యీ విషయం తీవ్రంగా చర్చించబడుతోంది. మాంసాహారం ముఖ్యమని ఒక వర్గం, అది కేవలం దోషం, అనైతికం అని రెండవ వర్గం వాదించుకొంటున్నాయి.

ఈ విధంగా పరస్పర నిందలతో, కలహాలతో, యుద్ధాలతో కూడిన విరుద్ధవాదాలు జరుగుతున్నాయి. ఎంతో సున్నితమైన యీ ఆహార విషయక సమస్యను గూర్చి చెలరేగుతున్న వితండవాదా లన్నింటిని తోసిపుచ్చి, నే నీ విషయాన్ని సర్వతోముఖంగా, అతిజాగ్రత్తగా పరిశీలించాను. తత్ఫలంగా నాకు కలిగిన నిశ్చితాభిప్రాయం హిందువుల భావమే సరైనదని; అంటే హిందూశాస్త్రాల్లో నిర్దేశించబడినట్లు ప్రత్యేక మానవుల జన్మాన్ని, వృత్తిని అనుసరించి వారి ఆహారం - తక్కిన అనేక విషయాలను పోలి - భిన్నమై వుండాలి ఇదే నిర్దుష్టమైన అభిప్రాయం. కాని యీ కాలపు హిందువులు శాస్త్రాల ననుసరించరు, ఆచార్య సత్తముల బోధలనుకూడా ఆలకించరు.

మాంసం తినటం మొరటుకార్య మనటానికి సందేహం లేదు; శాకాహారం నిస్సంశయంగా నిర్మలతరం, - దీన్నెవరు కాదంటారు? పారమార్థిక జీవనం గడపటమే జీవిత లక్ష్యంగా వున్న వ్యక్తికి శాకాహారమే తగిన దనటం నిస్సంశయమే. కాని తన జీవిత నౌకను అతిప్రయాసతో, ఎడతెగని చావు బతుకుల పోరాటాల్లో చిక్కి, ప్రపంచ పోటీల నెదుర్కొంటూ నడిపించవలసినవాడు మాంసాహారం తీసుకొనే తీరాలి. మానవ సమాజంలో 'బలహీనులను బలవంతులు అణగదొక్కి విజయోత్సాహం పొందట' మనేది వుండేంతకాలం మాంసాహారం ఆవశ్యకమే;

దానికి సమానమైనది మరో ఉచితాహారం ఏదైనా కనిపెట్టబడాలి లేకపోతే బలవంతులు బలహీనులను తమ పాదాల కింద పడేసి అణచివెయ్యటంలో వింతేముంది మానవుల్లో ఏ కొద్దిమందో శాకాహారంవల్ల ఉపకారం పొందారనటం నిష్ప్రయోజనం; - ఒక జాతిని మరో జాతితో పోల్చి, ఆ పిదప విషయ నిర్ధారణం చెయ్యండి

శాకాహారుల్లోకూడా పరస్పర భిన్నాభిప్రాయాలున్నాయి బియ్యం, బంగాళాదుంపలు, గోధుమలు, యవలు, జొన్నలు మొదలైన గంజికట్టు (స్టార్చ్) పదార్థాలు భోజనానికి పనికిరావని కొందరి అభిప్రాయం 'ఇవి మనుష్యులచేత ఉత్పత్తి చేయబడినవి, సకల జాడ్య మూలాలు గంజికట్టు పదార్థాల భోజనం శరీరంలో చక్కెరను ఉత్పత్తిచేసి ఎంతో హాని కలిగిస్తాయి గుర్రాలు, ఆవులుకూడా యింటి ఆవరణలో వుంచబడి, గోధుమ, బియ్యం తింటుంటే తెవులుపడతాయి. కాని పచ్చికబయళ్లలోని పచ్చిగడ్డిని, పెరుగుతూన్న మొక్కలను ధారాళంగా తిరిగి తింటే, అవి పునరారోగ్యవంతా అవుతాయి పచ్చిగడ్డిలోను, తినదగ్గ పచ్చి మొక్కలలోను గంజికట్టు పదార్థం అతిస్వల్పం. ఒరోంగ్‌టాంగ్ అనే జాతి కోతి పచ్చిగడ్డిని, పప్పుగింజలను (నట్స్) తింటుంది బంగాళాదుంపలను, గోధుమను సాధారణంగా తినదు ఎప్పుడైనా వాటిని తింటే, అవి ముదరటానికి ముందే, అంటే వాటిలో గంజికట్టు పదార్థం అంతగా చేరకముందే తింటుంది. వేపుడు మాంసాన్ని, పండ్లను, పాలను సమృద్ధిగా తీసుకుంటే, అవి దీర్ఘజీవిత సాధకాలుగా ఉపకరిస్తాయని మరికొందరి అభిప్రాయం అంతేగాక, పండ్లను సమృద్ధిగా, ప్రతి దినం తినేవారు యౌవనాన్ని చాలకాలం నిలుపుకోగలరు. ఎముకల్లో చేరి కరుడుకట్టు విషపదార్థాన్ని పండ్లలోని పులుపు పదార్థం కరిగిస్తుంది, ముసలితనాన్ని తెచ్చేది యీ విషపదార్థమే

ఈ వాదాలన్నీ ఎన్నటికీ ముగియక అనంతంగా చెలరేగుతున్నాయి నిరంతర వివాదాగ్రస్తమై వుండే యీ సమస్యను సర్వసమ్మతమై, వివేక

మహత్తమైన పరిష్కారం సారవంతం, పుష్టికరమై సులభంగా జీర్ణమయ్యే ఆహారాన్ని తీసుకోవటం మవుతుంది అది అల్పపరిమాణంలో అత్యధిక పుష్టినిస్తూ, శీఘ్రకాలంలో శరీరంలో యిమిడిపోయేదిగా వుండాలి. లేకపోతే తినే పరిమాణం అధికం కావాలి. అంత పరిమాణంగల ఆహారం అరగటానికే రోజంతా పడుతుంది. మన శక్తంతా ఆహారం జీర్ణించుకోవటానికే వినియోగిస్తే, యితర పనులు చేసుకోవటానికి శక్తి ఎలా లభిస్తుంది?

వేపుడు పదార్థాలన్నీ విషప్రాయాలే. మిఠాయి దుకాణం మరణ ద్వారమే. ఉష్ణ దేశాల్లో చమురు, నెయ్యి, ఎంత తక్కువగా ఉపయోగిస్తే అంత మంచిది. నేతికంటె వెన్న సులభంగా అరుగుతుంది. మంచులా తెల్లగావుండే గోధుమపిండిలో బలాన్నిచ్చే వస్తువు అతిస్వల్పం. పొట్టు తియ్యని గోధుమపిండి సముచిత ఆహారం. వంగదేశంలో దూర గ్రామాల్లో యిప్పటికీ వాడుకలో వున్న ఆహార పదార్థ పచన విధానం, నైఖరి ప్రసంసార్హాలు. ప్రాచీన వంగ కవి ఎవడైనా లూచీ, కచూరీలను ప్రశంసించాడా? వాయువ్య ప్రాంతాలనుండి యీ లూచీ, కచూరీలు ప్రవేశపెట్టబడ్డాయి; కాని ఆ ప్రాంతాల్లోకూడా వాటిని ఎప్పుడో ఒక్కసారి మాత్రమే తింటారు. ప్రతిరోజు నేతి వేపుడు పదార్థాలనే ముఖ్యంగా తిని జీవించే వారిని అక్కడా నే నెవరినీ చూడలేదు. మధురలో కుస్తీలుపట్టే 'చౌబే' జెట్టీలు లూచీలు, మధురభక్ష్యాలు ప్రీతితో తింటారు నిజమే; కాని కొన్ని ఏళ్లల్లో చౌబేజీ జీర్ణశక్తి తగ్గిపోయి, అతడు చూర్ణాలనే పేరుగల ఆకలి మందులను పుచ్చుకోవాల్సి వుంటుంది.

పేదలు తినటానికి ఏమీ లేక పస్తులుండి చస్తారు; ధనవంతులు పస్తులుండే చస్తారు - వారి భోజనం ఆహారార్థం కాదుకాబట్టి. తినే వస్తువులన్నీ - అవి ఏవైనా - ఆహారం కాబోదు. తిన్న తరువాత బాగా జీర్ణమై, యిమిడేదే నిజమైన ఆహారం. ప్రతి వస్తువుతోను - అదేదైనా - కడుపు నింపుకోవటంకంటె ఉపవాసం వుండటం మేలు. భక్ష్యాలమ్మే దుకాణాల్లో

ఎంతో నాజూకైనవిగా ఎన్నబడే పదార్థాల్లో పుష్టికరమైన దొక్కటీ లేదనే చెప్పాలి. వాటిలో వుండేది విషం! పూర్వం ఆ హానికర పదార్థాలను ఎప్పుడో ఒక్కొక్కసారే తినేవారు. కాని యిప్పుడు నగరవాసులు - అందులో ముఖ్యంగా గ్రామాలనుండి వచ్చి కాపురం చేసేవారు - యీ విషయంలో ముఖ్యదోషులు వీటిని వారు రోజూ తింటారు. వారు అజీర్ణ వ్యాధి కెరయై అకాలమృత్యువు వాతబడటం చిత్రమా! నీకు ఆకలి ఐతే మధురభక్ష్యాలను, నేతివేపుడు పదార్థాలను రొచ్చుకాలువలో పారేసి, ఒక కాని బొరుగులు కొని తిను - అవి చౌకే గాక, పుష్టికరంకూడా. అన్నం, పప్పు, పొట్టు తియ్యని గోధుమపిండి చెపాతీలు, చేపలు, కూరగాయలు, పాలు. యీ ఆహారం చాలు. కాని పప్పు దక్షిణ హిందూ దేశస్థుల మాదిరి -, అంటె పప్పుకట్టు (రసం) మాత్రం గైకొని, తక్కిన భాగం పశువులకు వెయ్యండి. కలవారు మాంసం తినవచ్చును. కాని అందులో వాయవ్య ప్రాంతం వారి మాదిరి వేడిచేసే వాసనద్రవ్యాలు కలిపి దాన్ని జీర్ణం కాకుండా చేసుకోకూడదు ఈ తిరుగబోత పదార్థాలు ఆహారార్థాలే కావు; వాటిని అపరిమితంగా వాడటం దురభ్యాస మూలంగానే. పప్పు మంచి పౌష్టికాహారమేగాని, దాన్ని జీర్ణించుకోవటం కష్టం. లేత బటానీలకట్టు తేలిగ్గా అరుగుతుంది, రుచిగానూ వుంటుంది. 'ప-రీ'లో బటానీకట్టును అతిప్రియంగా చూస్తారు. ముందు బటానీలను బాగా ఉడికించి, అంబలి మాదిరి చేసి నీటితో కలపండి. ఈ కట్టు నిప్పుడు తీగవడబోత పాత్ర గుండా - పాలు వడబోసే పాత్ర లాంటిది - వడబోయండి. బటానీ పొట్టంతా అప్పుడు పోతుంది. దీన్లో యిప్పుడు వాసనద్రవ్యాలు - పసుపు, మిరియాలు మొదలైనవి - చేర్చి ఒక బానలిలో కొంచెం నేతిలో వుడికించండి రుచి, ఆరోగ్యకరమైన పప్పుకట్టు తయారౌతుంది. మేక తల తోనో, చేపలతోనో దీన్ని ఉడికిస్తే మాంసాహారుల కిది కమ్మగా వుంటుంది

హిందూదేశంలో మధుమేహవ్యాధితో యిందరు పీడింపబడటానికి ముఖ్యకారణం అజీర్ణమే. అక్కడక్కడ ఎవరో ఒక్కొక్కరికి మెదడుతో

ఎక్కువగా పరిశ్రమించటంవల్ల కూడా యిది కలగటం నిజమేకాని, సామా న్యంగా అజీర్ణవ్యాధే కారణం. బొజ్జ పెరగడం అజీర్ణవ్యాధికొక ముఖ్య లక్షణం. భోజనం అంటే కడుపులో కూరుకోవటం అని అర్థమా? ఎవరెంత జీర్ణం చేసుకోగలరో, అంతే వారికి జీర్ణమైన భోజనం. చిక్కి-పోవటం, బలవటంకూడా అజీర్ణంవల్లే కలుగుతాయి. నీలో మధుమేహ వ్యాధి లక్షణాలు కొన్ని కనిపించగానే నిరాశపడొద్దు; మన దేశంలో అవి పరిగణింపబడేవే కావు. వాటికి ప్రాముఖ్యం యివ్వరాదు. భోజన విష యంలో మాత్రం జాగ్రత్తవహించి అజీర్ణవ్యాధి రాకుండా చూసుకోండి. సాధ్యమైనంత సమయం బహిరంగ ప్రదేశంలో గడపండి. చాలదూరం నడవండి గాఢ పరిశ్రమ చెయ్యండి. కాళ్ల కండరాలు ఇనుం మాదిరి గట్టిగా వుండాలి. ఉద్యోగంలో ఉంటే, వీలయినప్పుడు సెలవు తీసుకొని, హిమాలయాల్లోని బదరికాశ్రమానికి యాత్ర చెయ్యండి. కొండలు ఎక్కటంలో, దిగటంలో, రెండు వందల మైళ్లున్న యీ యాత్రనంతా కాలినడకనే సాగిస్తే మధుమేహ భూతం నిన్ను విడిచి పారిపోవటం నీకే కనిపిస్తుంది. డాక్టర్లను నీ వద్దకు రానివ్వొద్దు వారిలో ఎక్కువమంది నీకు ఉపకారంకంటె అపకారాన్నే ఎక్కువ చేస్తారు; సాధ్యమైనంతదాకా మందులే తీసుకోవద్దు. అవి చాలసార్లు జాడ్యంకంటె ముందే రోగిని చంపుతాయి. నడవగలిగితే, దసరా సెలవుల్లో నగరంనుండి మీ స్వగ్రామానికి రాకపోకలు కాలినడకనే సాగించు మన దేశంలో ధనికుడు అనేమాట సోమరితనానికి, యితరులమీద ఆధారపడి వుండటానికి పర్యాయపదమైపోయింది. నడవటానికి యితరుల సహాయం కావలసినవాడు, యితరులచేత అన్నం. తినిపించుకోవలసినవాడు, క్లేశాలు అనుభవించక తప్పదు - అతడు నిస్సంశయంగా దుర్బలుడే. లూచీ అంతా తింటే తనకు అరగదని, దాని పలుచని పూత భాగాన్ని మాత్రమే జాగ్రత్తగా తినేవాడు బతికి వున్నప్పుడే చచ్చినవాడితో లెక్క ఒక్కపట్టున యిరవై మైళ్లు నడవలేనివాడు మనిషా, కీటకమా? ప్రయత్నించి రోగాన్ని, అకాల మృత్యువును చేరతీసుకొన్న వాణ్ణి ఎవరు రక్షించగలరు

పులిసి పొంగబారిన రొట్టెకూడా విషమే దాన్ని తాకనే వద్దు. పొంగు పదార్థంతో కలిపితే పిండి హానికరమౌతుంది. పొంగింపబడ్డ దేన్నీ తిన వద్దు. మన శాస్త్రాల్లో అలాటి ఆహారం నిషిద్ధం. ఈ విషయం అత్యంత ముఖ్యమౌతోంది పులియబారిన తీపి పదార్థం మన శాస్త్రాల్లో 'శుక్త' మన బడుతోంది. పెరుగు ఒక్కటి తప్ప శుక్తపదార్థాలన్నీ నిషిద్ధాలు - అది మాత్రం శరీరానికి మంచిది, ఉపకారి. పొంగించిన రొట్టెను తినవలసివస్తే, దాన్ని ముందుగా నిప్పులమీద చక్కగా కాల్చండి.

అపరిశుద్ధ జలం, అపరిశుద్ధాహారం సమస్త వ్యాధులకు కారకం. అమెరికాలో తాగే నీటిని పరిశుద్ధపరచటం యిప్పుడొక వెర్రి పంది 'ఫిల్టర్'ను (నీటిని వడపోసి పరిశుద్ధపరిచే సాధనం) నమ్మకాలం పోయింది. ఇప్పుడది అప్రతిష్ఠపాలైంది ఇందుకు కారణం. నీరు దాన్లో యింకి దిగుతుంది, నిజమేకాని, ఆ నీళ్లలోని క్రిములు - విషూచి, మహా మారి మొదలైన వ్యాధులకు కారణమైనవి - అక్కడే నిలిచిపోతాయి. ఇది కాక ఆ ఫిల్టరే క్రమేణా యీ క్రిములు పెరగటానికి అనుకూలమైన స్థావర మవుతుంది కలకత్తాలో ఫిల్టర్లు మొదట ప్రవేశపెట్టబడినప్పుడు పదేళ్ల పాటు విషూచీవ్యాధి బైటపడలేదట. ఆ తరువాత అది మునుపటిమాదిరే తీవ్రంగా చెలరేగింది. దీనికి కారణం ఆ పెద్ద ఫిల్టర్లే విషూచి క్రిములు వచ్చే మార్గంగా ఏర్పడటం. నీరు వడపోసే సాధనాలన్నిట్లో మనం సామాన్యంగా వాడేదే - మూడుకాళ్ల వెదురు చట్రంమీద మూడు కుండ లను ఒకదానిమీద ఒకటి వుంచి వడపోత సాధనమే - శ్రేష్ఠమైనది కాని ప్రతి రెండు మూడు రోజులకు యిసుకను, బొగ్గును, మార్చి వేడిచేశాకనే తిరిగి వాడాలి కలకత్తాకు సమీప గంగానదీ తీర గ్రామాల్లో వాడుకలో వుండే పద్ధతి - పటికముద్దను గుడ్డలో పెట్టి, దానిగుండా నీటిని వడ పోయటం - అన్ని పద్ధతుల్లో శ్రేష్ఠమైంది మట్టిని, యితర అపరిశుద్ధ పదార్థాలను, వ్యాధికారక క్రిములను పటికముక్కలు తమతో చేర్చుకొని క్రమక్రమంగా లోటుబానలో మడుగు ('మష్టు')గా నిలుస్తుంది. ఈ

సులభమార్గం గొట్టపునీటిని నిర్దుష్టమొనరించి, విదేశీయు పిల్లలు అన్నిటి కంటె శ్రేష్ఠమైవుంటుంది ఇదికాక నీటిని సలసల కాస్తే, అది పూర్తి నిర్దుష్టమంటాను. పటికవల్ల అపరిశుద్ధ పదార్థమంతా 'మష్టు'గా నిలిచి పోయిన పిమ్మట ఆ నీటిని సలసల కాచి తాగండి. పిల్లలమొదలైన సాధనాలను రొమ్ముకాలువతో పారెయ్యండి. ఇప్పుడు అమెరికాలో పెద్ద యంత్రాలతో నీటిని ఆవిరిగా మార్చి, ఆ ఆవిరిని తిరిగి నీరయేట్లు చల్లార్చి, ఆవిరై బైటకెళ్లిన గాలికి బదులుగా మరొక యంత్రంతో నిర్మల మైన గాలిని దానిలోకి పంపుతారు. ఈ నీరు ఎంతో నిర్మలమైంది. దీన్నిప్పుడు ప్రతి యింట్లోను తాగే నీరుగా వాడుతున్నారు.

మన దేశంలో, కొంత స్థితిపరులైనవారు నానారకాలైన తీపిపదార్థా లను, నేతితో వేయించబడ్డ పదార్థాలను తమ పిల్లలచే తినిపిస్తారు. ఎందు కంటె వారికి అన్నం, చపాతీలు మాత్రమే పెడితే జనం ఏమనుకుంటారో! ఎంత అవమానకరం అది! ఇలాటి ఆహారంతో పెంచబడ్డ పిల్లలు, ఎలా వుంటారో మనం వూహించవచ్చును - వికారస్వరూపాలు కలిగి, సోమరులై, అప్రయోజకులై, బుద్ధిహీనులై, వెన్నెముక లేనివారి మాదిరిగా వుంటారు! ఆంగ్లేయులు ఎంతో బలిష్ఠజాతివారు; రేయింబవళ్లు గాఢంగా పరిశ్రమిస్తారు; వారి నివాసం చలిదేశంలో - ఇలావుండీ తీపిపదార్థాలన్నా, వెన్నతో వేగిన వస్తువులన్నా వారికి భయం! ఇక మనం? అగ్నిమండలం మన దగ్గ దేశంలో వుంటూ, ఒకచోటు నుండీ మరోచోటుకు కదలటానికి యిష్టపడనివారమైవుండీ, ఎలాటి ఆహారాన్ని భుజిస్తాం? లూచీలు, కచూ రీలు, తీపిపదార్థాలు, నేతితోనో, నూనెతోనో వేగించిన పదార్థాలను తింటాం! పూర్వకాలంలో వంగదేశంలో మన గ్రామ జమీందారులు యిరవై ముప్ఫై మైళ్లు నడవటానికి ఏమాత్రం లెక్కచేసేవారు కాదు. నలభై కోయి చేపలను - ఎముకలతోసహా తినేవారు. వారు నూరేళ్లు బతికేవారు. ఇప్పుడు వారి కొడుకులు, మనుమలు కలకత్తాకు వచ్చి, అహంకారం వహించి, కళ్లద్దాలు ధరించి, అంగడి వీధిలోని మధురభక్ష్యాలు తింటూ,

ఒక వీధి నుండి మరో వీధికి పోవటానికి బాడుగబండి కుదుర్చుకొంటూ, మధుమేహవ్యాధి పీడిస్తూందంటారు; అకాల మృత్యువు వాతపడు తుంటారు; వారు నాగరికత పొందిన ఫలం యిది. 'కలకత్తావా'రైనందుకు ఫలం! డాక్టర్లు, నాటువైద్యులుకూడా వారి నాశనానికి తోడ్పడతారు. వారు సర్వజ్ఞులు, తమ ఔషధాలతో ఏ వ్యాధినైనా నయంచెయ్యగలమని వారి నమ్మకం కడుపులో వాయువు కొంచెం అధికమైతే, వెంటనే ఒక ఔషధం సేవించమంటారు. అయ్యో! 'మీకు మందులేవీ అక్కర్లేదు, వెళ్లి నాలు గైదు మైళ్లు బాగా నడవండి' అని చెబితేచాలనే భావం యీ వైద్యుల బుర్రలో దూరదే!

నేను అనేక దేశాలను, నానారకాలైన ఆహారపచన విధానాలను చూస్తు న్నాను. కాని యిందులో ఏవీ మన వంగదేశంలో వివిధ పదార్థాలు చేసే అద్భుత పాక విధానానికి సాటిరావు వాటి రుచిని మళ్లీ అనుభవించటానికై పునర్జన్మ ఎత్తాలని కోర్కె కలుగుతోందనటం అతిశయోక్తి కానేకాదు. పండ్లు వున్నంతకాలం వాటి విలువలు అనేకులు గ్రహించకపోవటం ఎంత శోచనీయం! భోజన విషయంలో మనం పాశ్చాత్య దేశాల నెందుకు అను కరించాలి? అలా చెయ్యగల ధనవంతు లెందరున్నారు?

మన ప్రాంతం వారికి అనువైన ఆహారం చౌక, ఆరోగ్యవంతం, పుష్టి కరం ఐన మన తూర్పుబెంగాల్ వారి తిండి వంగదేశాహారమే. చేతనైనం తదాకా ఆ ఆహారవిధానాన్ని అనుసరించండి. పాశ్చాత్యాహారాన్ని అనుకరిం చటానికై ఆ దేశంమీద దృష్టి నిలిపేకొద్దీ, మీకు అపకారమే కలుగుతుంది, మీరు అనాగరికు లవుతారు మీరు కలకత్తావారు, నాగరికులుగదా. మీరు స్వంతంగా అల్లిన వినాశకరమైన వలలో - బజారు మధురభక్ష్యాల వలలో - చిక్కటంతో, బాంకురా జిల్లావారు తమ బొరుగులు దామోదర్ నదిపాలు చేశారు; అక్కడి మినపప్పు రొచ్చుకాలువలో పోస్తారు, ఢాకా, విక్రమ పురాలవారు తమ పూర్వపు కూరలను కుక్కలకు వేసినారు - అంటే, వారందరూ 'నాగరికు'లైనారు! మీరు వినాశదశనొందారు, యితరులనూ

ఆ తోవనే లాగుతున్నారు - కలకత్తా నగరవాసులైన మీరు! ఇలాగైనా 'నాగరికు'లయ్యామని గర్విస్తున్నారు! మన మాండలిక ప్రజలు కలకత్తా లోని పెంటకుప్పలను తిని, అజీర్ణవ్యాధి వల్లా, గ్రహణివల్లా పీడించ బడుతూ, తమకు ఆ జీవనం అనుకూలం కాదని ఒప్పుకోరు; పైగా కల కత్తా వాతావరణం తేమవుండి ఉప్పుతో చేరివుందని తమ వాదాన్ని సమర్థించుకొంటారు! వారు ప్రతి విషయంలోను ఎలాగైనా 'నగరవాసులు' కావాలి!

ఇప్పటిదాకా ఆహారం, యితరాచారాల గుణగణాలను సంగ్రహంగా వివరించాను. పాశ్చాత్యుల సామాన్యాహారమేదో, అది క్రమక్రమంగా ఎలా మారిందో యిప్పుడు కొంత చెబుతాను.

అన్ని దేశాల్లోను పేదల ఆహారం ఏదో ఒక రీతి ధాన్యాహారం. ఆకులు, కూరగాయలు, శాకాలు, చేపలు, మాంసం భాగ్యాహార వర్గంలో చేరి, నంజుకోవటానికి ఉపయోగపడతాయి ఆయా దేశాల్లో సమృద్ధిగా పండి, అక్కడి పంటల్లో ప్రధానమైంది, పేదల సామాన్యాహారంగా వుంటుంది - ఉదా: వంగదేశంలోను, ఒరిస్సాలోను, మదరాసులోను, మళయాళ తీరంలోను ముఖ్యాహారం వరి అన్నం, పప్పు, శాకాలు ఒక్కొక్కప్పుడు చేపలు, మాంసం నంజుకోవటానికి మాత్రం పచ్చడిగా వాడుతారు. హిందూదేశంలో తక్కిన ప్రాంతాల్లో జరుగుబాటు వున్న వారు గోధుమ రొట్టెలు, వరి అన్నం తింటారు. జనసామాన్యం సజ్జలు, రాగులు, జొన్నలు, మొక్కజొన్నలతోను, యితర ధాన్యాలతోను చెపాతీలు చేసుకొని తింటారు.

హిందూదేశం అంతటా దుంపకూరలు, కాయగూరలు, పప్పు, చేపలు, మాంసం: వీటిని రుచిపుట్టించే పదార్థాలుగా వండి రొట్టెతోనో, అన్నంతోనో తింటారు అందుచేత వీటిని సంస్కృతంలో ''వ్యంజనాలు'' (రుచికరమైన పదార్థాలు) అంటారు పంజాబ్, రాజపుటానా, డక్కను లలో ధనికులు, ప్రభువులు, అనేక రీతుల్లో మాంసాన్ని ప్రతిరోజూ

తింటారు. కాని, వారి ముఖ్యాహారంకూడా రొట్టె, వరి అన్నమే. రోజుకు ఒక పౌండు తూకమున్న మాంసాన్ని తినేవాడు, దాంతో తప్పక రెండు పౌండ్ల చపాతీలు తింటాడు

ఇలాగే పాశ్చాత్య ఖండాల్లో పేద దేశాల ప్రజల - ముఖ్యంగా ధనిక ప్రాంతాల్లోని పేదల ముఖ్యాహారం బ్రెడ్ (పొంగుడు రొట్టె), బంగాళా దుంపలు. వారు మాంసాన్ని అరుదుగాని తినరు. తిన్నప్పుడు దాన్ని 'వ్యంజనం'గా గణిస్తారు. స్పెయిన్, పోర్చుగల్, ఇటలీ దేశాల్లోను, తక్కిన ఉష్ణదేశాల్లోను ద్రాక్ష విస్తారంగా పండుతుంది; దాంతో చేసే సారాయి అతి చౌక ఈ సారాయిలు మత్తుకలిగించేవి కావు (అంటే మితిమీరి తాగితే తప్ప); అమిత పుష్టికరాలుకూడా. ఆ దేశాల్లోని పేదలు చేపలు, మాంసానికి బదులు ద్రాక్షరసాన్ని ఆహారంగా వాడుకొంటారు. కాని యూరపు ఖండ ఉత్తర ప్రాంతాల్లో - రష్యా, స్వీడన్, నార్వే మొదలైన దేశాల్లో - రై (ధాన్యం పేరు) రొట్టె, బంగాళాదుంపలు, కొంచెం ఎండుచేపలు పేద జనం ఆహారం.

యూరపులో ఐశ్వర్యవంతుల వర్గం, అమెరికాలో అన్ని వర్గాల ఆహారం దీనికి కేవలం విరుద్ధం, అంటే వారికి చేపలు, మాంసం ప్రధానాహారం, పొంగుడు రొట్టె, వరి అన్నం, యితర పదార్థాలు వ్యంజనంగా మాత్రమే తీసుకోబడతాయి. అమెరికాలో పొంగుడు రొట్టె వాడకం చాలతక్కువ చేపలు వడ్డించబడేటప్పుడు అవి మాత్రమే వడ్డించబడతాయి మాంసం వడ్డించినప్పుడు అది మాత్రమే వడ్డించబడుతుంది. రొట్టె, అన్నం లేకుండానే అవి పుచ్చుకోబడతాయి కాబట్టి భోజన పాత్రల్ని తరచుగా మారుస్తుండాలి; పది రకాల పదార్థాలుంటే, పాత్రను పదిసార్లు మార్చాలి మనం యీ విధంగా భోజనం చేస్తే, మన వడ్డన యిలా జరగాలి: చేదుకూర (వంగదేశంలో యిది ముందు వడ్డించబడుతుంది దీన్ని 'సుక్తం' అంటారు) ముందు వడ్డించబడితే, ఆ పాత్ర తీసి మరోదాన్లో పప్పు వడ్డించబడుతుంది, అలాగే పులుసు మరో పాత్రతో

పప్పును తీసి వడ్డిస్తారు, ఆ తరువాత వట్టి అన్నమో లేక లూచీలో వస్తాయి. ఇలాటి వడ్డనలోని గుణం ఒక్కొక్క పదార్థంలో కొంచెం కొంచెమే తీసుకోబడటం. దేన్నీ ఎక్కువగా తినటం జరగదు. ఫ్రెంచ్‌వారు ప్రొద్దున కాఫీని, ఒకటి రెండు రొట్టె చెక్కలను కాస్త వెన్నతో తీసుకొంటారు. మధ్యాహ్నం చేపలు, మాంసం మొదలైన వాటిని ఎక్కువ కాకుండా తింటారు. ముఖ్య భోజనం రాత్రిపూట తీసుకొంటారు. ఇటలీ, స్పెయిన్ దేశస్థుల భోజన విధానం ఫ్రెంచ్‌వారి వంటిదే. జర్మనీవారు సమృద్ధిగా తింటారు. ప్రతి భోజనంలోను మాంసం కొంచెంగానో, ఎక్కువగానో చేరాలి. ఇంగ్లీషువారు మూడుసార్లు భోజనం చేస్తారు. అందులో మొదటి భోజనం స్వల్పపరిమితి గలది, కాని టీ, కాఫీలు మధ్యమధ్య సేవిస్తారు. అమెరికన్లుకూడా మూడుసార్లే భోజనం చేస్తారు. కాని, వారి ఆహారం ప్రతిసారీ అధిక ప్రమాణంలోనే వుంటుంది, అందులో మాంసం సమృద్ధిగా చేరివుంటుంది. ఈ దేశాలన్నింట్లో ప్రధాన భోజనం మధ్యాహ్న సమయంలోనో, సాయంకాలమో తీసుకొనే 'డిన్నర్' అనేది. ధనికులు ఫ్రాన్స్ దేశ వంటవారిని వుంచుకొని ఫ్రెంచ్ పద్ధతిలోనే వండించుకొంటారు; ప్రారంభంలో కొంచెం ఉప్పులో ఊరిన చాపనో, చేపగుడ్లో లేక ఏదో ఒకరకమైన 'వ్యంజనమో', శాకమో - ఆకలి పుట్టించటానికి తీసుకొంటారు. ఆ తరువాత వారి ఆహార పదార్థాలివి: చారు, తరువాత ఆ కాలపు ఆచార ప్రకారం పండ్లు; పిమ్మట చేపలు, మాంసాహారం; దాని తరువాత వేపుడు మాంసఖండం, దానితోపాటు కొన్ని శాకాలు; పిదప వేటలో చంపిన జంతువులు, పక్షులు లేక దుప్పిమాంసం మొదలైనవి; తరువాత మధురభక్ష్యాలు. క్రమంలో చివర ''ఐస్‌క్రీమ్'' (చక్కెరతో గడ్డకట్టించిన పాలు). ధనికుల భోజనంలో పదార్థ పాత్ర మారినప్పుడల్లా ద్రాక్షపానీయంకూడా మారుతుంది. హాక్ (జర్మనీలో తయారించే తెల్లసారాయి), క్లారెట్ (ఎర్రని ఫ్రెంచ్ సారాయి), మంచు గడ్డతో చల్లబరచిన షాంపేన్ (తెల్లని, మిసమిసలాడే తూర్పు ఫ్రాన్స్ ప్రాంత

సారాయి). దీన్లో ఏదో ఒకటి పదార్థం మారినప్పుడల్లా మార్చిమార్చి వడ్డించబడుతుంది. స్పూన్, కత్తి, ఫోర్క్ (పదార్థాలను గుచ్చి ఎత్తే చిన్ని ముళ్లగరిటె) భోజనపాత్ర మారినప్పుడల్లా మారుతుంటాయి. 'డిన్నర్' అయ్యాక పాలు కలవని కాఫీ, అతి చిన్ని గ్లాసుల్లో సారాయిలు (చక్కెర, వాసన ద్రవ్యాలు కలిపిన అతిఘాటైన మత్తుపానీయాలు) వస్తాయి. చిట్ట చివరికి పొగచుట్టలు వస్తాయి. భోజన పాత్రలు మారటంతో మారే సారాయిలూ ఎన్నెన్ని రకాలుంటాయో, ఎంతెంత వుంటుందో అంత దనవంతుడుగా, అంత ఐశ్వర్యవంతుడుగా, అంత ఫ్యాషన్ గల వ్యక్తిగా ఆ విందు యిచ్చే వ్యక్తి పరిగణింపబడతాడు. మన దేశంలో సామాన్య ధని కుడుగా ఎన్నబడేవాడు దరిద్రుడయేంత ధనం ఆ ఒక్క 'డిన్నర్' యివ్వ టానికి అక్కడ ఖర్చుచేయబడుతుంది!

నేలమీద వాల్చిన ఒక కొయ్యపీటమీద పద్మాసనం వేసుకొని కూర్చుని, అలాటి మరో పీటకు వీపును ఆనించి, కొంచెం ఎత్తైన పీట మీద ఒక పళ్లెంలో ఆర్యుడు భోజనం చేసేవాడు ఇప్పటికీ ఆ ఆచారమే పంజాబ్, రాజపుటానా, మహారాష్ట్ర, గుజరాత్‌లలో కొనసాగుతోంది. బెంగాల్, ఒరిస్సా, త్రిలింగ, మళయాల దేశాల్లో భోజనపాత్రలు పీటల మీద వుంచరు, నేలమీద పెట్టినపళ్లాల్లోనో, అరటి ఆకులోనో వారు భోజనం చేస్తారు. మైసూర్ మహారాజుకూడా అలాగే చేస్తాడు; మహమ్మ దీయులొక పెద్ద తెల్లగుడ్డను పరచి దానిమీద కూర్చుని భోజనం చేస్తారు. బర్మా దేశస్థులు, జపాన్‌వారు భోజనపు పళ్లాలను నేలమీద వుంచి మోకాళ్లను, పాదాలను మాత్రమే ఆధారం చేసుకొని కూర్చుంటారు. హిందూదేశస్థుల మాదిరి వారు పిరుదుల ఆధారంగా చదునుగా కూర్చోరు. చైనా దేశస్థులు కుర్చీలమీద కూర్చుని, భోజన పాత్రలను ఒక బల్లమీద వుంచుకొని, గరిటెలతోను, వాడియైన కొయ్యపుల్లలతోను (పదా ర్థాలను ఖండించే పుల్లలు) భోజనం చేస్తారు. పూర్వం రోము, గ్రీకు దేశ స్థులు తమ ముందొక బల్లనుంచుకొని, ఒక శయ్యను ఆనుకొని, వ్రేళ్లతో

ఆహారాన్ని తీసుకొనేవారు. యూరోపియన్లుకూడా కుర్చీలలో కూర్చుని బల్లమీద వుంచబడ్డ ఆహారాన్ని వ్రేళ్లతోనే తింటారు; ఇప్పుడు వారు గరిటెలను, ముళ్లగరిటెలను వాడుతున్నారు. చైనావారి భోజనవిధానాన్ని అభ్యసించటానికి కొంతనేర్పు అవసరం. మన తములపాకు లమ్మేవారు హస్తలాఘవంచేత రెండు వేర్వేరు యినుపరేకులను తములపాకులు కత్తి రించే కత్తెరమాదిరి పనిచేసేటట్లు ఎలా చేస్తారో, అలాగే చైనా దేశస్థుడు కూడా రెండు కొయ్య పుల్లలను తన రెండు వ్రేళ్లకు, కుడి అరచేతికి మధ్య వుంచుకొని ఆడిస్తూ శాకాహారాన్ని తన నోటి దగ్గరకు పటకారులా కొని పోయేటట్లు చేస్తాడు. అంతేకాక, నోటివద్ద ఒక అన్నంముద్ద నుంచుకొని రెండు పుల్లలను ఒకటిగా చేర్చి వాటినొక చిన్న పారమాదిరి చేసి వాటితో ఆ అన్నాన్ని లోపలికి నెడతాడు.

ప్రతి జాతివారు ఆ రోజుల్లో లభించినదాన్నంతా తినేవారట! పెద్ద జంతువును చంపినప్పుడు దాన్ని ఒక నెలరోజులు వచ్చేటట్లు వాడుకొనే వారట. కుళ్లిపోయాకకూడా దాన్ని పారవేసేవారు కారట. కాలక్రమంలో వారు నాగరికులై భూమిని దున్ని వ్యవసాయం నేర్చుకొన్నారు. పూర్వం వేటతో వారికి ఆహారం ప్రతిరోజు లభించేది కాదట. అందుచేత వారు అడవి మృగాల మాదిరి ఒకనాడు గొంతుదాకా తిని, ఆ తరువాత నాలు గైదు రోజులు పస్తులుండేవారట. ఇప్పుడు వ్యవసాయం వల్ల ప్రతిరోజూ ఆహారం లభించటంతో వా రా దురవస్థను తప్పించుకొన్నారు, కాని ఆహారంతోపాటు పూర్వకాలం మాదిరి కుళ్లిన మాంసమో, మరేవో యితర కుళ్లిన పదార్థాలో తినటం వారికి సుస్థిరాభ్యాస మయింది. ప్రథమంలో కుళ్లిన మాంసం అనివార్యాహారంగా వుండేది ఇప్పుడు అదో, దానికి బదులు మరో పదార్థమో వ్యంజనంలా రుచికరమైన ప్రియవస్తు వయింది. ఎస్కిమో జాతివారు సదా మంచుమయప్రాంతాల్లో నివసిస్తారు. అక్కడ ధాన్యమేదీ పండదు; వారి దైనికాహారం చేపలు, మాంసం. ఎప్పుడైనా వారికి ఆకలి మందగిస్తే, జఠరాగ్ని మళ్లా

ప్రజ్వలించటం కోసం వారొక ముక్క కుళ్లిన మాంసం తింటారు. నేడూ యూరోపియన్లు తాము వేటాడి తెచ్చిన వన్యపక్షులను, జంతువులను, దుప్పిజాతులను వెంటనే వండుకోక, కొంచెం దుర్వాసన కొట్ట నారంభించేదాకా వేలాడగట్టి వుంచుతారు. కలకత్తాలో కుళ్లిన దుప్పి మాంసం బజారుకు రాగానే తక్షణమే అమ్ముడుపోతుంది. కొన్ని రకాల చేపలను కొంచెం కుళ్లిన పిదపే తినటానికి జనం యిష్టపడతారు. యూరప్‌లో కొన్ని ప్రాంతాల్లో కొంచెం వాసనకొట్టే జున్నును ఎంతో రుచికరంగా భావిస్తారు. శాకాహారులుకూడా కొంచెం నీరుల్లి, వెల్లుల్లులను తినటానికి యిష్టపడతారు, దాక్షిణాత్య బ్రాహ్మణుడికి అవి వంటలో వుండితీరాలి కాని హిందూశాస్త్రాలు వాటినికూడా నిషేధించాయి; ఒక కులానికి (బ్రాహ్మణులకు) వెల్లుల్లి, నీరుల్లి, పెంపుడు కోళ్లను, పెంపుడు పందులను తినటం పాపం. వాటిని తినేవారు కులభ్రష్టు లవుతారు. కాబట్టి సదాచారనిష్ఠులైన హిందువులు నీరుల్లి, వెల్లుల్లులను విసర్జించి, వాటికి బదులు ఆ రెండిటికంటె గాఢమైన దుర్వాసనగల ఇంగువను వాడుకోసాగారు! హిమాలయ ప్రాంత బ్రాహ్మణులు వెల్లుల్లి వంటి వాసనేవున్న ఒక రకమైన ఎండుగడ్డిని వాడుకోసాగారు! అందులో ఏం దోషం వుంది? శాస్త్రాలు వాటిని గురించి ఏమీ చెప్పలేదుగదా!

కొన్ని ఆహార పదార్థాలను అనుమతించి, కొన్నిటిని నిషేధించటం అన్ని మతాల్లోను వుంది. క్రైస్తవమతంలో మాత్రం అలాటివి లేవు. జైనులు, బౌద్ధులు చేపలను, మాంసాన్ని తిననే తినరు జైనులిదిగాక, బంగాళాదుంపలు, ముల్లంగి మొదలైన దుంపలను - భూమికింద పెరిగే వాటిని - కూడా తినరు. వాటికై తవ్వేటప్పుడు పురుగులేమైనా చస్తాయేమోనని వారి భయం. రాత్రి సమయంలోకూడా వారు భోజనం చెయ్యరు. చీకటిలో కీటకమేదైనా తమ నోట్లోకి పోతుందేమోనని వారు భయపడతారు. పొలుసులులేని చేపలను, పంది మాంసాన్ని, చీలని డెక్కలున్న నెమరు వెయ్యని జంతువులను యూదులు తినరు. అంతేగాక

చేపలుగాని, మాంసంగాని పచనం చేస్తూన్నప్పుడు, ఆ వంటగదిలోకి పాలు, పాలపదార్థమేదైనా తీసుకొని రాబడితే అక్కడ వండిన అన్ని పదార్థాలను పారేస్తారు. ఈ కారణంగా ఆచారనిష్ఠులైన యూదులు యితర జాతులు వండిన ఆహారాన్ని తినరు భగవంతుడికి నివేదింపబడని జంతు మాంసాన్నికూడా యూదులు - హిందువుల మాదిరి తినరు. వంగ దేశంలోను, పంజాబ్‌లోను దేవికి నివేదించబడిన మాంసానికి 'మహాప్రసాద'మనే నామాంతరం వుంది. మహాప్రసాదమై వుంటేగాని, అంటే భగవన్నివేదితమైతేగాని యూదులు మాంసం తినరు కాబట్టి వారూ హిందువుల మాదిరి, అన్ని దుకాణాలలోను మాంసాన్ని కొనకూడదు యూదులలా మహమ్మదీయులూ అనేక నియమాలను పాటిస్తారు. కాని యూదులలా వారు 'అతి'కి పోరు, వారూ మాంసంతోగాని, చేపలతోగాని పాలు పుచ్చుకోరు. కాని వంటగదిలో అవి ఒకేసారి వున్నా, ఒకదాని నొకటి తాకినా అంతగా ఆక్షేపించరు హిందువులకు, యూదులకు భోజన విషయంలో చాలపోలికలున్నాయి. కాని హిందువుల్లా యూదులు అడవి పందులను తినరు. పంజాబ్‌లో హిందూ మహమ్మదీయ కలహాలు అతి తీవ్రంగా చెలరేగుతుండటం వల్ల, మహమ్మదీయులకు నిషేధంగా వుండే పనులన్నింటిని హిందువులు చేస్తారు. కాబట్టి అక్కడి హిందువులకు అడవిపంది ముఖ్యాహారాల్లో ఒకటైంది. రాజపుత్రులకు అడవి పందిని వేటాడి తెచ్చి, దాని మాంసాన్ని తినటం దాదాపు ఒక 'ధర్మం'గా మారింది. దక్షిణదేశ బ్రాహ్మణుల్లో తప్ప అన్ని జాతుల్లోను పెంపుడు పంది మాంసాన్ని తినటంకూడా ఎంతో వ్యాప్తిలో వుంది హిందువులు అడవికోడిని (పుంజునైనా, పెట్టనైనా) తింటారుగాని, పెంపుడుకోడిని తినరు

వంగదేశం మొదలు నేపాళం వరకు, హిమాలయాల్లో కాశ్మీరం వరకు నివసించే హిందూదేశస్థు లందరూ భోజన విషయంలో ఒకేవిధమైన ఆచారాలను అవలంబిస్తారు. ఈ ప్రాంతాల్లో నేటి దాకా మనువు

విధించిన ఆచారాలే చాలవరకు పాటింపబడుతున్నాయి కాని ఆ పాటించబడటం బెంగాల్, బీహార్, అలహాబాద్, నేపాళాలలోకంటె, కుమాన్ మొదలు కాశ్మీరం వరకు వున్న ప్రాంతాల్లో అధికం. ఉదా: బెంగా లీలు కోడిని, కోడిగుడ్లను తినరు. కాని బాతుగుడ్లు తింటారు; నేపాళీ యులుకూడా అలాగే చేస్తారు. కాని కుమాన్ మొదలు ఆపై ప్రాంతాల్లో అదికూడా నిషేధమే. కాశ్మీర దేశస్థులు అడవిబాతు గుడ్లను ప్రీతితో తింటారు. కాని పెంపుడు బాతుగుడ్లను తినరు. అలహాబాద్ వద్దనుండి - హిమాలయాల్లో తప్ప - మేకమాంసాన్ని తినే హిందూదేశస్థ లందరూ కోడిని కూడా తింటారు.

ఈ ఆహార విషయిక విధి నిషేధాలన్నీ చాలవరకు ఆరోగ్య సంరక్షణార్థం ఏర్పడ్డాయనటంలో సందేహం లేదు; ప్రతి సందర్భం లోను, ఏ ఆహారపదార్థం ఆరోగ్యానుకూలం, ఏది ప్రతికూలం అని నిర్దుష్టంగా నిర్ణయించటం కష్టం. నిజమే. అంతేగాక పందులు, కోళ్లు దేన్నైనా తినే అపరిశుద్ధ జంతువులు వాటిని గురించిన నిషేధాని కిదే కారణం అడవికోళ్లు అడవిలో ఏంతింటాయో ఎవరు చూశారు. అంతేగాక అవి పెంపుడు కోళ్లకంటె ఆరోగ్యవంతాలై వుంటాయి పెంపుడు కోళ్ల మాదిరి జబ్బుపడవు పాలు - ముఖ్యంగా ఆమ్లపిత్తవ్యాధి వున్నవారికి - సులువుగా జీర్ణంకాదు. వాటిని త్వరగా మింగేసినంత మాత్రాన్నే ప్రాణాపాయం కలిగిన సందర్భాలూ వున్నాయి. పసిబిడ్డ తల్లి స్తన్యాన్ని గ్రోలినట్లు, కొంచెంకొంచెంగా పీల్చటమో, తాగటమో చెయ్యాలి. అప్పు డవి సులువుగా జీర్ణమవుతాయి; లేకుంటే జీర్ణంకావు. పాలు అసలే అజీర్ణ పదార్థం కాబట్టి, మాంసంతోకూడా తీసుకోబడ్డప్పుడు దాన్ని జీర్ణించు కోవటం కష్టంగా వుంటుంది. కాబట్టే ఒకే భోజనంలో మాంసం, పాలు తీసుకోకూడదనే యూదులకు నిషేధం

వివేకహీనురాలైన తల్లి బిడ్డను బలాత్కరించి ఎక్కువగా పాలు తాగేట్లు చేస్తుంది. తరువాత కొన్ని నెలల్లో తన ప్రేమాధారమైన బిడ్డ

ప్రాణాపాయ స్థితికి వచ్చినప్పుడు ఆ తల్లి నిరాశాగ్రస్తురాలై గుండెలు బాదు కొంటుంది! ఆధునిక వైద్యనిపుణులు పెద్దవారికి కూడా ఒక పైంట్ (20 ఔన్సులు) పాలనే నిర్ణయిస్తారు. అవీ అతినెమ్మది నెమ్మదిగా తాగమం టారు; పసిబిడ్డలకు పాలబుడ్డితో తాగించటం మంచిది. మన యిళ్లలోని తల్లులు గృహకృత్యమగ్నలై వుండటంచేత, ఏడుస్తూన్న బిడ్డను పరిచారిక తన వొళ్లో వుంచుకొని, అనేకసార్లుమోకాటితో అదిమిపట్టి, తనకు సాధ్యమైనన్ని గరిటెల పాలను ఆ బిడ్డ మింగేటట్లు చేస్తుంది! ఫలితంగా బిడ్డ యకృద్వ్యాధిగ్రస్తయై, యీడుకు తగినట్లు ఎదగదు. ఆ పాలే దానికి మరణశిక్షగా మారుతుంది. అపాయకర రీతిలో పాలు తాగించినా, దాన్ని భరించి బతికేటంత ప్రాణశక్తివున్న బిడ్డలుమాత్రం పుష్టిగా, ఆరోగ్య వంతులుగా పెరిగి పెద్దవారవుతారు ఇక మన ప్రాచీన వైఖరి పురిటి గదులను, పురిటిబిడ్డకు చేసే కాపడాలను, అలాటి యితర చికిత్సల గురించి ఆలోచిస్తే, ఈశ్వర కృపావిశేషమేదో లభించటం చేతనే తల్లి బిడ్డలు ఆ తీవ్రపరీక్షలకు నిలబడి బలాన్ని, ఆరోగ్యాన్ని ఆర్జించుకోగలిగి వుంటారని మనం ఆశ్చర్యపోతాం.

## దుస్తుల విషయంలో నాగరికత

ప్రతి దేశంలోను మానవుడి గౌరవార్హత అతడు ధరించే దుస్తులను బట్టి కొంతవరకు నిర్ణయించబడుతుంది వంగదేశంలోని గ్రామీణులు తమ గ్రామ్య భాషలో చెప్పినట్లు ''ఒకడు మర్యాదస్తుడైనదీ, నీచజన్ము డైనదీ కనుక్కోవటం ఎలా- అతడి రాబడి తెలిసివుంటే తప్ప?'' రాబడి మాత్రం తెలిస్తే చాలదు, ''అతడెలాంటి దుస్తులు ధరిస్తాడో చూస్తేగాని, అతడు మర్యాదస్థుడని ఎలా తెలుస్తుంది?'' సామాన్యంగా లోకమంతటా యిదే స్థితి. వంగదేశంలో మర్యాదస్థు డెవడూ మొలకు మాత్రం గుడ్డ కట్టుకొని వీథుల్లో నడవబోడు, హిందూదేశ తక్కిన ప్రాంతాల్లో తలగుడ్డ

లేనిదే ఎవడూ వీథుల్లో నడవడు. పాశ్చాత్యదేశంలో ఫ్రెంచ్‌వారు ప్రతి విషయంలోను మార్గదర్శకులై వున్నారు - వారి భోజనాన్ని, వారి దుస్తులను యితరులు అనుకరిస్తారు. ఇప్పుడుకూడా యూరప్‌లోని విభిన్న ప్రాంతాల్లో వేర్వేరు వస్త్రధారణ విధానాలు, దుస్తులు ప్రత్యేకించి వున్నా, ఎవడైనా ధనార్జన మత్యధికంగా చేసి 'జెంటిల్‌మన్' (పెద్దమనిషి) అనిపించుకొంటే, అతడు వెంటనే తన పూర్వపు స్వదేశ వేష వైఖరిని విసర్జించి, ఫ్రెంచ్ వైఖరిని అవలంబిస్తాడు. హాలెండ్ దేశ రైతు స్వదేశవేషం కాబూలువారి పైజామాలను పోలివుంటుంది; గ్రీసు దేశస్థుడు నడుము క్రింద వేలాడే చొక్కాలను ధరిస్తాడు, రష్యా దేశస్థుని వేషం టిబెట్ వారి వేషాన్ని కొంత పోలుతుంది; - కాని వీరెవరైనా ఉన్నత స్థానానికి వచ్చి మర్యాదస్థులైతే, వారు ఫ్రెంచ్ 'కోటు'లను, షరాయీలను ధరిస్తారు స్త్రీల విషయం చెప్పనే అక్కర్లేదు, - వారు సంపన్నులవగానే, వారి దుస్తులెలాగైనా 'ప-రీ'లోనే కుట్టించుకోవాలి. అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్, జర్మనీ యిప్పుడు పాశ్చాత్యఖండాల్లోని ధనిక దేశాలు ఈ దేశాల్లో ప్రతి వ్యక్తి దుస్తులు ఫ్రెంచ్ 'ఫ్యాషన్'లోనే వుంటాయి. ఆ 'ఫ్యాషన్' నెమ్మదినెమ్మదిగా - కాని నిస్సంశయంగా - యూరప్‌లో ప్రతి ప్రాంతానికి వ్యాపిస్తోంది యూరప్ అంతా ఫ్రాన్స్ 'ప్రతి' (అనుకరణ) గా వుంది. ఐనా యిటీవల పురుషుల దుస్తులు 'ప-రీ'లో కంటె లండన్‌లో బాగా కుట్టబడుతున్నాయట! అందుచేత పురుషులు లండన్‌లో, స్త్రీలు 'ప-రీ' వైఖరిలోను తమ దుస్తులను కుట్టించుకొంటున్నారు. సుసంపన్నులైన వారు తమ దుస్తులను ఆ నగరాలనుండే తెప్పించుకొంటారు. విదేశాల నుండి దిగుమతయ్యే దుస్తులపై అమెరికా అత్యధికమైన సుంకాలను విధిస్తోంది, ఐనా, ఆ దేశస్థులు తమ దుస్తులను 'ప-రీ' నుండి లండన్ నుండీ తెప్పించుకొంటున్నారు అమెరికన్లకు తప్ప మరెవ్వరికీ యిలా చేసే సామర్థ్యం లేదు అమెరికా యిప్పుడు ధనాధిపతి ఐన కుబేరుడి ముఖ్య నివాసస్థానమై అలరారుతోంది

ప్రాచీనార్యులు ధోవతి, 'ఛద్దర్'[1] ధరించేవారు క్షత్రియులు యుద్ధం చేసేటప్పుడు షరాయీాలు, పొడవైన కోట్లు, తక్కిన సమ యాల్లో ధోవతి, ఛద్దర్లు - యివికాక తలగుడ్డకూడా ధరించేవారు. హిందూదేశం అన్ని ప్రాంతాల వారిల్లోను - వంగదేశంలో తప్ప - అదే ఆచారం యిప్పటికీ వ్యాప్తిలో వుంది; శరీరంలోని తక్కిన భాగాల ఉడు పుల విషయం వారంతగా గమనించరుగాని తలకుమాత్రం ఒక పాగా వుండి తీరాలి. పూర్వకాలంలో యీ ఆచారాన్ని స్త్రీ పురుషు లిద్దరూ పాటించే వారు. బౌద్ధయుగంనాటి శిలావిగ్రహాల్లో స్త్రీ పురుషులొక కౌపీనాన్ని మాత్రం ధరించినట్లు చూపబడింది. బుద్ధుని తండ్రికూడా - రాజై వుండీ - యిలాంటి వేషంతోనే సింహాసనారూఢుడై కొన్ని విగ్రహాల్లో కాన వస్తున్నాడు, తల్లి కూడా అలాగే చిత్రించబడింది కాని ఆమె కాళ్లు చేతు లకు ఆభరణాలు ధరించి వుంటుంది. అందరికీ తలగుడ్డలు మాత్రం వున్నాయి! బౌద్ధ చక్రవర్తి ధర్మాశోకుడు, మృదంగాకృతిలోని ఆసనం మీద, ఒక ధోవతి కట్టుకొని 'ఛద్దర్' మెడపైని ధరించి కూర్చుని, నాట్యం చేస్తూన్న బాలికలను చూస్తున్నట్లు చూపబడ్డాడు, నాట్యమాడే బాలికలు అతిస్వల్పాచ్ఛాదితలై వున్నారు వారి కటి ప్రదేశంనుండి కురచనైన గుడ్డ ముక్కలువేలాడుతుంటాయి; కాని విశేషమేమంటే, తలగుడ్డలు మాత్రం వుంటాయి! అదే వేషంలో ముఖ్యభాగం. రాజాస్థానానికి వచ్చిన ఉన్నతో ద్యోగులుమాత్రం చక్కని షరాయీాలు, చోగా (అంగీ)లు ధరిస్తారు ఋతుపర్ణుని కొలువులో ప్రచ్ఛన్న వేషంతో సారథిగా వున్న నలుడు రథాన్ని అత్యంత వేగంతో తోలినందువల్ల, ఋతువర్ణుని 'ఛద్దర్' చాల దూరానికి ఎగిరిపోయి దొరకలేదు. అతడు స్వయంవరార్థం బయల్దేరి వుండటంచేత, 'ఛద్దర్' లేకుండానే అక్కడికి పోవలసి వచ్చిందేమో! ధోవతి ఛద్దర్లు ఆర్యులకు పురాతనాచార సిద్ధమైన ఉడుపులు. కాబట్టే మత

1. ఉత్తరీయంగా ధరించే సుమారు మూడు గజాల పొడవైన గుడ్డను 'ఛద్దర్' అంటారు

నిర్దిష్టకర్మ నేదైనా చేసేటప్పుడు ధోవతి ఛద్దర్లు ధరించటం హిందువుల కిప్పటికీ నియమం.

ప్రాచీన గ్రీకుల, రోమన్ల వేషంకూడా ధోవతి ఛద్దర్లే, - ఒక వెడల్పైన పెద్దగుడ్డ, చిన్నదైన మరో గుడ్డ. ఇది 'టోగా'గా కుట్టివుంటుంది. చోగా అనేమాట యీ 'టోగా'లో నుండే పుట్టింది. వారొకప్పుడు 'షర్టు'ను (లోపలి చొక్కా) కూడా ధరించేవారు. యుద్ధం చేసేటప్పుడు కోట్లు, షరాయీలుకూడా ధరించేవారు. స్త్రీల దుస్తులు పొడవైన, తగినంత వెడల్పాటి ఒకరీతి వస్త్రం - రెండు వస్త్రాలు నిడివికి కుట్టినట్లుండేది. దీన్ని వారు వదులుగా పైన వేసుకొని వక్షస్థలం క్రింద ఒకచోట, కటి ప్రదేశంలో ఒకచోట చుట్టూ కట్టేసుకొనేవారు. అప్పుడు అనాచ్ఛాదితాలైన పై భాగాలను బాహువులపై పెద్ద సూదులతో - ఉత్తర హిమాలయా ప్రాంతపు కొండవాళ్లిప్పటికీ చేసే విధంలో - బిగించి వేస్తారు. ఈ పొడవైన ఉడుపుమీద ఒక 'ఛద్దర్' వుంటుంది. ఈ వేషం నిరాడంబరమైనా, చూడ్డానికి యింపుగా వుంటుంది.

అతి ప్రాచీనకాలంనుండి ఇరాన్ దేశస్థులు కుట్టిన దుస్తులు వాడుకొనేవారు. చైనావారి వద్ద వారది నేర్చుకొని వుంటారు. వేష విషయాల్లోను, ఇతర సుఖకర, భోగ్య విషయాల్లోను, చైనావారు ప్రాచీన నాగరికతా గురువులు. అనాదికాలంనుండి చైనీయులు కుర్చీలమీద కూర్చుండి బల్లమీద ఎన్నో రకాల వ్యంజనాలతో భోజనం చేసేవారు. అనేక రకాలైన కుట్టిన బట్టలనుకూడా - కోటు, టోపీ, షరాయి మొదలైనవాటిని ధరించేవారు.

ఇరాన్‌ను జయించాక అలెగ్జాండర్ తన పురాతన గ్రీకు ధోవతిని, ఛద్దరును విసర్జించి షరాయీలు ధరించసాగాడు. ఇందుకు అతని గ్రీకు సైనికు లతనిమీద కోపించి తిరుగుబాటు చెయ్యబోయారు. కాని 'లొంగటం' అనే మాటనే ఎరుగని అలెగ్జాండర్, తన అధికార ప్రాబల్య శక్తిచే షరాయీలూ, కోట్లు, దుస్తుల్లో ఒక 'ఫ్యాషన్'గా వుండేట్లు ప్రవేశపెట్టాడు

ఉష్ణదేశాల్లో దుస్తుల ఆవశ్యకత అంతగా తోపదు. ఔచిత్య సంరక్షణ నిమిత్తం ఒక కౌపీనమాత్రం ధరిస్తే చాలు; తక్కిన ఉడుపులు అలంకారం కోసంగానే ధరిస్తారు. శీతలదేశాల్లో అనివార్యావశ్యకతవల్ల జనం - అనా గరికులై వున్నప్పుడు - జంతు చర్మాలను ధరించేవారు. క్రమక్రమంగా నాగరికులయ్యాక, ముందు కంబళ్ళు కప్పుకోవటాన్ని నేర్చుకొని, ఆ తరు వాత కుట్టిన దుస్తులను - షరాయిలు, కోట్లు మొదలైనవాటిని ధరిం చటం కాలక్రమంలో నేర్చుకొన్నారు. శీతలదేశాల్లో ఆభరణ సౌందర్యాన్ని ఆడంబరంగా కనపరచటం అసాధ్యమనటం స్పష్టం. ఆభరణాలు అనాచ్ఛా దిత దేహంమీదగదా ధరించాలి. అలా ధరించటం విపరీతమైన చలికి గురౌ టమే. కాని ఆభరణ వ్యామోహం అక్కడ దుస్తుల సౌందర్యంగా మార్పు బడి, సంతృప్తి నిస్తుంది. హిందూదేశంలో ఆభరణాల 'ఫ్యాషన్' అనేక సార్లు ఎలా మార్పులు చెందుతుందో, అలాగే పాశ్చాత్యదేశాల్లో దుస్తుల 'ఫ్యాషన్' ప్రతి క్షణం మారుతుంది.

కాబట్టి శీతలదేశాల్లో ఆపాదమస్తకాచ్ఛాదితులైతేకాని యితరుల ముందు కనిపించకూడదనే నియమం ఏర్పడింది. లండన్‌లో మర్యా దస్తులు - స్త్రీలు, పురుషులు - సమాజ నియమాలు నిర్దుష్టంగా పాటించి గాని బహిరంగంగా కనిపించరాదు పాశ్చాత్యదేశాల్లో స్త్రీలు - నలుగురిలో - తమ పాదాలను కనపరచటం అవినీతిని సూచించే కార్యం. కాని నాట్యంలో ముఖాన్ని, భుజాలను, శరీర పైభాగాన్ని, బయల్పరచటం చెడుకాదు. ఇక మన దేశంలో స్త్రీ తన ముఖాన్ని చూపటం సిగ్గుపడాల్సిన కార్యం (కాబట్టే ముఖంపై ముసుగు కప్పుకోవటం అంత ముఖ్యం). కాని పాదాలను కనపరచటం తప్పుకాదు. రాజపుటానాలోను, హిమాలయా ల్లోను, స్త్రీలు తమ కటి ప్రదేశాన్ని తప్ప శరీరాన్నంతటిని వస్త్రాచ్ఛాదితంగా వుంచుకొంటారు.

పాశ్చాత్య దేశంలో నటీజనం, వేశ్యాజనం, పురుషులను ఆకర్షించే నిమిత్తం అతిపలుచని దుస్తులను (దుకూలాలు) ధరిస్తారు. నృత్యమంటే

అనేకసార్లు సంగీతానికి అనురూపమైన చలనాలతో తమ అంగాలను బయల్పరచటమే కదా! మన దేశంలో గొప్ప యింటి స్త్రీలు పూర్ణాచ్ఛా దితలై వుండరు; కాని వేశ్యలు అలా వుంటారు. పాశ్చాత్య దేశంలో స్త్రీలు పగటిపూట పూర్ణాచ్ఛాదితలై వుంటారు; కాబట్టి స్వల్పాచ్ఛాదనంతో కనిపించేటప్పుడు వారి ఆకర్షణ అధికం. మన స్త్రీలు సామాన్యంగా ఎప్పుడూ యింట్లోనే వుంటారు. అందువల్ల వస్త్రధారణ అధికంగా చేసు కోరు, కాబట్టి పూర్ణ వస్త్రధారణమే మన కాకర్షకంగా వుంటుంది. కేరళలో స్త్రీ పురుషులు నడుముకు మాత్రం ఒక బట్ట చుట్టుకొని వుంటారు. వంగ దేశంలోకూడా యించుమించు అదే స్థితి, కాని పురుషుల ముందు స్త్రీలు ముఖాన్ని పూర్తిగా ముసుగుతో మరుగుపరచుకొని, శరీరాన్ని పూర్ణాచ్ఛా దిత మొనర్చుకొంటారు.

చైనాలో తప్ప అన్ని దేశాల్లోను యుక్తతను గురించి అనేక వికృత, నిగూఢ భావాలు నాకు కనిపించాయి. కొన్ని విషయాల్లో అవి మితిమీరి ఆచరించబడతాయి; మరికొన్ని విషయాల్లో అది ఎంతో పొరపాటుగా తోస్తుంది - అలాటి భావమే లేకుంటుంది.

చైనా వారు - స్త్రీలు పురుషులు - ఆపాదమస్తకం ఎల్లప్పుడు పూర్ణా చ్ఛాదితులై వుంటారు. ఆ దేశస్థులు కన్‌ఫ్యూషియస్, బుద్ధుని అను చరులు కాబట్టి వారి నీతి, నిష్ఠురం, పరిశుద్ధం. బూతు మాటలు, బూతు పుస్తకాలు, బూతు చిత్రాలు, ఏమాత్రమైనా అసభ్యంగా వుండే ప్రవర్తనం వీటికి బాధ్యుడయ్యే అపరాధి తక్షణమే శిక్షించబడతాడు. క్రైస్తవమత ప్రచారకులు బైబిల్‌ను చీనా భాషలోకి అనువదించారు. హిందూ పురాణాలకు సిగ్గుపుట్టించే అసభ్యఘట్టాలు కొన్ని బైబిలో వున్నాయి ఈ అసభ్య భాగాలను చూసి చీనావారు క్రీస్తుమతం మీద ఎంతో రోషం పూని, బైబిల్‌కు తమ దేశంలో ఎన్నటికీ వ్యాప్తి కలిగించరాదని నిర్ణయించుకొన్నారు. ఇదికాక క్రైస్తవమత ప్రచారిణులు - సాయంకాలపు దుస్తులను ధరించి, పురుషులతో ధారాళంగా కలిసిపోతూ

- చీనావారిని ఆహ్వానించారు. అమాయకులైన చీనావారు ఎంతో అసహ్యంతో యిలా ఘోషించారు: ''ఎంత ఘోరం! మన బాలురతో బైబిల్ చదివించి వారిని పాడుచెయ్యటానికి, యీ జిత్తులమారి, అర్ధాచ్ఛాదిత, స్త్రీల మాయలకు లోబడి చెడిపోవటానికి యీ మతం మన దేశంలోకి వచ్చింది!'' ఇందువల్లే చీనావారికి క్రైస్తవులంటేే అంత కోపం. సామాన్యంగా చీనావారు యితర మతాలపట్ల ఎంతో సహనాన్ని వహిస్తారు. క్రైస్తవమత ప్రచారకు లిప్పుడు ఆక్షేపణీయ భాగాలను వదిలేసి బైబిల్‌ను పునర్ముద్రణ గావించారని విన్నాను; కాని యీ చర్యతో చీనావారి సంశయాలు మునుపటికంటె ఎక్కువయ్యాయట!

అంతేగాక, పాశ్చాత్య ఖండంలో సభ్యతా మర్యాదలను గురించిన భావాలు దేశదేశానికి మారతాయి. ఇంగ్లీషువారు, అమెరికన్లు ఒక రీతి భావాలను, ఫ్రెంచ్‌వారు యింకోరీతి వాటిని, జర్మన్‌లు మరో రీతి వాటిని అవలంబిస్తారు. రష్యన్లకు, థిబెట్ వారికి అనేక విషయాల్లో సమాన భావాలున్నాయి. టర్కీ వారికి వీటిలో దేనితోనూ సంబంధంలేని ప్రత్యేకరీతి భావాలున్నాయి. ఇలాగే యితర దేశీయులకూ

## ఆచారాలు - ఉచిత ప్రవర్తనాలు

యూరపులోను, అమెరికాలోను గుప్తతను మనకంటె ఎంతో ఎక్కువగా పాటిస్తారు. మనం శాకాహారులం కాబట్టి శాకాలు మొదలైనవాటిని ఎక్కువగా తిని, ఒక్కోసారి ఒకటి రెండు చెంబుల నీళ్లు తాగుతాం. ఉత్తర హిందూస్థాన ప్రాంతాల్లోని రైతు ఒక సేరు యవధాన్యపు పిండిని తిని, అందువల్ల ఎంతో దప్పిగొని, బావినుండి నీళ్లను అనేకసార్లు తోడి తాగుతాడు. వేసవిలో మన ఇళ్లలో కొన్ని భాగాలు 'ఖాళీ'గా వుంచి వెదురు గొట్టం నుండి దప్పిగొన్నవారికి నీళ్లు పోస్తాం ఈ మార్గాలు ఆచరించటం వల్ల జనానికి గుప్తత విషయం అంత ముఖ్యంగా వుండదు; అది వారికి సాధ్యంకాదు. ఆవుల కొట్టాలను, గుర్రపులాయాలను, సింహశార్దూల

పంజరాలతో పోల్చి చూడండి కుక్కను మేకతో పోల్చిచూడండి. పాశ్చాత్యుల ఆహారంలో మాంసం ముఖ్యం. శీతలదేశాల్లో నీళ్లను ఎప్పుడోగాని తాగరు. గొప్పవారు చిన్న కాచపాత్రల్లో కొంచెం సారాయిని తాగుతారు. ఫ్రెంచ్‌వారికి నీళ్లంటే రోత, అమెరికన్లు మాత్రం - వారి దేశం వేసవిలో ఎంతో వేడిగా వుంటుంది కాబట్టి - మాటిమాటికి ఎక్కువ నీళ్లు తాగుతారు. న్యూయార్క్ కలకత్తాకంటె వేడిగా వుంటుంది. జర్మన్లు బీరు అనే సారాయిని ఎక్కువగా పుచ్చుకొంటారు. కాని, భోజన సమయంలో కాదు.

శీతలదేశాల్లో మనుషులకు సులభంగా జలుబుచేస్తుంది. అందుచేత వారు తుమ్మకుండటం సాధ్యంకాదు. ఉష్ణదేశాల్లో జనం భోజన సమయాల్లో ఎక్కువ నీళ్లు తాగుతారు. కాబట్టి మనకు త్రేచకుండటం సాధ్యం కాదు. ఇక ఆచారాలను పరికించండి. పాశ్చాత్య సమాజంలో త్రేచితే, అది క్షమించరాని పెద్ద దోషం; కాని జేబుగుడ్డను తీసి దానిలోకి గట్టిగా చీదితే, దాన్లో వారికి ఏ దోషం కనిపించదు! మన సమాజంలో అతిథి త్రేపుతేగాని గృహమేధి తృప్తిపొందడు - తృప్తిగా భుజించాడనటానికి త్రేనుపులే గుర్తు! కాని యితరులతో కూర్చుని భోజనం చేసేటప్పుడు, చీదటం మనకెలా వుంటుంది?

ఇంగ్లండు, అమెరికాలలో అజీర్ణవ్యాధిని గూర్చిగాని, మీకున్న జీర్ణకోశ సంబంధ వ్యాధులను గూర్చిగాని, స్త్రీల ముందు ప్రస్తావించరాదు; నీ మిత్రురాలు ఒక వృద్ధస్త్రీ ఐనా, ఆమెతో నీకు ఎంతో పరిచయం వున్నా, ఈ ఆక్షేపణ వర్తించదు. ఫ్రాన్స్‌లో యీ విషయాలను గురించి యింత పట్టింపు లేదు జర్మన్లకు అంతకంటె తక్కువ పట్టింపు వుంది.

స్త్రీల ముందు సంభాషించేటప్పుడు ఇంగ్లండు, అమెరికా దేశ పురుషులు ఎంతో జాగ్రత్త వహిస్తారు. 'లెగ్' (కాలు) అనే మాటనే ఎత్తరాదు ఫ్రెంచ్‌వారు, మనమాదిరి ఎంతో ధారాళంగా మాట్లాడతారు; జర్మన్లు, రష్యావారు ఎవరి ముందన్నా అసభ్యంగా సంభాషిస్తారు.

తన ప్రేమను గురించిన సంభాషణలు తల్లి కుమారుల మధ్యను, అన్నదమ్ములు, అక్కచెల్లెళ్ల మధ్యను, తండ్రులతోను ధారాళంగా సాగుతాయి. తండ్రి తన కుమార్తెను ఆమె ప్రియుని ( భర్త కాబోయేవాణ్ణి) గురించి అనేక ప్రశ్న లడుగుతాడు. ఆమె పెళ్లి ఒప్పుదలను గూర్చి అనేక రకాలుగా పరిహాసాలాడతాడు అలాటి సందర్భాల్లో ఫ్రెంచ్ కన్య సిగ్గుతో తలవంచుకొని వుంటుంది. ఆంగ్ల కన్య సిగ్గుపడుతుంది, అమెరికన్ కన్య తీవ్ర ప్రత్యుత్తరాలు తక్షణమే యిస్తుంది చుంబనం, ఆలింగనంకూడా అంత ఆక్షేపణీయాలు కావు; వీటిని గూర్చి నలుగురి ముందు మాట్లాడ వచ్చును కాని మన దేశంలో వలపును గురించి పెద్దలైన బంధువుల ముందు మాట్లాడకూడదు - దాన్ని అప్రస్తుతంగాకూడా ప్రస్తావించ కూడదు

పాశ్చాత్యులు ప్రస్తుతం ధనవంతులు. మనిషి దుస్తులు పరి శుభ్రంగా, ఆచారానుక్రమంలో నిర్దుష్టమై వుంటే తప్ప, అతడు 'జెంటి ల్మన్' (పెద్దమనిషి) గా పరిగణింపబడడు - సమాజంలో అతడు చేర రాదు జెంటిల్మన్గా వుండేవాడు తన కాలర్ను (మెడపట్టీ గుడ్డను) షర్టును రెండు మూడు సార్లు మార్చుకోవాలి. పేదలకిలా చెయ్యటం సాధ్యం కాదు కదా. బైటికి ఉడుపులమీద మరకలుండకూడదు - చివరకు వాటిలో కనీసం ముడతకూడా వుండకూడదు. వేడిమివల్ల బాధ ఎంతగా వున్నా, చేతులకు గ్లోవులు (చేతి మేజోళ్లు) ధరించే బైటికెళ్లాలి. లేకపోతే వీథుల్లో నడిచేటప్పుడొకవేళ చేతులు మలిన మువవచ్చును; మలిన హస్తా లతో 'లేడీ' ( ప్రతిష్ఠవున్న స్త్రీ) తో కరచాలనం చెయ్యటం జెంటిల్మన్కు ఎంతో అనుచితం. మర్యాదస్థుల సమాజంలో, ఉమ్మి వెయ్యటం, పుక్కి లించటం, పళ్లు కుట్టుకొనటం ఎవరైనా చేస్తే ఆ అపరాధి చండాలుడుగా, నీచజాతివాడుగా పరిగణింపబడి, బహిష్కరింపబడతాడు.

పాశ్చాత్యుల ధర్మం శక్తిని - స్త్రీమూర్తిగా ఎంచబడే సృజన శక్తిని ఆరాధించటం వామాచార సాధకుడు స్త్రీని ఆరాధించే విధాన్ని

పోలివుంటుంది. తాంత్రికారాధకుడు చెప్పేట్లు: ''ఎడమవైపున స్త్రీ, ... కుడివైపున, మద్యపూరిత పాత్ర ముందు; మిశ్రణావశ్యవస్తు సహితమైన వేడిమాంసం, ... వుండాలి. తాంత్రికమతం ఎంతో నిగూఢం, యోగులకైనా దురవగాహం '' ఈ శక్తి పూజే బహిరంగంగా, అందరిచేత (అక్కడ) అవలంబించబడేది; మాతృభావం, అంటే తల్లిపట్ల పుత్రుడి కున్న సంబంధంకూడా అధికంగా కనబడుతుంది. యూరప్ ప్రజలది నిజానికి రోమన్ కాథలిక్ మతమే! - ప్రొటస్టాంటిజమ్ బలం అక్కడ అంతగా కనిపించదు. రోమన్ కాథలిక్ మతంలో జెహోవా, ఏసుక్రీస్తు, మూర్తిత్రయం అప్రధాన దైవాలు; అక్కడి ఆరాధనమంతా మాతకే - చేతుల్లో ఏసు శిశువుని వుంచుకొన్న ఆ మాతృమూర్తికే! చక్రవర్తి 'అమ్మా' అని అరుస్తాడు; సేనాధిపతి 'అమ్మా' అని అరుస్తాడు; పతా కహస్తుడైన సైనికుడు 'అమ్మా' అని అరుస్తాడు; చుక్కాని వద్దవుండే నావికుడు 'అమ్మా' అని అరుస్తాడు, గుడ్డపేలికలు ధరించిన చెంబడివాడు 'అమ్మా' అని అరుస్తాడు; వీధిలోని బిచ్చగాడు 'అమ్మా' అని అరుస్తాడు! లక్షలాది గొంతులు, లక్షలాది రీతుల్లో, లక్షలాది ప్రాంతాలనుండి - 'అమ్మా', 'అమ్మా', 'అమ్మా' అని అరుస్తుంటాయి. ప్రతి ప్రాంతం నుండి 'మరియా' అనే శబ్దమే, రేయింబవళ్లు 'మరియా', 'మరియా' శబ్దమే వినవస్తుంది.

తరువాతిది స్త్రీ ఆరాధన ఈ శక్తిపూజ కామాంధత కాదు. కాశీలో, కాళీఘాట్‌లో, యితర పుణ్యక్షేత్రాల్లో చేయబడేది శక్తిపూజే, ఆ కుమారీపూజే, ఆ సధవాపూజే. ఆ శక్తి కేవలం భావనలోది కాదు, కేవలం ఊహాలోది కాదు, - వాస్తవంగా, ప్రత్యక్షంగా కనిపించేది. మన శక్తిపూజ పుణ్యక్షేత్రాల్లో మాత్రమే, కొన్ని వేళల్లో మాత్రమే జరుపబడు తుంది కాని వారిది అన్ని చోట్ల, ఎల్లప్పుడు, రోజుల, వారాల, మాసాల, సంవత్సరాల పొడుగునా జరుగుతుంది. స్త్రీకి అగ్రస్థానం; ఆమె దుస్తు, ఆసనం, ఆహారం, అక్కరలు, సౌకర్యాలు. యివన్నీ అగ్రగణ్యాలే. ప్రతి

విషయంలోను ప్రథమ మర్యాదలు ఆమెకే అర్పించాలి. ఉన్నత కుటుంబాల్లో పుట్టినవారి మాటేకాదు, యువతుల, సౌందర్యవతుల మాట మాత్రమేకూడా కాదు, ప్రతి స్త్రీ, ఆమె ఎవరైనా, పరిచిత ఐనా, అపరిచిత ఐనా - పూజ. ఈ శక్తిపూజను మూర్‌లు - మహమ్మదీయ మతావలంబులైన మిశ్రిత అరబ్ జాతివారు - స్పెయిన్‌ను జయించి ఎనిమిది శతాబ్దాలు పరిపాలించిన కాలంలో యూరపులో మొదట ప్రవేశపెట్టారు. యూరప్‌లో పాశ్చాత్య నాగరికత, శక్తిపూజ, ప్రథమ బీజాలను చల్లినవారు ఈ మూర్లే. ప్రబలులై, సంస్కృతి గలవారై, మహిమాఢ్యులైన మూర్లు కాలక్రమంలో శక్తిపూజను మరచి, తమ మహోన్నత పదవినుండి పతనమై, ఆఫ్రికాలో ఎవరూ ఎరుగని ఒక మారుమూలలో, చెదరి చెదరి, ప్రపంచానికి అజ్ఞాతులై నేడు జీవిస్తున్నారు. వారి నాగరికత యూరోపియన్లకు సంక్రమించింది మాతృదేవత మూర్లను వదలిపెట్టి క్రీస్తుమతస్థులపై తన ప్రేమపూర్వక ఆశీస్సులు కురిపించి, వారిగృహాలను ప్రకాశవంతాలను చేసింది.

## ఫ్రాన్స్ - 'ప-రీ' నగరం

ఈ యూరప్ ఎలాటిది? నల్లగా, కంచురంగుతో, పసుప్పచ్చ రంగుతో, ఎర్రగా వుండే ఆసియా, ఆఫ్రికా, అమెరికా దేశస్థులు యీ యూరోపియన్ల పాదాలవద్ద ఎందుకు లొంగి పడివున్నారు? ఈ కలియుగంలో వారికి ఏకఛత్రాధిపత్యం ఎలా లభించింది? పాశ్చాత్య ఖండాలు అగ్రస్థానాన్ని ఆక్రమించివుండే ప్రతి విషయానికీ ఆదిమూలమైన ఫ్రాన్స్ ద్వారా యీ యూరప్‌ను తెలుసుకోవాలి. ప్రపంచాన్నేలే సర్వాధికశక్తి యూరప్‌కు వుంది. ఈ యూరప్‌కు ప్రధానకేంద్రం 'ప-రీ'. పాశ్చాత్య నాగరికతకు ప్రధానకేంద్రం 'ప-రీ'. పాశ్చాత్య నైతిక భావాలు, ఆచార వ్యవహార ప్రవర్తనాలు - మంచివైనా చెడ్డవైనా, తేజోమూలాలుగాని, తమోమూలాలుగాని, యీ 'ప-రీ'లోనే ముదిరి, పరిపక్వాలవుతాయి. ఈ 'ప-రీ'

మహాసముద్రం లాంటిది. దీనిలో ప్రవాళ మౌక్తికాది అమూల్య మణు లుంటాయి; సొరచేపలు మొదలైన క్రూర సముద్రచరాలు వుంటాయి. యూరప్‌కి యీ ఫ్రాన్సే ''కర్మక్షేత్రం'' అది హృదయంగమైన దేశం; అంత శీతలంకాదు, అంత ఉష్ణమూ కాదు; ఎంతో సారవంతం; వర్షాలు అత్యధికాలు కావు, అతి స్వల్పాలూ కావు; ఆకాశం వినిర్మలం; ఎండ మనోజ్ఞం; ఓక్[1] చెస్నార్[2] పేర్లున్న వృక్షరాజాలు సమృద్ధాలు; పచ్చిక బయళ్లు మనోహరాలు; కొండలు, నదులు చిన్నవి; ఊటలు ఆనంద ప్రదాలు చీనాలోని కొన్ని ప్రాంతాలు తప్ప, ఫ్రాన్స్ మాదిరి అంత అందంగావుండే దేశాన్ని ప్రపంచంలో నేనెక్కడా చూడలేదు. నీటిలో ఆ సౌందర్యక్రీడ, నేలమీద ఆ సమ్మోహనశక్తి - గాలిలో ఆ ఉన్మత్తత - ఆకాశంలో ఆ పారవశ్యత! ప్రకృతి అంత రమణీయం, మానవులు అలాటి సౌందర్యప్రియులు! ధనికులు, బీదలు, చిన్నవారు, పెద్దవారు, తమ యిళ్లను, గదులను, వీథులను, పొలాలను, తోటలను, అందులోని బాటలను, ఎంతో యింపుగా, ఎంతో పరిశుభ్రంగా వుంచుకొంటారు! - దేశమంతా చిత్రించబడ్డ పటంలా కనిపిస్తుంది. జపాన్‌లో తప్ప అంత ప్రకృత్యనురాగం, అంత కళాపిపాస నేను మరెక్కడా చూడలేదు. రాచ నగరులను పోలే ప్రాసాదాలు, ఇంద్రుడి నందనోద్యానాన్ని పోలిన తోటలు, తోపులు, రైతుల పొలాలు సైతం - ప్రతి స్థలాన్ని, ప్రతి వస్తువును, మనోజ్ఞంగా ఒనర్చే ప్రయత్నం - కళావంతంగా చేసే ప్రయత్నం - గమనించతగ్గది. ఈ ప్రయత్నం సాఫల్యంకూడా పొందింది.

ప్రాచీనకాలంనుండి ఫ్రాన్స్ గాల్స్‌ల, రోమన్ల, ఫ్రాంకుల, యితర జాతుల మధ్య పోరాటం జరిగిన ప్రాంతం రోమన్ సామ్రాజ్యం పతన మొందాక, ఫ్రాంకులకు యూరప్‌మీద నిరంకుశాధిపత్యం లభించింది. వారి రాజైన షార్లిమేన్ ఖడ్గబలంతో యూరప్‌లో క్రైస్తవమతాన్ని ప్రవేశ పెట్టాడు. ఈ ఫ్రాంకుల ద్వారానే యూరప్ ఆసియా దేశస్థులకు

1 సింధూరవృక్షం

2 తివిసి చెట్టులాంటి ఒక వృక్ష విశేషం

తెలియవచ్చింది. కాబట్టే మనం యిప్పటికీ యూరోపియన్లకు ఫ్రాంకీ, పెరింగీ, ఫ్లాంకీ, ఫిలంగ మొదలైన పేర్లు వాడుతున్నాం

పాశ్చాత్య నాగరికతకు మూలస్థానమైన ప్రాచీన గ్రీసుదేశం తన తేజశ్శిఖరంనుండి పతనం చెంది, విస్మృతికూపంలో కూలి, అతి విస్తృతమైన రోమన్ సామ్రాజ్య నాగరికతా విహీన జాతుల దండయాత్రల తాకిడిచే భగ్నమొందాక, యూరప్ ఖండజ్యోతి ఆరిపోయింది; ఆ కాలం లోనే ఆసియా ఖండంలో మరో అనాగరిక జాతివారు - అరబ్బులు - అజ్ఞాత స్థితినుండి లేచారు. అపారవేగంతో యీ అరబ్బు ఉప్పెన ప్రపంచంలోని వివిధ ప్రాంతాలకు వ్యాపించసాగింది. పటిష్టమైన పర్షియాదేశం అరబ్బుల దాడికి ఆగలేక, లొంగిపోయి మహమ్మదీయ మతాన్ని అవలంబించవలసి వచ్చింది. తత్ఫలితంగా, మహమ్మదీయ మతం వినూత్నాకృతిని దాల్చింది. అరబ్బుల మతం పర్షియా నాగరికతలో సమ్మేళన మొందింది.

అరబ్బుల ఖడ్గ సహాయంతో పర్షియా నాగరికత నలుదిశలకు విస్తరించసాగింది. ఆ పర్షియా నాగరికత ప్రాచీన గ్రీసునుండి, హిందూ దేశంనుండి గ్రైకొనబడింది. తూర్పునుండి, పడమర నుండి మహమ్మదీయుల దండయాత్రాతరంగాలు యూరప్‌ను తీవ్రంగా తాకుతూ, దానితోపాటు జ్ఞాన తేజస్సును, నాగరికతా దీప్తిని ప్రవేశపెట్టి, మౌఢ్యంలో కూలిపోయిన యూరప్ అజ్ఞానాంధకారాన్ని పటాపంచలు చెయ్యనారంభించాయి. ప్రాచీన గ్రీసుదేశ వివేకం, పాండిత్యం, కళలు ఇటలీలో ప్రవేశించి, అక్కడి అనాగరిక జన మార్గ ప్రాబల్యాన్ని అణచి, తమ ఉజ్జీవన ప్రభావాన్ని అందులో చొప్పించటంతో విశ్వ రాజధాని ఐన రోమ్ నగర మృతశరీరం తిరిగి జీవంతో స్పందించసాగింది. ఈ నూత్న జీవిత స్పందనం ఫ్లారెన్స్ నగరంలో ప్రబలి, అప్రతిహత రూపాన్ని దాల్చి విజృంభించటంతో, పాతపడ్డ ఇటలీదేశం నూతన జీవచిహ్నాలు చూపనారంభించింది. దీన్నే 'రినేసాన్స్' (పునరుజ్జీవనం) అంటారు.

ఈ పునరుజ్జీవనం ఇటలీకి పునర్జన్మ మాత్రం; కాని యూరప్‌లోని తక్కిన దేశాలకు అదే ప్రథమ జన్మ. యూరపు క్రీస్తు వెనుక పదహారవ శతాబ్దంలో జన్మించింది, అంటే, అక్బర్, జహంగీర్, షాజహాన్ మొదలైన మొగలాయి చక్రవర్తులు తమ మహత్తర సామ్రాజ్యాన్ని హిందూదేశంలో సుస్థిరంగా స్థాపించినట్టి కాలంలోనే.

ఇటలీ ప్రాచీనకాలంలోనే ఒక బలిష్ఠజాతికి నిలయం. రినేసాన్స్ ఆహ్వానాన్ని విని అది మేల్కొని పలికింది, కాని వెంటనే శయ్యలో రెండవ ప్రక్కకు పొరలి తిరిగి గాఢనిద్రితమైందని చెప్పవచ్చును అనేక కారణాల చేత హిందూదేశంకూడా యీ కాలంలో కాస్త కదలిక చూపింది. అక్బరు మొదలు ముగ్గురు చక్రవర్తుల పరిపాలనాకాలంలో విద్య, విజ్ఞానం, కళలు హిందూదేశంలో అధిక గౌరవాన్ని పొందాయి. కాని హిందూదేశంకూడా అతిప్రాచీన జాతి నిలయం. అదికూడా ఏ కారణం చేతనో ఇటలీ మాదిరే ప్రవర్తించి తిరిగి నిద్రించింది.

ఇటలీలోని యీ పునరుజ్జీవన కల్లోలం యౌవన బలిష్ఠ నూతన జాతి ఐన ఫ్రాంకులను తాకింది. అన్ని దిశలనుండి ఫ్లారెన్స్‌లోకి ప్రవహించి అక్కడ సమ్మేళనంలో నాగరికతా ప్రచండ ప్రవాహం ఒక క్రొత్త రూపాన్ని దాల్చింది; కాని అపరిమితం, అత్యద్భుతం ఐన ఆ వినూత్న కార్యోత్సాహ శక్తిని తనలోనే నిలుపుకొనే బలం ఇటలీకి లేకపోయింది. హిందూ దేశంలో మాదిరి ఆ నూతనోజ్జీవనం అక్కడే ముగిసి అంతమొందే వుండేది. కాని యూరపుఖండ అదృష్టవశాత్తు నవీనజాతివారైన ఫ్రాంకులు ఆ కార్యోత్సాహశక్తిని ఆనందంతో చేకొని యౌవన రక్తపాటవంతో, తమ జాతీయ నౌకను ధైర్యంగా ఆ వెల్లువ నీటిలో తేలించారు; ఆ పురోగమన ప్రవాహం క్రమక్రమంగా పరిమాణాన్ని, బలాన్ని పుంజుకొని, ముందు ఏకంగా వుండినది సహస్రముఖమై ప్రవహించసాగింది యూరప్‌లోని తక్కిన దేశ జాతులు ఆ వెల్లువ నీటిని - కొత్త కాలువలు త్రవ్వుకొని - అత్యాసక్తితో తమ దేశంలోకి మరలించుకొని, తమ జీవిత రక్తాన్ని

అందులో పోసి దాని పరిమాణాన్ని, వేగాన్ని అధికం చేశారు. ఆ ప్రకారం కాల పరిపాకంలో హిందూదేశ తీరాల నెగదట్టి, జపాన్ తీరందాకా సాగి, ఆ జపాన్ నీళ్లలో స్నానమాడటంతో తిరిగి జీవశక్తిని చేకూర్చుకొంది. ఆసియాలో కొత్తగా జ్ఞాతీయత నొందిన దేశం జపాన్.

గంగానదికి గోముఖి ఎలాగో యూరోపియన్ నాగరికతకు 'ప-రీ' నగరం ఆదిమూలం. మహావిస్తృతమైన యీ ప్రధాన నగరరాజం భూలోక స్వర్గం, నిరంతరానంద నిలయం, సదానందనగరి. అంత భోగ సమృద్ధి, అలాటిసుఖానుభూతి, ఆ ఉల్లాసం లండన్‌లోగాని, బెర్లిన్‌లోగాని, మరెక్కడాగాని లేవు. లండన్‌లోను, న్యూయార్క్‌లోను ద్రవ్యసమృద్ధీ, బెర్లిన్‌లో విద్యావివేక సమృద్ధులు వున్నాయి. నిజమే, కాని ఎక్కడా ఆ ఫ్రెంచ్ భూమి, సర్వాతిశయమైన ఆ ఫ్రెంచ్ ప్రతిభాతిశయం కానరావు. తక్కినచోట్ల ఎంత ధనమైనా వుండనీ, విద్యావివేకా లుండనీ, ప్రకృతి సౌందర్యంకూడా వుండనివ్వు, కాని ఆ 'మనిషి' లేడు! అద్భుత మైన యీ ఫ్రెంచ్ స్వభావం - తిరిగి పుట్టటానికి మరణించిన - ప్రాచీన గ్రీకు స్వభావ అవతారమని చెప్పవచ్చును. వారు సదా ఉల్లాసంతోను, ఉత్సాహంతోను నిండి, సామాన్యజీవితంలో దీర్ఘాలోచనలు చెయ్యక, ఒక్కోసారి నిరర్థకంగాకూడా ప్రవర్తిస్తూ, కార్యావసరాల్లో మాత్రం ఎంతో గాంభీర్యంగాను, సద్యఃస్ఫూర్తిని, సుస్థిరతను చూపుతుంటారు. కాని కాస్త ప్రతిరోధానికైనా నిరాశపడటం వారి నైజం. ఐనా వారికి ఆ నైరాశ్యం క్షణికమే. కొంచెం సేపట్లో వారి ముఖం నూతనాశాధైర్య విశ్వాసాలతో దీపింప నారంభిస్తుంది.

'ప-రీ' నగర విశ్వవిద్యాలయం యూరప్‌లోని విశ్వవిద్యాలయా లన్నింటిలో మేలుబంతి ఐనది. ప్రపంచంలోని వైజ్ఞానిక విద్యాశాలలన్నీ ఫ్రెంచ్ వైజ్ఞానిక విద్యాశాల కనుకరణలే. వలసలను (కాలనీస్) స్థాపించ టాన్ని ప్రథమంలో యితర దేశాలకు నేర్పింది 'ప-రీ' నగరమే. యుద్ధ విద్యలో అన్ని భాషల్లోను ఉపయోగించబడే మాటలు నేటికీ

సామాన్యంగా ఫ్రెంచ్ మాటలే. ఫ్రెంచ్ రచనల శైలి, ఫక్కీ యూరోపియన్ భాషలన్నింటిలో అవలంబించబడ్డాయి. విజ్ఞాన శాస్త్రాలకు, దార్శనిక శాస్త్రాలకు, కళలకు 'ప-రీ' నగరమే గని. ప్రతి దేశంలోను, ప్రతి విషయంలోను ఫ్రెంచ్ అనుకరణం వుంది - ఫ్రెంచ్‌వారు నగరవాసులైతే, తక్కిన సమస్త జాతులు వారితో పోల్చిచూస్తే గ్రామస్థులైనట్లుగా వూహించవచ్చును. విద్యా విషయంలోగాని, కళావిషయంలోగాని, సాంఘిక విషయాల్లోగాని, ఫ్రెంచ్‌వారు ప్రారంభించిన దాన్ని జర్మన్లు, ఆంగ్లేయులు, తక్కిన జాతులు - ఏభై, అరవై ఏదేళ్ల తర్వాత కూడా అనుకరిస్తారు. ఈ ఫ్రెంచ్ నాగరికత స్కాట్‌లండ్ చేరింది. స్కాట్‌లండ్ రాజు ఆంగ్లేయులకు రాజైనప్పుడు, ఆ నాగరికత ఇంగ్లండును నిద్రనుండి మేల్కొల్పి, అక్కడివారికి కార్యోత్సాహం కలిగించింది; - స్కాట్‌లండ్ దేశ స్టూవర్ట్ రాజవంశం పరిపాలిస్తున్న కాలంలోనే ఇంగ్లండులో రాయల్ సొసైటీ, యితర వైజ్ఞానిక సంస్థలు నెలకొల్పబడ్డాయి.

అంతేగాక ఫ్రాన్స్ స్వాతంత్ర్యానికి పుట్టినిల్లు. ఇక్కడనుండి - యీ 'ప-రీ' నగరంనుండి - ప్రజాబలం అపారమైన కార్యోత్సాహశక్తితో బైలుదేరి యూరప్‌ను మూలబంధ సైతంగా వూపేసింది. అప్పటి నుండి యూరప్ ముఖవైఖరే పూర్తిగా మారిపోయి, నవీన యూరప్ ఖండం జనించింది. లిబర్టీ[1], ఈక్వాలిటీ[2], ఫ్రెటర్నిటీ[3] అనే మాటలిప్పుడు ఫ్రాన్స్‌లో వినిపించటం లేదు; ఆ దేశం యిప్పుడు యితర భావాలను, యితర సంకల్పాలను అనుకరిస్తోంది. కాని యూరప్‌లోని యితర దేశాల్లో ఫ్రెంచ్ విప్లవ మూలశక్తి యిప్పటికీ పనిచేస్తోంది.

'ప-రీ' నగరం లోకానికి కేంద్రస్థానమని, ఏ దేశమైనా ఆ నగరంతో సంబంధాన్నెంత ఎక్కువగా ఏర్పరచుకొంటుందో, అంత ఎక్కువగా ఆ దేశ జాతీయ జీవనాభివృద్ధి సమకూడుతుందని యిటీవల ఇంగ్లండ్‌లోని ఒక సుప్రసిద్ధ విజ్ఞాన శాస్త్రజ్ఞుడు నాతో అన్నాడు. ఈ మాటలో కొంత

1. స్వేచ్ఛ, 2 సమత్వం, 3. సౌభ్రాతృత్వం

అతిశయోక్తి వుంది కాని, ఎవడైనా లోకానికొక నూత్నభావం అందివ్వవలసి వుంటే, దాన్ని వ్యాపింపచెయ్యటానికి 'ప-రీ' నగరమే అర్హమైన దనటానికి సందేహంలేదు. 'ప-రీ' ప్రజల ఆమోదాన్ని పొంద గలిగితే, యూరప్ అంతా ఆ ఆమోదంతో నిస్సంశయంగా ప్రతిధ్వని స్తుంది. శిల్పి, చిత్రకారుడు, గాయకుడు, నటుడు - ఏ కళోపాసకుడైనా - 'ప-రీ'లో ముందుగా ప్రఖ్యాతి పొందగలిగితే, యితర దేశాల గౌరవాన్ని, ఆమోదాతిశయాన్ని సులభంగా సంపాదించుకొంటాడు.

మన దేశంలో 'ప-రీ' ప్రతికూలపక్షాన్ని గూర్చి మాత్రమే - అది ఘోర ప్రదేశమనీ, భూలోక నరకమనీ - వింటాం. ఆంగ్లేయుల్లో కొందరి కీ అభిప్రాయం వుంది; ఇతర దేశాల్లోని ఐశ్వర్యవంతులు - జీవితంలో ఇంద్రియ సుఖానుభూతినే పరమసుఖంగా ఎంచేవారు - 'ప-రీ' నగరం దుర్నీతికి, ఇంద్రియభోగాలకు నిలయమని భావించటం సహజమే.

కాని పాశ్చాత్యఖండ మహానగరాలు - లండన్, బెర్లిన్, వియన్నా, న్యూయార్క్ మొదలైనవి - అన్నింట్లోను యిదే స్థితి నెలకొనివుంది ఒక ముఖ్య వ్యత్యాసం మాత్రం వుంది· ఇతర నగరాల్లో ఇంద్రియభోగ మార్గాలు చప్పనివి, మొరటువి, కాని నాగరికతా నిలయమైన 'ప-రీ'లోని సుకుమారభోగాన్ని యితర నగరాల్లోని అసభ్య భోగాలతో పోల్చటం, నెమలి నృత్యాన్ని బురదలో పొర్లాడే అడవిపందితో పోల్చటం వంటిది.

సుఖంగా జీవిస్తూ ఆ సుఖాన్ని అనుభవిస్తుండాలనే లాలస లోకంలో ఏ జాతికి లేదు? లేకపోతే, ధనాన్ని ఆర్జించినవారు తక్కిన అన్నిచోట్లను వదిలివేసి తక్షణమే 'ప-రీ'కి వెళ్లటం ఎందుకు? రాజులు, చక్రవర్తులు మారుపేరుతో 'ప-రీ'లో ప్రచ్ఛన్నంగా జీవిస్తూ, యీ ఇంద్రియభోగ జలావర్తంలో స్నానమాడటాన్ని ఎందుకు సుఖజీవనంగా ఎంచాలి? ఈ లాలస అన్ని దేశాల్లోను వుంది. దాని సిద్ధికై ఎన్ని కష్టాలైనా పడతారు. ఒకే వ్యత్యాసం వుంది. ఫ్రెంచ్ వారు దాన్నొక సమగ్ర విద్యగా చేశారు. భోగాల నెలా అనుభవించాలో వారికి తెలుసు. భోగమనే నిచ్చెన పైమెట్టును వారెక్కగలిగారు.

ఇలా ఐనా, 'ప-రీ'లోని అసభ్య నాట్యాల్లో, వేడుకల్లో ఎక్కువ భాగం విదేశీయుల ఆనందం కోసమే; ఫ్రెంచ్‌వారు ఎంతో జాగ్రత్తపరులు. వారు వ్యర్థంగా ఎన్నడూ ధనవ్యయం చెయ్యరు. అక్కడున్న భోగాతిశయాలు, ఒక్కపూట భోజన ఖర్చే మనిషికి చేటుతెచ్చేటంతటి వ్యయాన్నికోరే భోజన హోటళ్లు, కాఫీ హోటళ్లు ధనికులు, వివేక హీనులు ఐన విదేశీయుల కోసమే ఏర్పడ్డాయి. ఫ్రెంచ్‌వారు ఎంతో నాజూకుపరులు; మర్యాద బాగా చూపిస్తారు; వారి ప్రవర్తన రమ్యం, మధురం; ధనాన్ని లాక్కోవటంలో వారు ప్రవీణులు, అలా చేసినప్పుడు తమలోతామే నవ్వుకొంటారు.

ఇదికాక మరో గమనించతగ్గ విషయంకూడా వుంది. అమెరికన్లలో, జర్మన్లలో, ఆంగ్లేయుల్లోని సాంఘిక జీవనంలో అన్ని జాతులకు ప్రవేశం వుంది. కాబట్టి విదేశీయుడు దాన్ని కూలంకషంగా గ్రహించటం సులభం. కొద్ది రోజుల పరిచయంతో అమెరికన్ మనలను తన యింట్లో కొన్నాళ్లుండి వెళ్లమని ఆహ్వానిస్తాడు; జర్మన్‌కూడా అలాగే చేస్తాడు. కొంత దీర్ఘ పరిచయానంతరం ఆంగ్లేయుడూ అలాగే చేస్తాడు. కాని ఫ్రెంచ్‌వారు అలా చెయ్యనే చెయ్యరు. ఫ్రెంచ్‌వాడు ఎవరినీ - అతడు తనకు ఆప్తస్నేహితుడైతే తప్ప - తన కుటుంబంతో కలిసి నివసించమని ఆహ్వానించడు. కాని విదేశీయుడికి అలాటి అవకాశం లభించి, కుటుంబాన్ని చక్కగా చూసి, గ్రహించటానికి అనువైన సమయం, కాలం దొరికితే, వారిని గూర్చి సామాన్యంగా వినే అభిప్రాయానికి కేవలం భిన్నమైన అభిప్రాయం అతడికి కలుగుతుంది. కలకత్తాలో నిమ్నవర్గంవారు వుండే ప్రాంతాన్ని మాత్రం చూసి, మన జాతీయ శీలాన్ని గురించి అభిప్రాయాన్ని ఏర్పరచుకొని ప్రకటించటంలో విదేశీయులు చూపే అవివేకం యిలాటిదే కదా! 'ప-రీ' నగర విషయంకూడా యిలాటిదే. మన దేశంలో అవివాహిత స్త్రీలు ఎంత జాగ్రత్తగా చూడబడతారో, అంత జాగ్రత్తగానే ఫ్రాన్స్‌లోని అవివాహిత స్త్రీలుకూడా చూడబడతారు; వారు స్వేచ్ఛగా సమాజంలో కలసిమెలసి

తిరగటానికికూడా అనుమతింపబడరు; వివాహానంతరమే భర్తతోకూడి వారలా చెయ్యవచ్చును. మనలో మాదిరే వారిలోను వైవాహిక ప్రసంగాలు తల్లిదండ్రులే జరుపుతారు పెళ్లిళ్ల సందర్భాల్లోను, పూజా సందర్భాల్లోను మనం ఎలా నటీజన ప్రదర్శన లేర్పాటుచేస్తామో అలాగే, ఉల్లాసవంతులు కాబట్టి, వారూ, తమ గొప్ప సాంఘిక కార్యాలేవీ ఆటవెలదుల నాట్యప్ర దర్శనం లేనిది పరిపూర్ణత నొందినట్లు ఎంచరు. పొగమంచు కమ్ముకొని మసకగా వుండే దేశంలో నివసించే వారవటంచేత ఆంగ్లేయులు వ్యాకుల స్వభావం వున్నవారు. అందుచేత వారు ముఖం మాడ్చుకొని, ఇళ్లవద్ద అలాటి నాట్యాలు ఎంతో అనుచితాలంటారు; కాని నాటకశాలల్లో వాటి నాక్షేపించరు. వారి నాట్యాలు మన దృష్టికి అనుచితాలుగా వుండొచ్చును గాని, వాటికి అలవాటుపడి వుండటంచేత వారి కవి అనుచి తాలుగా కనిపించవని మనం యిక్కడ జ్ఞాపకం వుంచుకోవాలి. నాట్య సమయంలో నర్తకి కంఠం, భుజాలు బహిరంగంగా కనిపించే దుస్తులు ధరించవచ్చును. అది అనుచితంగా ఎంచబడదు ఆంగ్లేయులు, అమెరి కన్లు ఆ నాట్యాలకు నిరాక్షేపంగా వెళ్లి, చూస్తారు, కాని ఇళ్లకు వెళ్లాక ఫ్రెంచ్ ఆచారాలను ఖండించటాన్ని మానుకోకపోవచ్చును.

అంతేగాక స్త్రీల సౌశీల్యాన్ని గురించిన భావాలన్నిచోట్ల ఒక్కటే - వారు దాన్నుండి తొలగటం అపాయకరం. కాని పురుషుల విషయంలో అదంత ముఖ్యంకాదు. ఈ విషయంలో ఫ్రెంచ్ పురుషుడు అంత గట్టి పట్టు పట్టడు. విదేశీయ ధనికుడి మాదిరి అతడూ యితరుల పరా మర్శలను లక్ష్యపెట్టడు. మొత్తంమీద యూరోప్ పురుషుల్లో అధికభాగం కొంచెంపాటి నీతిభ్రంశాన్ని అంతతప్పుగా ఎంచరు. పాశ్చాత్య ఖండాల్లో అవివాహిత పురుషుల విషయంకూడా యింతే. తరుణ వయస్కులైన విద్యార్థుల తల్లిదండ్రులు ఆ యువకులు స్త్రీలతో మెలగటానికి సిగ్గుపడటం కొంత లోపంగానే గణిస్తారు. అందువల్ల వారికి ఆడంగితనం అబ్బుతుందని వారి భయం. పాశ్చాత్యదేశాల్లో మనుషులకు ముఖ్యంగా

వుండాల్సిన సుగుణాల్లో శ్రేష్ఠతమమైంది - ధైర్యం. వారి వర్ట్యూ (సుశీలత) అనే మాట, మన 'వీరత్వ' మనే మాట ఒక్కటే (అభిన్నాలు). వర్ట్యూ శబ్దపు వ్యుత్పత్త్యర్థాన్ని చూసి, వారు మానవుడిలో దేన్ని యోగ్యగుణంగా ఎంచుతారో చూడండి. వారు స్త్రీలకు సౌశీల్యమే (ప్రాతివ్రత్యమే) ముఖ్యమతధర్మంగా భావిస్తారనటానికి సంశయంలేదు. ఒక పురుషుడు అనేకమందిభార్యలను వివాహం చేసుకోవటం, ఒక స్త్రీ ఏక కాలంలో అనేకమంది భర్తలను కలిగివుండటమంత సాంఘిక హానికరం కాదు - యీ రెండో దానివల్ల జాతి క్రమంగా క్షీణిస్తుంది. కాబట్టి స్త్రీల సౌఖ్యానికి హానిరాకుండేట్లు అన్ని దేశాల్లోను ఎంతో జాగ్రత్త వహిస్తుంటారు. స్త్రీల సౌశీల్య సంరక్షణ విషయంలో ప్రతి సమాజం చేసే ప్రయత్నాలకు మూలమై ప్రకృతి సంకల్పం కనిపిస్తోంది. జనసంఖ్యను అభివృద్ధి పరచటం ప్రకృతికి సహజం. ఆ సహజ స్థితికి స్త్రీజన సౌశీల్యం సహాయకారి. కాబట్టి పురుషుల శీలనైర్మల్య విషయంలోకంటె స్త్రీల శీల నైర్మల్య విషయంలోనే ఎక్కువ ఆతురత చూపటంలో ప్రతి సమాజం ప్రకృతి సంకల్పాన్నే నెరవేరుస్తోంది.

ప్రతి జాతి జీవితానికి ఒక నైతికలక్ష్యం వుందని, ఆ జాతి ఆచారాలు, ప్రవర్తనలు, ఆ లక్ష్యాన్నిబట్టే విచారించి వాటి మంచిచెడ్డలు నిర్ణయించవలసి వుంటుందని, మీ మనస్సుల కెక్కించటం కోసమే యీ విషయాలను గురించి ప్రసంగించాను. పాశ్చాత్యులను మనం వారి కళ్లతోనే చూడాలి; వారిని మన కళ్లతో చూడటం, మనలను వాళ్లు తమ కళ్లతో చూడటం - రెండూ తప్పే. వారి జీవిత లక్ష్యం, మన జీవిత లక్ష్యం ప్రత్యక్ష విరుద్ధాలు. సంస్కృతంలో విద్యార్థి పేరైన 'బ్రహ్మచారి' శబ్దం 'కామజిత్'[1] అనే సంస్కృత పదానికి పర్యాయపదం. మన జీవిత పరమార్థం మోక్షం; అది బ్రహ్మచర్యం (లేక, పరిపూర్ణ కామ నిగ్రహం) లేకుండా ఎలా సాధించవచ్చును? కాబట్టి అది విద్యార్థి దశలోని మన

1 పూర్తి ఇంద్రియనిగ్రహం వున్నవాడు

బాలురకు, యువకులకు అవశ్యానుసరణీయంగా విధించబడింది. పాశ్చాత్య జీవిత లక్ష్యం భోగం, సుఖానుభూతి; కాబట్టి మనకు మాదిరి వారికి కఠోర బ్రహ్మచర్యం పాటించటం అంత ముఖ్యంకాదు.

ఇప్పుడు మళ్లీ 'ప-రీ' విషయానికి వద్దాం. ఆధునిక 'ప-రీ' నగరానికి సాటివచ్చే నగరమేదీ ప్రపంచంలో లేదు దాని పూర్వ స్థితికి, దాని ప్రస్తుత స్థితికి సంబంధమే లేదు. అప్పుడది కాశీలో వంగదేశీయు లుండే ప్రాంతం మాదిరి - వంకరటింకరలైన సందు గొందులు, వీథులు; అక్కడక్కడ సందుమీదుగా నిలిపిన కమానులచే ఒకటిగా చేర్చబడిన యిళ్లు, గోడల పక్కన బావులు - యిలాటి స్థితి వుండేది. చివరి ప్రదర్శనంలో ప్రాచీన 'ప-రీ' నగర ప్రతిరూప మొకటి చూపబడింది. కాని ఆ 'ప-రీ' యిప్పుడు - క్రమ పరిణామాలవల్ల - పూర్తిగా అదృశ్య మైంది; ఇక్కడ జరిగిన యుద్ధాలు, విప్లవాలు ప్రతిపర్యాయం నగరంలో ఏదో ఒక ప్రాంతాన్ని ధ్వంసం చేసి, అక్కడ సర్వాన్ని నేలమట్టం గావించాయి. తిరిగి యిప్పుడు వాటి స్థానంలో ఆధునిక 'ప-రీ' నగరం - మరింత నిర్మలమై, విస్తృతమై - ఉద్భవించింది

ఆధునిక 'ప-రీ' నగరం చాలవరకు, మూడవ నెపోలియన్ సృష్టి పూర్వ ప్రభుత్వ పతనకాలంలో ప్రారంభమైన నగర పరిణామాన్నతడు పూర్తిగావించాడు. ఫ్రెంచ్ విప్లవానికి పూర్వంవున్న నిరంకుశ ప్రభువులచే ఫ్రెంచ్ ప్రజలెలా హింసించబడింది ఫ్రాన్స్ చరిత్ర తెలిసిన విద్యార్థికి జ్ఞాపకం చేయాల్సిన అవసరంలేదు. మూడవ నెపోలియన్ కేవలం ఆయుధ బలంతోనే, రక్తంలో నడిచి, చక్రవర్తిగా ప్రకటించుకొన్నాడు మొదటి ఫ్రెంచ్ విప్లవకాలంనుండి ఫ్రెంచ్‌వారు ఎప్పుడూ చపలచిత్తులై సామ్రాజ్యానికి భయకారణులై వుండిరి అందుచేత చక్రవర్తి - ప్రాచీన 'ప-రీ'లోని జ్ఞాపక చిహ్నాల నలాగేవుంచి -, ప్రజలు తృప్తిపడ్డవారై వుండ టంకోసం - ఎప్పుడూ అస్థిరబద్ధులై వుండే 'ప-రీ' జనాన్ని కార్య నిమగ్నులను చేసి ఆనందింప చెయ్యటంకోసం, అద్భుతాలైన రాచ

బాటలను, అడ్డకట్టలను, సింహద్వారాలను, నాటకశాలలను, యింకా అనేకాలైన శిల్ప నిర్మాణాలను కొత్తగా కట్టించసాగాడు. ఒక దిక్కునుండి మరో దిక్కుకు వెళ్లే తిన్నని, విశాలమైన రాచబాటలు నగరమంతా నిర్మించబడ్డాయి, ఇవన్నీకాక, దుర్గప్రాకారపంక్తి నొకటి కట్టించి, నగర వైశాల్యం రెండింతలు చేయించాడు. వృక్షపంక్తి శోభితాలైన విశాలమైన వీథులకు, డాన్‌టాన్గ్ మొదలైన ప్రాంతాల్లోని చక్కని గృహాలకు యిదే మూలం. ప్రపంచంలో అద్వితీయమైన షామ్స్ ఎలిజె అనబడే శృంగార వనంలోని వృక్షపంక్తికి మధ్యనుండే విహారవీధికూడా అప్పుడే పునర్ని ర్మింపబడింది. ఈ విహారవీథి అత్యంత విశాలమైంది; దీని మధ్యప్రదేశం పొడవునా, యిరుపక్కల తోటలు వెయ్యబడ్డాయి. ఒక ప్రాంతంలో అది వర్తులాకృతి దాల్చి నగరముఖమై, కాన్‌కార్డ్ అనబడే పేర నగర పశ్చిమ భాగంలో వుంది. ఈ కాన్‌కార్డ్ చుట్టూ ఫ్రాన్స్‌లోని ఎనిమిది ముఖ్య పట్టణాల ప్రత్యామ్నాయాలైన ఎనిమిది స్త్రీ విగ్రహాలున్నాయి. ఈ విగ్ర హాల్లో ఒకటి స్ట్రాస్‌బర్గ్ జిల్లాను సూచిస్తుంది. ఈ జిల్లాను 1872 వ సం. యుద్ధానంతరం జర్మన్లు ఫ్రెంచివారినుండి లాక్కొన్నారు. ఈ నష్టంవల్ల కలిగిన బాధను ఫ్రెంచ్‌వారు మరువలేక, అమృతాత్మ స్మృతిచిహ్నం అనేట్లుగా ఆ విగ్రహాన్ని యిప్పటికీ పువ్వులతో, పువ్వులమాలలతో కప్పి వుంచుతారు.[1] మానవులు మరణించిన తమ బంధువుల సమాధులపై పువ్వుల మాలలు వుంచేరీతిలో, వా రా విగ్రహంమీద అప్పుడప్పుడు పువ్వుల మాలలుంచుతారు.

ఢిల్లీలోని 'చాంద్నీచౌక్' పూర్వ మొకప్పుడు యీ కాన్‌కార్డ్‌ను పోలి వుండొచ్చునని నాకు తోస్తోంది. విజయస్తంభాలు, జయసూచక ధనురా కృతులు, శిల్పకళా ప్రదర్శకాలైన బ్రహ్మాండమైన స్త్రీ పురుషుల విగ్రహాలు, సింహాది రూపాలు, ఆ ప్లాస్ డెల కాన్‌కార్డ్‌కు అక్కడక్కడ అలంకారికాలై శోభిల్లుతున్నాయి

---

1 ఇది 1914 సం మొదటి ప్రపంచ యుద్ధానికి ముందు వ్రాయబడింది.

ట్రోజన్స్ స్తంభాన్ని పోలిన ఒక అతిపెద్ద విజయస్తంభం - 'గన్ మెటల్' అనే మిశ్రలోహంతో (1,200 ఫిరంగులను కరిగించటంచే ఏర్పడ్డ మిశ్రలోహంతో) తయారుచెయ్యబడింది - వాన్‌డోమ్‌లో వీరాగ్రేసరుడైన మొదటి నెపోలియన్ స్మృతి చిహ్నంగా నిర్మించబడింది; ఆ స్తంభం పక్కలలో ఆ చక్రవర్తి పరిపాలనాకాలపు విజయాలు చెక్కబడ్డాయి, పైభాగంలో నెపోలియన్ బోనపార్టీ విగ్రహం వుంది. పిదప రాజకీయ కారాగారంగా ఉపయోగించబడ్డ 'బస్టిల్' అనే ప్రాచీన దుర్గంలో - 1830 వ సం. జూలై నెల విప్లవ స్మృతిచిహ్నమైన 'జూలై స్తంభం' వుంది. చక్రవర్తి కోపానికి గురైనవారు యీ చెరసాలలో బంధింపబడేవారు. ఆ కాలంలో విచారణేదీ జరపకుండానే రాజు ప్రభుముద్రాంకితమైన లెట్టర్ ద కష్ అనే అధికార పత్రాన్ని (వారంట్) జారీ చేసేవాడు తక్షణమే ఆ నిర్భాగ్యుడు - దేశోపకార్యాలేమి చేశాడోకూడా విచారించకుండానే, రాజు కోపానికి గురవటానికి అతడేంచేశాడో అనికూడా ప్రశ్నించకుండానే, య్యీబాస్టిల్‌లోకి త్రోసెయ్యబడతాడు రాజుల ప్రియురాళ్ల కెవరిమీదైనా కోపంవస్తే, వారు రాజునడిగి ఒక 'లెటర్ ద కష్' అతడిమీద ప్రయోగించవచ్చును; ఆ నిర్భాగ్యుడు తక్షణమే బాస్టిల్‌లోకి నెట్టివెయ్యబడతాడు ఇందులో బంధింపబడ్డ నిర్భాగ్యుల్లో ఏ కొద్దిమందో విడుదలై వుంటారు తరువాత యిలాంటి హింసాచరణాన్ని, క్రౌర్యాన్ని సహించక దేశమంతా ఒకటై తిరుగుబాటు చేసింది ''ప్రతి మానవుడు స్వతంత్రుడు, అంతా సమానులే, ఎవ్వరూ అధికులుకారు, అధములూ కారు'' అని నినాదంచేస్తూ, 'ప-రీ' ప్రజలు ఉద్రేకోన్మత్తులై రాజును, రాణిని పట్టుకొని, వారిమీద పడ్డారు. ఆ మూక చేసిన మొదటి పని యిది మనిషి తోడి మనిషిపై చూపించే క్రౌర్యాధిక్య చిహ్నమైన ఆ బాస్టిల్‌ను నేలమట్టం చేసి, అక్కడ నృత్యం చేస్తూ, పాటలు పాడుతూ, విందు లారగిస్తూ, ఆ రాత్రంతా గడిపారు రాజు తప్పించుకోవాలని ప్రయత్నించాడు. కాని ప్రజలతణ్ణి పట్టుకోగలిగారు. అంతేగాక ఆస్ట్రియా చక్రవర్తి ఐన అతడి మామ, అతడి సహాయ

నిమిత్తం సైన్యాన్ని పంపుతున్నాడనే వార్త విని, కోపోద్రేకులై, రాజా రాణులను చంపేశారు. అప్పుడు ఫ్రెంచ్ జాతి స్వాతంత్ర్య సర్వసమత్వ నామాలతో ఉన్నతమైంది - ఫ్రాన్స్‌లో ప్రజాప్రభుత్వం (రిపబ్లిక్) ఏర్పడింది. ఉన్నతులుగా పరిగణింపబడేవారిలో దొరికినవారినీ వారు చంపేశారు; ఆ 'ఉన్నతుల్లో' అనేకులు తమ బిరుదులను, పదవిని విసర్జించి ప్రజాసామాన్యంవైపు చేరారు. ఇంతేకాక ఫ్రెంచ్ ప్రజలు ప్రపంచంలోని సమస్త జాతులకు ''నిద్ర మేల్కోండి, రాజు లందరూ ప్రజా కంటకులు, వారి నందర్నీ పరిమార్చండి, ప్రతి వ్యక్తికీ స్వాతంత్ర్యం, సమానాధికారాలు కలగాలి!'' అంటూ ప్రబోధించారు. అప్పుడు యూరప్‌లోని రాజులంతా యీ అగ్ని తమ దేశాల్లోకి వ్యాపించి తమ సింహాసనాలను దగ్ధం చేస్తుందనే భయంతో వణికిపోతూ, దాన్ని చల్లార్చటానికి కృతనిశ్చయులై, అన్ని వైపులనుండి ఫ్రాన్స్‌మీద పడ్డారు. రెండోవైపు ఫ్రెంచ్ ప్రజాప్రభుత్వ నాయకులు ''లాపత్రి ఆడాన్జే - పితృదేశానికి అపాయం వాటిల్లింది ప్రతివారూ రండి'' అని చాటింపు వేశారు ఈ చాటింపు దావానలంలా ఫ్రాన్స్‌లో వ్యాపించింది నిరుపేదలైన ఫ్రెంచ్ ప్రజలు - పడుచువారు, వృద్ధులు; పురుషులు, స్త్రీలు, ధనికులు, పేదలు, ఉన్నతులు, నిమ్నులు - గుంపులుకూడి, చీలిక పేలిక గుడ్డలు దాల్చి ఉత్త కాళ్లతో, అమితమైన ఆ చలిలో, అర్థాకలితో, భుజాలమీద తుపాకులు పెట్టుకొని - ధైర్యోత్సాహ ముద్దీపకమైన ఫ్రాన్స్ జాతీయగీతాన్ని - లామార్సెయ్యేస్ పేరున్న సమరగీతాన్ని పాడుకుంటూ బయల్దేరారు - ''పరిత్రాణాయ వినాశాయ చ దుష్కృతామ్'' - దుష్టులను నాశనం చెయ్యటానికి - తమ గృహాలను రక్షించుకోవటానికి - ఏకమై మోహరించిన అఖిల యూరప్ దేశాల సైన్య మహా సందోహాన్ని ధీరతతో ఎదుర్కొన్నారు యూరప్ ఖండమంతా ఏకమైనా, ఫ్రెంచ్ సైన్యధాటికి నిలబడలేకపోయింది ఫ్రెంచ్ సైన్య ముఖంలో అగ్రేసరుడై, ఒక మహా వీరుడు - తన వేలు కదల్చిన మాత్రాన్నే ప్రపంచమంతా వణకింపచేసే

మహావీరుడు - నిలబడి వున్నాడు అతడే నెపోలియన్ ఖడ్గధారతోను, బాకుమొనతోను అతడు ''స్వాతంత్ర్యం, సమానత్వం, సౌభ్రాత్రం'' అనే భావాన్ని యూరప్ 'అస్థిమజ్జాం'తరాల్లోకి ఎక్కించాడు ఇలా త్రివర్ణ పతాక - కోక్కార్డ్ పేరుగలది - యొక్క విజయం సాధించబడింది తరువాత నెపోలియన్ ఫ్రాన్స్ చక్రవర్తై, ఫ్రెంచ్ సామ్రాజ్యాన్ని సంఘటితం చేశాడు.

తన తరువాత సింహాసనాన్ని అధిష్టించే వారసుడు తన భార్య జోసఫీన్‌కు జన్మించనందువల్ల - కష్టసుఖాల్లో తనకు సమభాగినిగా, తన భాగ్య దేవతగా వుండి - తనను అదృష్టమార్గంలో నడిపించిన ఆ భార్యను విడిచిపెట్టి, ఆస్ట్రియా చక్రవర్తి కుమార్తెను వివాహం చేసుకున్నాడు కాని జోసఫీన్‌ను విడిచిపెట్టగానే అతని అదృష్టచక్రం ప్రతికూలంగా తిరిగింది. అతడి సైన్యం రష్యన్ దండయాత్రలో మంచులోను, మంచుగడ్డల్లోను చిక్కి నశించింది యూరప్‌వారు యీ అవకాశాన్ని అదునుగా చేసుకొని, అతణ్ణి బలవంతంగా సింహాసన విసర్జనకు అంగీకరించేటట్లు, దేశ బహిష్కృతుడై ఒక ద్వీపంలో నివసించేటట్లు చేసి, పూర్వపు రాజ వంశంలో ఒకణ్ణి సింహాసనం మీద కూర్చోపెట్టారు. ఆ వ్యథిత సింహ రాజం ఆ ద్వీపంనుండి తప్పించుకొని ఫ్రాన్సుకు తిరిగి వచ్చాడు ఫ్రాన్స్ దేశమంతా అతడికి ఘనస్వాగతం పలికి, అతడి పతాకం కిందికి చేరింది దేశ పరిపాలన చేస్తూన్న రాజు పారిపోయాడు కాని నెపోలియన్‌ను విడిచి పెట్టిన అదృష్టదేవత స్థిరంగా అతణ్ణి వరించలేదు యూరప్ ఖండమంతా ఒకటిగా ఏకమై అతణ్ణి వాటర్లూ వద్ద ఓడించింది నెపోలియన్ ఒక ఆంగ్ల యుద్ధనౌక నెక్కి వారికి లొంగిపోయాడు, ఆంగ్లేయు లతణ్ణి దేశ బహిష్కృతుణ్ణి చేసి, సెయింట్ హెలీనా అనే సుదూర ద్వీపంలో యావజ్జీవ ఖైదీగా వుంచారు పూర్వ రాజవంశంలోని వాణ్ణొకణ్ణి తిరిగి సింహాసనం మీద కూర్చోబెట్టారు కాని తరువాతి కాలంలో ఫ్రెంచ్‌వారు ఆ పూర్వ రాజ్యవిధానంపట్ల అసంతృప్తి పొంది, తిరుగుబాటు చేసి,

రాజును రాజకుటుంబాన్ని తరిమివేసి, ప్రజాప్రభుత్వాన్ని తిరిగి నెలకొల్పారు. మహనీయుడైన నెపోలియన్ సమీప బంధువొకడు కాల క్రమంలో ప్రజాప్రియుడై, కుట్రపన్ని తనను చక్రవర్తిగా ప్రకటించుకొన్నాడు. అతడే మూడవ నెపోలియన్ కొంతకాలంపాటు అతడి పరిపాలన ఎంతో శక్తివంతమై వుండినది; కాని జర్మన్‌లతో జరిగిన పోరాటంలో ఓడిపోయి అతడు రాజ్యభ్రష్టుడైనందువల్ల ఫ్రాన్స్ మళ్లా ప్రజాపాలిత దేశమయింది. నేటిదాకా అదిప్రజాపరిపాలన కిందే నిలిచివుంది

హిందూదేశ వివిధ దర్శనాలకు మూలమైన పరిణామ సిద్ధాంతం యిప్పుడు యూరప్ దేశాల భౌతికశాస్త్రాల్లోకి ఎక్కింది హిందూదేశం తప్ప తక్కిన అన్నిదేశ మతాలు యీ జగత్సమష్టి పరస్పర సంబంధంలేని ప్రత్యేక భాగాల కలయిక అని సిద్ధాంతీకరించాయి, 'దేవుడు, ప్రకృతి, మానవుడు - యీ మూడు తమంతట తామే - ఒకదానితో మరొదానికి కలయిక లేక - వేర్వేరుగా నిలిచి వున్నాయి; అలాగే మృగాలు, పక్షులు, కీటకాలు, వృక్షాలు, భూమి, రాళ్లు, లోహాలు మొదలైనవన్నీ పరస్పర భిన్నాలు. దేవుడు మొదటినుండి వాటిని వేరుగానే సృష్టించాడు '

నానాత్వంలో ఏకత్వాన్ని - పరస్పర భిన్నాలుగా మనకు కనిపించే వస్తువులు నిజానికి ఒకటే అని కనుక్కోవటమే - 'జ్ఞానం' కర్తవ్యం. మానవుడు యీ ఐక్యాన్ని కనుక్కొనే సంబంధ విశేషాన్ని 'నియమ' మంటారు ఇదే ప్రకృతి 'నియమం '

మన చదువు, బుద్ధి, ఆలోచన. యివన్నీ పారమార్థికాలని, యివన్నీ ఆస్తిక ధర్మంలో రూపొంది కనిపిస్తాయని యిప్పటికే చెప్పివున్నాను. పాశ్చాత్యదేశాల్లో అవి బాహ్యవస్తువుల్లో అంటే భౌతిక, సాంఘిక రంగాల్లో కనిపిస్తాయి. ప్రాచీన భారతతత్త్వ విచారపరులు ఆ భిన్నతాభావం ప్రమాద జనితమని, వృక్షాలకు, పొదలకు, జంతువులకు, మానవులకు, దేవతలకు, ఈశ్వరుడికి సైతం - యీ ప్రత్యేక వస్తువు లన్నిటికి - పరస్పర సంబంధం వుందని, ఆ సంబంధం సమస్త ప్రపంచాన్ని ఆవరించి వుండే

ఐక్యమనీ క్రమక్రమంగా కనుక్కొన్నారు, అద్వైతి యీ విచారంలో పరమావధి చేరి, యీ సమస్తం ఆ 'ఒక్కని' అభివ్యక్త రూపాలే అని ప్రకటించాడు యథార్థ భౌతిక ప్రపంచం, ఆధ్యాత్మిక ప్రపంచం ఒక్కటే. ఆ 'ఒక్కని' పేరు బ్రహ్మం భిన్నత్వం కనిపించటం భ్రమ - దాన్ని మాయ, అవిద్య, అజ్ఞానం అంటారు ఇదే జ్ఞానానికి పరమావధి

ఈ విషయం యీనాడు హిందూదేశానికి బైట ఎవరిచేతా గ్రహించకపోతే - హిందూదేశాన్ని మనం యిప్పుడు విచారణలోకి తీసుకోవటం లేదు - అతణ్ణి వ్యుత్పన్నుడని ఎలా గణిస్తాం? పాశ్చాత్య దేశాల్లోని వ్యుత్పన్ను లనేకులు తమ మార్గాన్నే - భౌతికశాస్త్రం ద్వారానే - యీ సత్యాన్ని ప్రస్తుతం కనుక్కొంటున్నారు కాని ఆ 'ఏక' వస్తువు అనేకంగా ఎలా అయిందో - మనకు తెలియదు, వారికీ తెలియదు మనంకూడా యీ సమస్యకు - మన గ్రహణశక్తి పరిమితం కనుక అది మనం కనుక్కోలేమని - జవాబిచ్చాం కాని ఆ ఏకైక వస్తువు పొందిన మార్పులు, అది ధరిస్తూన్న జాతిభేదాలు, వ్యక్తిత్వాలు - ఎలా గ్రహించగలం. ఈ విచారాన్నే విజ్ఞానశాస్త్ర విచార (సైన్స్) మంటారు.

ఇలా పాశ్చాత్యదేశాల్లో సామాన్యంగా అంతా పరిణామవాదులైనారు. చిన్న జంతువులు క్రమపరిణామం పొంది, అంతకంటె పెద్దవయేటట్లు, పెద్ద జంతువులు ఒక్కోసారి హీనగణములై, చిన్నవిగాను, బలహీనంగాను మారి కాలక్రమంలో నశించేటట్లే, మానవుడుకూడా వున్నట్లుండి నాగరికుడై జన్మించడు; ఈ రోజుల్లో దీని విరుద్ధమైన వాదాన్ని పాశ్చాత్య దేశ తత్త్వవిచార పరులెవ్వరూ విశ్వసించరు తమ పూర్వులు యిటీవలే - కొన్ని శతాబ్దాల కిందనే - మృగప్రాయులై వుండి, యీ స్వల్పకాలంలోనే యింత అధికతర పరిణామం పొందారనటానికున్న నిదర్శనాలే దీనికి ముఖ్య కారణం. కాబట్టి మానవులంతా అనాగరిక స్థితినుండి క్రమపరిణామం పొంది వుండాలని, యిప్పటికీ పరిణామం పొందుతున్నారని వారంటారు.

ఆదిమదశలో మానవులు కొయ్య పనిముట్లతోను, రాతి పని ముట్లతోను తమ పనులను జరుపుకొంటూ వచ్చారు వారు చర్మాలు, ఆకులు ధరించేవారు. కొండగుహల్లోను, పక్షి గూళ్లమాదిరి నిర్మించిన పర్ణకుటీరాల్లోను నివసించేవారు ఇలా వారు ఎలాగో కాలం వెళ్లదీసేవారు. భూమి తవ్వకాల్లో అన్ని దేశాల్లోను యిందుకు నిదర్శనాలు లభిస్తున్నాయి. కొన్ని ప్రాంతాల్లో ఆదిమానవులు యిప్పటికీ వున్నారు. కాలక్రమంలో మానవులు సత్తు, రాగి మొదలైన సున్నిత లోహాలను ఉప యోగించటాన్ని, వాటిని కరిగించి మిశ్రమపరచి, పరికరాలు, ఆయు ధాలు చెయ్యటం నేర్చుకొన్నారు. ప్రాచీన గ్రీకులు, బాబిలోని యన్లు, ఈజిప్షియన్లు - చాలవరకు నాగరికులై, పుస్తకాలు రచించి, వెండి, బంగారాల నుపయోగించాకకూడా చాలకాలం వరకూ ఇనుము నుపయో గించటం ఎరుగకున్నారు. ఆ కాలంలో మెక్సికో దేశస్థులు, పెరూదేశీ యులు, అమెరికా ఖండంలోని మాయన్లు మొదలైన ఆదిమజాతులు, కొంతవరకు నాగరికత పొంది, పెద్ద దేవాలయాలు నిర్మించారు. వారిలో వెండి, బంగారాల వాడకం సర్వసాధారణంగా వుండేది. వారి వెండి, బంగారాల నాశించి స్పెయిన్ దేశస్థులు వారిని పరిమార్చారు గదా! కాని వారు యీ వస్తువుల నన్నింటిని ఎంతోకష్టపడి చెకుముకి రాతి పనిముట్ల నుపయోగించి చేస్తూ వచ్చారు, - వారికి ఇనుము అనే పేరుకూడా తెలియదు.

ఆదిమదశలో మానవుడు ధనుర్బాణ ప్రయోగంతోనో, వలలు పన్నో, మృగాలను, చేపలను చంపి వాటిని తిని జీవించేవాడు. కాలక్ర మంలో అతడు భూమి దున్నటం, పశువులు కాయటం నేర్చాడు. అడవి మృగాలను మచ్చిక చేసుకొని, పెంచి, వాటిచేత పనిచేయించాడు; లేక వాటిని పెంచి, అవసరమైనప్పుడు తినేవాడు; ఆవు, గుర్రం, పంది, ఏనుగు, ఒంటె, గొర్రె, కోళ్లు, పక్షులు, యితర జంతువులు మచ్చిక చేసు కోబడ్డాయి వీటిలో కుక్క మనిషికి ప్రధమ మిత్రుడు

ఇలా కాలక్రమాన భూమి దున్నటం ప్రారంభమైంది. పండ్లు, మూలాలు, మొక్కలు, కూరగాయలు, మానవు డిప్పుడు తినే ధాన్య జాతులు ఇవి తమంతటు తామే పుట్టి పెరుగుతూన్న కాలంలో వున్న స్థితి కిప్పుడు కేవల భిన్నాలుగా వున్నాయి. మానవ పరిశ్రమవల్లా, వ్యవసాయంవల్లా, సహజస్థితి నాటి ఫలాలు పెద్దవై రుచికరాలయ్యాయి. అడవిగడ్డి క్రమమైన వరి అయింది. ప్రకృతి సహజ గతిచేతనే ఎన్నో మార్పులు కలుగుతున్న వనటం నిస్సంశయం కాలంలోను, పరిసరాల్లోను కలిగే మార్పులవల్ల, యితర కారణాలవల్ల, ప్రకృతిలో కొత్త జాతి చెట్లు, మొక్కలు, పక్షులు, మృగాలు ఎల్లప్పుడూ సృష్టించబడు తుంటాయి. ఇలా మానవజాతి సృష్టించబడటానికి పూర్వం చెట్లను, మొక్కలను, యితర జంతువులను కొంచెం కొంచెంగా, నెమ్మది నెమ్మదిగా, ప్రకృతి మార్చసాగింది, కాని మానవుడు లోకంలో ప్రవేశించాక, అతడు మార్పులను అతిత్వరగా చెయ్యసాగాడు - ఒక దేశపు జంతు జాతులను, ఉద్భిజ్జజాతులను మరో దేశంలో ప్రవేశపెట్టి, భిన్నజాతి కలయికతో, అంట్లుతొక్కటంచేతా, అనేక విధాలైన కొత్త జాతి మొక్కల, జంతువుల ఉత్పత్తికి అతడు కారకుడయ్యాడు.

ఆదిమదశలో వివాహాలు లేవు కాని కాలక్రమంలో వైవాహిక సంబంధాలు మొదలయ్యాయి ప్రథమంలో అన్ని జాతుల్లో, వివాహ సంబంధం తల్లిమీద ఆధారపడి వుండేది. తండ్రి విషయంలో అంత సుస్థిరత వుండేదికాదు. పిల్లల పేర్లు తల్లినిబట్టే పెట్టేవారు పిల్లలను పెంచవలసినవారు స్త్రీలు కాబట్టి ద్రవ్యమంతా వారిచేతుల్లోనే వుండేది కాలక్రమంలో ద్రవ్యం - స్త్రీజన సమేతంగా - పురుషుల వశమయింది. పురుషు డిలా అనేవాడు ''ఈ ద్రవ్యమంతా, యీ ధాన్యమంతా నాది. నేను వీటిని పొలంలో పండించో, దోచో, యితర విధాల్లోనో సంపాదించాను ఎవరైనా నా హక్కును ఒప్పుకోక వివాదమాడి, అందులో భాగం కోరితే, వాడితో యుద్ధం చేస్తాను '' ఆధునిక వైవాహికాచారానికి యిదే మూలం

పురుషునికి బానిసలు, గృహోపకరణాలు ఎలా స్వంతమైన ఆస్తిగా వున్నాయో స్త్రీలుకూడా అలాగే ఆస్తిగా ఏర్పడ్డారు ఒక తెగకు చెందిన పురుషులు మరో తెగ స్త్రీలను పెళ్లాడటం ప్రాచీనాచారం, అదికూడా స్త్రీలను బలాత్కారంగా లాక్కొనివెళ్లే కాలక్రమంలో పెళ్లికుమార్తెను బలాత్కారంగా లాక్కొనివెళ్లే వాడుక పోయి, యిరుపక్షాలవారి సమ్మతంతో వివాహాలు జరగటం ప్రారంభమయ్యాయి కాని మారిపోయిన ఆచారాలన్నిటికి కొద్దిపాటి జాడలు నిలిచి వుంటాయి. ఇప్పటికీ ప్రతి దేశంలోనూ అలాటి సమయాల్లో పెళ్లికొడుకుపై దౌర్జన్యంగా పడినట్లు అభినయించటం వాడుకలో వుంది. వంగదేశంలోను, యూరప్‌లోను, పెళ్లికొడుకుమీద పిడికిళ్లతో బియ్యాన్ని విసిరి చల్లుతారు. ఉత్తర హిందూస్థానంలో పెళ్లికుమార్తె పక్షంవారు పెళ్లికొడుకు పక్షంవారిని దుర్భాషలాడి నిందిస్తారు.

సమాజం రూపుదాల్చసాగింది. ఒక్కొక్క దేశంలో అది ఒక్కో విధంగా ఏర్పడింది. సముద్ర తీరవాసులు చాలవరకు సముద్రంలో చేపలు పట్టి, సమతలాల్లో నివశించేవారు వ్యవసాయం చేసి, పర్వత ప్రాంతాలవారు గొర్రెమందలు పెంచి, ఎడారుల్లో నివసించేవారు మేకలను, ఒంటెలను కాచి జీవించసాగారు ఇతరులు అరణ్యాల్లో వసించి వేటాడి జీవించసాగారు సమతల నివాసులు వ్యవసాయం నేర్చుకొన్నారు; వారి జీవన సమరం కాస్త తేలికైంది, ఆలోచించటానికి, సంస్కృతి పొందటానికి వారికి తీరిక దొరికింది. అందుచేత వారి నాగరికత క్రమాభివృద్ధి నొందింది, కాని నాగరికత వృద్ధి అయ్యేకొద్దీ వారి దేహాలు దుర్బలత నొందసాగాయి కాలాన్నంతా బయళ్లలోనే గడుపుతూ, మాంసమే ముఖ్యాహారంగా వున్నవారికి, యిళ్లల్లో వుంటూ ధాన్యం, శాకాలు ముఖ్యాహారంగా వున్నవారికి శరీర పాటవ భేదం క్రమంగా అధికమవసాగింది. వేటగాళ్లు, గొర్రెల కాపరులు, చేపలు పట్టేవారు ఆహారం సమృద్ధిగా లభించని కాలాల్లో బందిపోట్లుగాను, ఓడదొంగలుగాను మారి, సమతలవాసులను కొల్లగొట్ట నారంభించారు. సమతలవాసులు ఆత్మరక్షణకై

అసంఖ్యాక కూటాలుగా కలిసిపోసాగారు; ఇలా చిన్న చిన్న రాజ్యాలేర్పడటం ప్రారంభమైంది.

దేవతలు[1] ధాన్యాలను, శాకాలను ఆహారించి జీవించేవారు, నాగరికులు. గ్రామాలు, పట్టణాలు వారి నివాసస్థానాలు. నేత వస్త్రాలు ధరించేవారు. అసురులు కొండల్లోను, గుట్టల్లోను, ఎడారుల్లోను, సముద్ర తీర ప్రాంతాల్లోను నివసించేవారు. అడవి మృగాలను, అడవుల్లోని ఫలమూలాలను, తమ ఆవులకు, గొర్రెలకు బదులుగా దేవతలిచ్చే ధాన్యాలను ఆహారించేవారు. ఆటవిక మృగచర్మాలు ధరించేవారు. దేవతలు దుర్బల దేహాలు కలిగి ప్రయాసకు ఓర్వలేనివారై వుండిరి; అసురు లలాకాక, మాటి మాటికి ఉపవసించటంతో శరీరపాటవం కలిగి, సమస్త విధాలైన ప్రయాసలకోర్చుకొనే శక్తి పూర్తిగా కలిగి వుండిరి.

ఆహారం లోటుపడ్డ కాలాల్లో అసురులు తాము నివసించే కొండల నుండి, సముద్రతీరాలనుండి బయల్దేరి పట్టణాలను, గ్రామాలను కొల్లగొట్టేవారు. ఒక్కోసారి వారు ద్రవ్యంకోసం, ధాన్యంకోసం, దేవతలపై పడి దొమ్మీ చేసేవారు. అలాటి సమయాల్లో దేవతలు అధిక సంఖ్యలో ఐక్యులు కాకుంటే, అసురులచేతిలో చావటం తథ్యం. కాని దేవతలు బుద్ధి బలంలో ఆధిక్యులు కనుక, యుద్ధ యంత్రా లనేక విధాలైనవి కొత్తగా కల్పింపసాగారు. బ్రహ్మాస్త్రం, గరుడాస్త్రం, వైష్ణవాస్త్రం - యీ అద్భుత శక్తివంతాలైన అస్త్రాలన్నీ దేవతలవి అసురులు సామాన్యాయుధాలతో యుద్ధం చేశారు. కాని వారు అమిత బలిష్ఠులు వారు దేవతలను అనేక మార్లు ఓడించారు; ఐనా వారు నాగరికత పొందటానిగ్గాని, వ్యవసాయం నేర్వటానికిగాని, బుద్ధిబలాన్ని పెంపొందించుకోవటానికిగాని ప్రయత్నించ

---

1 'దేవతలు', 'అసురులు' అనే శబ్దాలు యిక్కడ అన్నిచోట్ల గీతలో తెల్పబడిన అర్థంలో - అంటే, దైవీ సంపత్ప్రాబల్యం, ఆసురీసంపత్ప్రాబల్యం వున్న జాతులు అనే అర్థంలో ప్రయోగించబడినాయి (శ్రీమద్భగవద్గీత - 16 వ అధ్యాయం చూడండి

యిచ్చగించలేదు. యుద్ధంలో విజయం సాధించిన అసురులు పరాజితు లైన దేవతలపై స్వర్గాన్ని ఏలటానికి ప్రయత్నించినప్పుడల్లా, దేవతల బుద్ధి బలంచేత, యుక్తిచేత మోసగించబడి, అచిరకాలంలోనే వారి బానిస లయ్యారు. (అలాటి ప్రయత్నం చెయ్యని) తక్కిన వేళల్లో అసురులు కొల్లగొట్టిన తరువాత తమ స్థావరాన్ని చేరుకొంటారు. దేవతలు తమలో తాము ఐకమత్యం సాధించుకొన్నప్పుడల్లా, అసురులను బలాత్కారంగా పర్వతాలలోకిగాని, అరణ్యాలలోకిగాని, సముద్రతీరానికిగాని తరిమివేసే వారు కాలక్రమంలో రెండు వర్గాలవారి సంఖ్య, బలం అభివృద్ధి పొందాయి. దేవతలు లక్షలకొద్దీ ఒకటిగా చేరారు. అలాగే అసురులూ లక్షలకొద్దీ ఒకటైనారు. తీవ్ర సంఘర్షణలు, యుద్ధాలు జరిగాయి. దానితో పాటు యిరుబలాలు పరస్పర సమ్మేళనం చెందటంకూడా జరిగింది.

ఈ విభిన్న ప్రకృతులు జాతులు మిశ్రణమొందటంతో, మన ఆధునిక సమాజాలు, మర్యాదలు, ఆచారాలు రూపొంద నారంభిం చాయి. నూతన భావాలుత్పన్నాలై కొత్త శాస్త్రాల అధ్యయనం ప్రారంభ మైంది. ఒక వర్గంవారు చేతి పరిశ్రమచేతనో, బుద్ధి పరిశ్రమచేతనో, ఉప యోగకరాలు, సుఖసాధకాలు ఐన వస్తువులను రూపొందించసాగారు. మరో వర్గంవారు వారిని పరుల ఉపద్రవంనుండి రక్షించే భారాన్ని పూనారు అందరూ యీ వస్తువులను మార్చుకో నారంభించారు. ఎంతో యుక్తిమంతులైన కొందరు గడుసరులు యీ వస్తువుల నొకచోటు నుండి మరోచోటుకి తీసుకునివెళ్లే కార్యాన్ని వహించి, దీనికి ప్రతిఫలమనే పేర లాభంలో అధికభాగాన్ని అపహరించసాగారు. ఒకడు భూమిని దున్నుతాడు, రెండవవాడు 'ఫలసాయం' చోరగ్రస్తం కాకుండా కాపాడుతాడు, మూడవవాడు దాన్ని యితర ప్రాంతాలకు తీసుకెళతాడు. నాలుగవవాడు దాన్ని కొంటాడు వ్యవసాయం చేసి పంట పండించినవాడికి యించుమించుగా ఏమీ లభించేదికాదు, పంటను దొంగ లపహరించ కుండా కాపాడినవాడు దాన్లో సాధ్యమైనంత భాగం బలాత్కారంగా గుంజు

కొంటాడు; దాన్ని అమ్మకానికి తెచ్చిన వర్తకుడు అత్యధిక భాగాన్ని పొందు తాడు; కొనుగోలు చేసేవాడు అపరిమితమైన ఖర్చు భరించి, ఆ భారంతో తీవ్రంగా కుంగిపోతాడు. కాపాడేవాడికి రాజు పేరు సిద్ధించింది. వస్తువు లను స్థలాంతరాలకు కొనిపోయేవాడికి వర్తకుడనే పేరు వచ్చింది ఈ యిద్దరూ పంటను పండించినవారే కాదు - కాని వస్తువుల్లో అధిక భాగం లాక్కొని, రైతు పరిశ్రమఫలాన్ని చాలవరకు అపహరించి ధనవం తులయ్యారు. వీటి నన్నింటిని పండించిన నిర్భాగ్యుడు అనేకసార్లు పస్తు లుండి, సహాయంకోసం భవవంతుణ్ణి ప్రార్థించవలసిన వాడయ్యాడు.

కాలం గడిచేకొద్దీ, యీ విషయాలన్నీ మరింత చిక్కుపడి, అత్యంత క్లిష్టమైనాయి. ఈ అభేద్యజాలాకృతినుండి మన ఆధునిక మిశ్రిత సంఘం రూపొందింది. కాని గతకాల విశేష చిహ్నాలు పూర్తిగా అంతరించక ఏ కొంచెంగానో నిలిచి వుంటుంది. పూర్వజన్మల్లో గొర్రెలుకాచో, చేపలు పట్టో, యిలాటి యితర వృత్తు లవలంబించో జీవించినవారు తమ నాగరిక జన్మలోకూడా ఓడ దోపిళ్లను, బందిపోట్లను, యిలాటి యితర వృత్తు లను అవలంబించారు. వేటాడ అరణ్యాలులేక, గొర్రెమందలను మేప టానికి గుట్టలుగాని, కొండలుగాని సమీపంలోలేక, నాగరిక సమాజం జన్మించిన యాదృచ్ఛిక సంఘటనవల్ల, వేటాడే, చేపలుపట్టే, పశువులు మేపే అవకాశాలులేక, పూర్వసంస్కార ప్రాబల్యంచేత అతడు దోచటానికో, దొంగిలించటానికో ప్రారంభిస్తాడు అతడికి మార్గాంతరం ఏంవుంది? అలాగే పౌరాణికయుగంలో జన్మించి, చిరతర ఖ్యాతి నార్జించి, మనకు నిత్యస్మరణీయ నామాలున్న స్త్రీరత్నాల[1] యోగ్య వంశీయ బాలి కలు, అనేకమంది భర్తలను పెళ్లాడగోరినా సాధ్యంకాకపోవటంతో పతిత లుగా మారారు. ఇలాగా, యితర విధాలుగాను వేర్వేరు రీతుల వేర్వేరు స్వభావాలవారు, నాగరికులు, అనాగరికులు, దైవీసంపత్ప్రాబల్యం కలిగి, ఆసుర సంపత్ప్రాబల్యం కలిగి జన్మించినవారు సంకరులై ఆధునిక

1 అహల్య, తార, మండోదరి, కుంతి, ద్రౌపది

సమాజంగా ఏర్పడ్డారు. కాబట్టే ప్రతి సమాజంలోను భగవంతుడు అనేక రూపాలతో - సాధునారాయణుడు, చోరనారాయణుడు మొదలైన అనేక రూపాలతో - క్రీడించటం మనకు ప్రస్తుతం కనిపిస్తోంది. అంతేగాక, యిప్పుడు ఏ సమాజం ఎలాటి స్వభావంవుండి జన్మించిందా అని నిర్ణ యించవలసి వచ్చినప్పుడు, ఆ సమాజంలో దైవీస్వభావం వున్నవారెక్కు-వగా వున్నారా, ఆసుర స్వభావులు ఎక్కు-వగా వున్నారా అని చూసి నిర్ణయించాల్సి వచ్చింది.

ఆసియా ఖండ నాగరికత సమస్తం గొప్ప నదుల - గంగ, యాంగ్ట్సి కియాంగ్, యుఫ్రెటిస్ - వెంటనుండే సారవంతాలైన మైదానాల్లో ప్రథమంలో వికాసమందాయి. ఈ నాగరికతల కన్నిటికి ముందు వ్యవ సాయమే మూలం. అక్కడి వారందరిలోను దైవీప్రకృతి ప్రాబల్యం వుంటుంది ఇక యూరప్ ఖండ నాగరికత అంటే అందులో అధికభాగం పర్వతమయ దేశాల్లోనో, సముద్రతీర ప్రాంతాల్లోనో వెలసింది. సముద్రం మీద చేసే దోపిళ్లు, బందిపోట్లు దీనికి మూలం; అక్కడ ప్రకృతి ప్రాబల్యం వుంది. మధ్య ఆసియాఖండం, అరేబియాదేశ ఎడారులు, అసురుల ఉనికిపట్లని యీ ఆధునికయుగంలో మనం వూహించవచ్చును. ఆ రక్షణ స్థలాలనుండి అసురవంశంలో జన్మించిన యీ గొర్రెల కాపర్లు, వేటగాళ్లు, తండోపతండాలుగా వచ్చి, ఒకట్రై నాగరికులైన దేవతలను వెన్నంటి తరిమి, వారు చెల్లాచెదర్రై ప్రపంచ మంతటా వ్యాపించేటట్లు చేశారు

యూరప్‌ఖండంలో ఆదిమవాసులైన ప్రాచీనజాతి ఒకటి వుండే దనటంలో సందేహం లేదు. కొండగుహలు వారి నివాసస్థానం. వారిలో సూక్ష్మతర బుద్ధిగలవారు నీళ్లలో కాస్త మెరకగా వుండేచోట్ల కర్రలుపాతి వాటిపై అరుగులను, ఆ అరుగులమీద యిళ్లను కట్టుకొన్నారు. చెకుముకి రాయితో వారు బాణాలను, ఈటె తలలను, కత్తులను, గొడ్డళ్లను చేసి, వాటితో తమ పనులను నిర్వర్తించుకొనేవారు.

ఆసియాఖండంలోని జాతులు క్రమక్రమంగా యూరప్‌లో చొర నారంభించాయి. ఫలితంగా యూరప్‌లో కొన్ని ప్రాంతాలు తక్కిన వాటి కంటె ఎక్కువ నాగరికమైనాయి; రష్యాలో కొందరి భాష దక్షిణ ఇండియా భాషలను పోలి వుంటుంది.

కాని యీ మోటువారిలో అధికులు పూర్వం మాదిరి మోటుగానే వుండిపోయారు ఇలా వుండగా ఆసియా మైనర్‌లోని ఒక నాగరిక జాతి యూరప్‌లో తమకు చేరువలోని కొన్ని ప్రాంతాలను జయించి పరిణత మైన ఒక నూతన నాగరికతను అక్కడ ప్రవేశపెట్టింది వారిని మనం యవనులంటాం, యూరోపియన్లు వారిని గ్రీకులంటారు

అనంతరకాలంలో ఇటలీలోని ఒక మొరటు జాతివారు (రోమన్లు) నాగరికులైన ఎట్రుస్కనులను జయించి వారి సంస్కృతిని, పాండిత్యాన్ని అలవరచుకొని, ఆ పరాజితజాతి జీర్ణ నాగరికతా స్థానంలో తమ నాగరి కతను నెలకొల్పారు. క్రమేణా రోమన్లు తమ విజయాలను అన్ని దిక్కులకు వ్యాపింపచేశారు; యూరప్ నైరుతి ప్రాంతంలోని మొరటు జాతులన్నీ రోమ్ ఆధిపత్యం కిందికి వచ్చాయి; ఉత్తర ప్రాంతాల్లో నివ సిస్తూన్న అనాగరిక ఆటవికులు మాత్రం తమ స్వాతంత్ర్యాన్ని నిలుపు కొన్నారు. కాని కాలం గడిచేకొద్దీ, రోమన్లు ద్రవ్యభోగదాస్యాల్లో చిక్కి తమ బలాన్ని కోల్పోయారు. ఆ సమయంలోనే ఆసియా ఖండం తన అసుర దళాలను యూరప్‌మీదికి విచ్చలవిడిగా నడిపించింది. రోమన్లు యీ అసురధాటితో తమ నివాసస్థానాలనుండీ తరుమగొట్టబడ్డ సమయంలో, ఉత్తర యూరప్‌లోని అనాగరిక జనానీకాలు రోమన్ సామ్రాజ్యం మీదపడి రోమ్‌ను నాశనం చేశాయి. ఆసియా దేశ దండ యాత్రాబల మెదుర్కొన్నప్పుడు, యూరప్ అనాగరిక జాతి, రోమన్, గ్రీకు జాతుల్లో మిగిలినవారు మిశ్రమమవటంతో ఒక కొత్త జాతి ఉత్పన్నమైంది. అదే కాలంలో యూదులు రోమన్లచే జయింపబడి తమ స్థావరాలనుండి తరిమివెయ్యబడి యూరప్‌ఖండం నాలుగు చెరుగులా

చెదరిపోయాయి. వారితోకూడా వారి కొత్త మతం - క్రైస్తవ మతం - కూడా యూరప్ అన్నిప్రాంతాల్లో వ్యాపించింది. ఈ వివిధ జాతులు, వారి మతాలు, భావాలు, యీ వివిధాసుర జనానీకాలు, నిరంతర కలహ సంగ్రామాగ్నిచే తప్తమై, మహామయ మూసలో కరిగి ఒకటి కాసాగింది. ఆ మిశ్రమ ఫలంగా ఆధునిక యూరోపియన్ జాతి ఉద్భవించింది.

ఇలా ఒక అనాగరిక - బహు అనాగరిక - యూరోపియన్ జాతి- హిందువుల నీలిమం మొదలు ఔత్తరాహుల క్షీరధవళ వర్ణం వరకు సూక్ష్మబేదాలతో అనేక వర్ణాలవారు - నల్లనివి, గోధుమ రంగువి, ఎర్రనివి ఐన వెంట్రుకలతోను, నల్లనివి, బూడిదరంగువి, నీలవర్ణంవి ఐన కళ్లతోను, హిందువుల చక్కని రూపురేఖలున్న ముఖాన్ని, ముక్కును, కళ్లను, లేక చైనావారి చదునుముఖాన్ని కలిగి ఏర్పడింది. కొంతకాలందాకా వారొకరితో ఒకరు యుద్ధాలు చేస్తూండిరి; ఔత్తరాహులు సముద్ర దొంగలుగా జీవిస్తూ, తమకంటె నాగరికులైన జాతులను హింసించి, చంపుతూ వచ్చారు. ఈలోపు క్రైస్తవమతాధ్యక్షు లిద్దరూ - ఇటలీలోని ''పోపు'' (ఫ్రాన్స్, ఇటలీల ఉచ్చారణలో పాప్), కాన్స్టాంటినోపిల్‌లోని ''పేట్రియార్క్'' ఉపాయ సహాయంతో ప్రవేశించి యీ మృగప్రాయులైన మూకలమీద, వారి రాజు రాణులమీద, ప్రజలమీద తమ అధికారాన్ని చలాయించ నారంభించారు.

మరోవైపు అరేబియా ఎడారుల్లో మహమ్మదీయ మతం ఆవిర్భవించింది. అనాగరికులైన అరబ్బులు, ఒక సిద్ధపురుషవరేణ్యుని బోధలచే ఉద్దీపితులై, దుర్వార బలవీర్యాలతో లోకంమీద హఠాత్తుగా విరుచుకుపడ్డారు. మహా వేగవంతమైన ఆ వాహిని అప్రతిహతశక్తితో తూర్పునుండి, పడమర నుండి యూరప్‌లో ప్రవేశించింది ఆ ఉప్పెనతోపాటు హిందూదేశ, ప్రాచీన గ్రీసుదేశ విద్యాసంస్కృతులు యూరప్ ఖండంలో ప్రవేశించాయి.

మధ్య ఆసియాలోని 'సేల్‌జుక్' తార్తారులనే పేరుగల ఒక అసుర జాతి, మహమ్మదీయ మతాన్ని అవలంబించి ఆసియా మైనరును, - ఆసియాలోని యితర దేశాలను జయించింది. అరబ్బులు హిందూ

దేశాన్ని వశపరచుకోవటానికి ఎన్నోసార్లు ప్రయత్నించి విఫలులైనారు లోకాన్నంతా మింగేసినమహమ్మదీయ తీవ్రకల్లోలం హిందూదేశం ముందు వెనక్కు తగ్గవలసి వచ్చింది. సింధురాష్ట్రాన్ని వారొకసారి వశ పరచుకో చూశారు కాని అది సాధ్యపడలేదు, తిరిగి వా రా ప్రయత్నం చెయ్యలేదు.

కాని కొన్ని శతాబ్దాలు గడిచాక టర్కులు, యితర తార్తారు జాతులు, బౌద్ధమతంనుండి మహమ్మదీయ మతంలో చేరాక, హిందు వులను, పర్షియన్లను, అరబ్బులను అందరిని తమ ఆధిపత్యంలోకి తెచ్చుకొన్నారు. భారతదేశాన్ని జయించిన మహమ్మదీయుల్లో ఒక్కడైనా అరబ్ జాతివాడుగాని, పర్షియా జాతివాడుగాని లేడు; అందరూ టర్కులో, తార్తారులో. రాజపుత్ర స్థానంలో మహమ్మదీయ దండ యాత్రలు గావించిన వారందరిని టర్కు లంటారు అది యథార్థమైన చారిత్రక సత్యం రాజపుత్రస్థాన 'చారణులు', ''తురుగాంకో, బఢీ జోరే'' (తురుష్కులు అమిత బలాఢ్యులు) అని పాడేవారు. అది నిజంకూడా. కుతుబుద్దీన్ మొదలు మొగలాయి చక్రవర్తులదాకా అందరూ తార్తారులే. ధిబెట్ దేశస్థులు వారూ ఒక జాతివారే, కాని వారు మహమ్మదీయ మతాన్నవలంబించి, హిందువులతోను, పర్షియన్లతోను వివాహ సంబంధాలు నెరపినందున వారి ముఖాలు చదునుగా, గుండ్రంగా వుండక మారిపోయాయి వారు పూర్వపు అసుర జాతుల్లోనివారే. నేడూ వారు కాబూలు, పర్షియా, అరేబియా, కాన్స్టాంటినోపిల్ సింహాసనాల నాక్రమించి రాజ్యం చేస్తున్నారు. గాంధారులు (ఖాందహార్‌వారు), పర్షియన్లు యిప్పటికీ టర్కీవారి బానిసలుగానే వున్నారు. చైనా విశాల సామ్రాజ్యంకూడా మంచూరియా దేశ తార్తారుల పాదాక్రాంతమై వుంది. కాని యీ మంచూరియావారు తమ మతాన్ని విడిచి మహమ్మ దీయులు కాలేదు. వారు ''గ్రాండ్ లామా'' అనుచరులు. ఈ అసురులు విద్యార్జనకుగాని, బుద్ధిని పెంపొందించుకోవటానికిగాని కృషిచెయ్యరు; వా రెరిగింది యుద్ధం చెయ్యటం ఒక్కటే. ఆ రక్తం కొంత కలవకపోతే

యుద్ధం చెయ్యాలనే బుద్ధికలగటం అసాధ్యం, ఆ తార్తారు రక్తమే యూరప్ ఉత్తర ప్రాంతాల్లోని వారిలో - అందులోను ముప్పాతికవంతు తార్తారు రక్తంగలవారైన రష్యా దేశస్థుల్లో ఎక్కువగా - పరాక్రమోపేత సమరోత్సాహ రూపంలో కనిపిస్తోంది. ఈ దేవాసుర యుద్ధం యింకా చాలకాలం కొనసాగుతుంది దేవతలు అసుర కన్యలను వివాహమాడతారు; అసురులు దేవకన్యలను రాక్షసవిధానంలో ఎత్తుకొనిపోతారు. ఇందువల్లే బలోదగ్రాలైన సంకరజాతు లేర్పడుతున్నాయి.

అరేబియన్ల గొప్ప మతగురువైన ''కాలిఫ్'' సింహాసనాన్ని తార్తారులు కైవసం చేసుకొన్నారు; క్రైస్తవులకు ముఖ్య తీర్థయాత్రాస్థలమైన జెరూసలెంను, యితర స్థలాలను ఆక్రమించి, 'పావన సమాధి'ని దర్శించబోయేవారిని నిరోధించి, క్రైస్తవుల ననేకమందిని చంపేశారు. క్రైస్తవ చర్చ్‌ల అధ్యక్షులు కోపావేశులై యూరప్ అంతట్లావున్న తమ అనాగరికానుచరులను రెచ్చగొట్టారు. ఆ అనుచరులు రాజులను, ప్రజలను ఉద్రేకోన్మత్తుల గావించారు యూరప్ దేశాల అనాగరిక జనానీకాలు జెరూసెలెంను క్రైస్తవమత విరోధులైన తార్తారుల చేతినుండి విముక్త మొనర్చటానికి ఆసియా మైనర్‌మీది కురికారు. ఇందులో అనేకులు ఒకరి గొంతుల నొకరు కోసుకొన్నారు తక్కిన వారిని మహమ్మదీయులు రూపుమాపారు. కాని ఆ అనాగరిక జనం కోపం అప్పటికే ప్రజ్వలించింది. మహమ్మదీయులు వారిని కూల్చివెయ్యగానే, అనాగరికులకు ఆటవికులకు సహజమైన మొండిపట్టుదలతో కొత్తవారు తిరిగి అసంఖ్యాకులై వచ్చారు తమ వారిని దోచటంకూడా వారికి తప్పుగా తోచేదికాదు. అంతకంటె మంచి ఆహారం దొరకనప్పుడు మహమ్మదీయులను భక్షించటానికి వారు వెనుదియ్యలేదు ఇంగ్లీషురాజు రిచర్డ్‌కు మహమ్మదీయ మాంసం పట్ల అభిరుచి వుండటం సుప్రసిద్ధం కదా.

మృగప్రాయులకు, నాగరికులకు యుద్ధాలు జరిగేటప్పుడు సాధారణంగా కలిగే ఫలమే యిప్పుడూ కలిగింది జెరూసెలెం, తక్కిన

ప్రాంతాలు జయించబడలేదు; కాని యూరప్ నాగరికత పెంపొంద సాగింది. మృగచర్మాలు ధరించి, పచ్చిమాంసం తింటూన్న ఇంగ్లీషు వారు, ఫ్రెంచ్‌వారు, జర్మన్లు, యితర మృగప్రాయ జాతులు ఆసియాదేశ నాగరికతతో సంపర్కాన్ని పొందగలిగారు. ఇటలీలోను యితర దేశాల్లోను వున్న ఒక తెగ క్రైస్తవ యుద్ధభటులు - మన 'నాగా' జాతిని పోలినవారు - వేదాంతాన్ని అభ్యసించ నారంభించారు. వారిలో 'నైట్స్ టెంప్లార్స్' అనే శాఖవారొకరు అద్వైత వేదాంతంలో సుప్రతిష్ఠులై క్రీస్తుమతాన్ని చివరకు పరిహసించసాగారు. వారు అపారంగా ధనార్జన చేశారు కాబట్టి యూరప్ దేశాల రాజులు - 'పోప్' వుత్తర్వు ప్రకారం - మతాన్ని సంరక్షించే నెపంతో వారిని నిర్మూలించేశారు.

రెండో వైపున ఒక మహమ్మదీయ జాతి - 'మూరు'లనే పేరుగల వారు - స్పెయిన్‌లో ఒక నాగరిక రాజ్యాన్ని స్థాపించి, అనేక విద్య లభ్యసించి, యూరప్‌లో మొదటి విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పారు. అన్ని దేశాలనుండి - ఇటలీ, ఫ్రాన్స్, దూరంలోని ఇంగ్లండు నుండికూడా విద్యార్థులు గుంపులు గుంపులుగా అక్కడికొచ్చి చేరారు రాజ కుటుంబాలనుండి బాలురు గౌరవ ప్రవర్తనాన్ని, ఔచితిని, సభ్యతను, యుద్ధ విద్యను నేర్వటానికి రాసాగారు గృహాలు, దేవాలయాలు, భవనాలు, శిల్పకళా ప్రదర్శక నిర్మాణాలు, ఒక వినూతన రీతిలో కట్టటం ప్రారంభమైంది.

కాని క్రమక్రమంగా యూరప్ ఖండమంతా అతివిస్తృతమైన స్కంధావారంగా మార్చబడింది, ఇప్పటికీ దాని స్థితి అదే. మహమ్మదీయులు ఏ రాజ్యాన్నైనా ఆక్రమించినప్పుడు వారి సుల్తాను అందులో అధికభాగాన్ని తానుంచుకొని, మిగిలిన భాగాన్ని తన సేనానుల కందరికీ పంచి యిస్తాడు ఈ సేనానులు ఎలాటి పన్నులు చెల్లించ పనిలేదు కాని అవసరమైనప్పుడు సుల్తానుకు ఒక నియమిత సంఖ్యలో యుద్ధభటులను సరఫరా చెయ్యాలి. ఎప్పుడూ ఒక సైన్యాన్ని సిద్ధంగా వుంచుకొనే భారం పోవటమేగాక

యుద్ధావసరాల్లో మాత్రం పనిచేసే ఒక ప్రబల సైన్యం ఏర్పాటైంది. ఇదే భావం కొంతదాకా యిప్పటికీ రాజపుత్రస్థానంలో నెలకొనివుంది. మహమ్మదీయులు దీన్ని పాశ్చాత్య దేశాలకు తీసుకెళ్లారు. యూరప్ దేశస్థులు దీన్ని మహమ్మదీయుల వద్ద గ్రైకొన్నారు. కాని మహమ్మదీయ పద్ధతి ప్రకారం రాజు, అతడి పాలెగాండ్రు, వారి సైన్యాలు ఒక పక్షంలో వుండి తక్కినవారు - ప్రజలు, సామాన్య జనులు - యుద్ధవేళల్లో బాధింపబడకుండేవారు; కాని యూరప్‌లో యిలాకాక రాజు, అతడి పాలెగాండ్రు, ఒక పక్షంలో వుండి, ప్రజా సమూహాన్నంతా తమ బానిసలుగా చేసుకొంటూండిరి. ప్రతివాడూ ఒక యుద్ధవీరుడైన పాలెగాని ఆశ్రయించుకొని బతకాలి, అతడి అనుచరుడై వుండాలి, అలా వుంటేగాని అతణ్ణి బతకనివ్వరు, అతడెప్పుడూ - ఆజ్ఞకాగానే - యుద్ధానికి తయారైవుండాలి.

యూరప్ దేశస్థులు అంతగా గర్వించే తమ ''అనాగరికతా పురోగమనం'' అనే మాటకు అర్థం ఏమిటి? అక్రమమార్గం తొక్కి - అది క్రమమార్గమని వాదించటం, - ఇష్టార్థాన్ని జయప్రదంగా సాధించి, అవలంబించిన మార్గం సక్రమమైన దనటానికి ఫలసిద్ధే నిదర్శనమని భావించటం! ఈ ''నాగరికతా పురోగమనం''లో దొంగతనం, బొంకులాడటం, ఉరితియ్యటం కొన్ని సందర్భాల్లో యోగ్యమైన పనులవుతాయి; తన వెంటవచ్చిన మహమ్మదీయసంరక్షకులు - ఆకలితో - కొన్ని రొట్టె ముక్కలు దొంగిలించినందుకు స్టాన్లీ వారిని కొరడాతో కొట్టటాన్ని నిర్దోష క్రియగా చేస్తుంది; యూరోపియన్ల ప్రఖ్యాత నీతిసూత్రమైన ''నువ్విక్కడనుండి వెళ్లిపో, నేను వచ్చి ఆ చోటు నాక్రమించుకోవాలి'' అనేదాన్ని అది సమర్థిస్తుంది, సమర్థించటమేగాక దాన్ని నేర్పిస్తుంది. దీనికి చారిత్రకసాక్ష్యమే వుంది· యూరోపియన్లు ఎక్కడ కెళ్లినా, అక్కడి ఆదిమజాతులు నిర్మూలమౌతున్నాయి కదా! ఈ ''నాగరికతా పురోగమనంలో'' వైవాహిక నీతి ద్రోహాన్ని లండన్‌లోను, ఆలుబిడ్డలను

నిరాధారంగా విడిచిపెట్టి పారిపోయి ఆత్మహత్య చేసుకోవటాన్ని 'ప-రీ' లోను నేరంగా కాక, పొరపాటుగా ఎంచుతారు!

ఇస్లాం (మహమ్మదీయ) నాగరికత మొదటి మూడు శతాబ్దాల్లో పొందిన శీఘ్రవ్యాప్తిని అదే కాలంలో క్రీస్తుమతం వున్న స్థితితో పోల్చి చూడండి. క్రీస్తుమతం పుట్టిన మొదటి మూడు శతాబ్దాల్లో లోకం ఎరిగే శక్తినికూడా పొందలేకపోయింది, కాన్స్టెంటైన ఖడ్గం అతడి రాజ్యంలో దాని కొక స్థానం కల్పించిన నాటినుండి ఆ మతం పారమార్థిక నాగరికతగాని, లౌకిక నాగరికతగాని వ్యాపించటానికి ఎలా తోడ్పడింది? భూమి చుట్టు తిరుగుతుండే స్వభావం గలదనే సూత్రాన్ని ప్రప్రధమంలో స్థాపించ పూనిన యూరపియన్ విద్వాంసుడికి ఆ మతం ఏం బహుమానం యిచ్చింది? క్రైస్తవమత వ్యవస్థ వైజ్ఞానిక శాస్త్రజ్ఞుడెవరినైనా ఎన్నడైనా ఆమోదంతో, ఉత్సాహంతో సత్కరించిందా? క్రైస్తవమత గురువులు తమ కాపుదలలో వుండే ప్రజలకు అందచేసే పుస్తకావళి, వారికి అవసరమై వుండేంత దేశ శాసన జ్ఞానాన్ని - ద్రవ్య వివాదాలకు, అపరాధ విచారణలకు, విద్యా వాణిజ్య విషయక రాజ్యనీతికి సంబంధించిన దాన్ని - సమకూర్చగలిగి వుంటుందా? నేటికీ 'చర్చి' వ్యవస్థ పవిత్రాలు కాని గ్రంధాల వ్యాప్తిని అనుమతించదు. ఆధునిక విద్యలను, వైజ్ఞానిక శాస్త్రాలను కూలంకషంగా చదివినవారు - ఇలా ఐనా - త్రికరణశుద్ధిగా క్రైస్తవమతాన్ని అభ్యసించటం సాధ్యమా? బైబిల్‌లోని క్రొత్త నిబంధనలో (న్యూ టెస్టమెంట్) విద్యలను గురించి, విజ్ఞాన శాస్త్రాలను గురించి ప్రత్యక్ష లేక పరోక్ష ప్రసంశ లేనేలేదు. కాని కురాన్‌లోను, మహమ్మద్ ప్రవచన గ్రంధమైన హడిస్‌లోను అనేక ఘట్టాల్లో, ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ఆమోదించబడినట్టి, ప్రోత్సహించబడినట్టి వైజ్ఞానికశాస్త్రం గాని, విద్యగాని లేనేలేదని చెప్పవచ్చును వాల్టేర్, డార్విన్, బూష్నర్, ఫ్లామా రియన్, విక్టర్ హ్యూగో మొదలైన అనేకులు - యూరప్‌లోని సమగ్ర చింతనాపరులైన మహనీయులు - యీ కాలంలో క్రైస్తవమతంచే

అధిక్షేపింపబడుతూ, నైష్ఠిక క్రైస్తవ జనానీక దూషణాలకు గురౌతున్నారు. ఇస్లాంమతం యిలాకాక అలాటివారు ఆస్తికులేనని, మహమ్మదులో విశ్వాసం లేనివారని ఎన్నుతుంది. ఈ రెండు మతాల్లో ఏది ఉపకారకం, ఏది పురోభివృద్ధి నిరోధకం అనే విషయాన్ని గురించి సమగ్రంగా విచారణ జరుగుగాక. అలాటి విచారణలో ఇస్లాం ఎక్కడ ప్రవేశించినా, ఆదిమ వాసులను వుండనిచ్చి కాపాడిందనీ, ఆ జాతులు నేటికీ వున్నాయనీ, వారి భాష, వారి జాతీయత నేటికీ సురక్షితంగా వుందనీ తెలుస్తుంది.

అలాటి సత్కార్యాన్ని తానెక్కడైనా సాధించినట్లు క్రీస్తుమతం చూపగలదా? స్పెయిన్‌లోని అరబ్బులు, అమెరికాలోని ఆదిమవాసులు నే డెక్కడున్నారు? యూరప్‌లోని యూదులను క్రైస్తవు లెలా ఆద రిస్తున్నారు? యూరప్‌లో జరిగే ఏ కార్యంగాని బైబిల్ బోధలకు అనుకూలించేవి లేవు యూరప్ పురోగమనంలో ఎన్ని రకాల ఔన్నత్యాన్ని సాధించినా, అందులో ప్రతీది క్రీస్తుమతం మీద తిరుగుబాటు చేతనే - బైబిల్‌కు విరుద్ధంగా ప్రవర్తించటంచేతనే సాధించబడింది. క్రీస్తుమతం మునుపటి మాదిరి నేడూ యూరప్‌లో నిరంకుశాధికారం కలిగివుంటే పాశ్చర్ క్యాహ్ మొదలైన ఆధునిక విజ్ఞాన శాస్త్రవేత్తలను ఇన్క్విజిషన్[1] అగ్నికి ఆహుతి చేసి వుండేది. డార్విన్‌ను, అతడి సిద్ధాంతాల కనుకూలు రను స్తంభాలకు కట్టి నిలువునా తగలబెట్టి వుండేది. ఆధునిక యూరప్‌లో క్రీస్తుమతం, నాగరికత పరస్పర భిన్నవిషయాలు నాగరికత యిప్పుడు తన ప్రాచీన శత్రువైన క్రైస్తవమతాన్ని రూపుమాపటానికి, మతాచార్యులను పతనమొందించటానికి, వారి చేతిలోనుండి విద్యాలయా లను, ధర్మసంస్థలను లాక్కోటానికి నడుంకట్టుకొని వుంది కేవల మూఢులైన గ్రామీణ ప్రజలు లేకపోతే, క్రీస్తుమతం - ఇప్పటి అప్రతిష్ఠ స్థితిలో - ఒక్క క్షణమైనా నిలబడి వుండలేక, సమూలంగా పెరికివెయ్య

1 స్వమత విరుద్ధవాదులను విచారించే మతాధికార న్యాయస్థానం ఇందు అపరాధులు అగ్నికి ఆహుతి చెయ్యబడటం వాడుక

బడేది పట్టణవాసులైన బీదలు యిప్పుడూ క్రీస్తుమత వ్యవస్థకు వైరులే! ఇప్పుడు క్రీస్తుమతాన్ని ఇస్లాం మతంతో పోల్చిచూడండి. మహమ్మదీయ దేశాల్లో విధులన్నీ ఇస్లాంమతంలో సుస్థాపితాలై వుంటాయి. ప్రభుత్వో ద్యోగు లందరూ మతగురువులను అపారభక్తితో ఆదరిస్తారు; ఇతర మత బోధకులుకూడా గౌరవింపబడతారు.

యూరపుఖండ నాగరికతను యీ క్రింది వస్తువులతో నేయబడ్డ వస్త్రంతో పోల్చవచ్చును. దాని మగ్గం - సముద్రతీరంలో వుండే ఒక విశాల, సమశీతోష్ణస్థితిగల, పర్వతమయమైన దేశం. దాని ప్రత్తి: నానా జాతుల మిశ్రణంచే ఏర్పడ్డ బలిష్ఠం, పరాక్రమవంతం ఐన ఒక సంకర జాతి దాని పడుగు (నిలువు నూలు): ఆత్మసంరక్షణార్థం, స్వమత సంరక్షణార్థం చేసే యుద్ధం ఖడ్గధారి ఐనవాడు ఉన్నతుడవుతాడు; ఖడ్గాన్ని ధరింపజాలనివాడు తన స్వాతంత్ర్యాన్ని కోల్పోయి, ఒక వీరుని ఖడ్గ సంరక్షణంలో జీవిస్తాడు దాని పేక (అడ్డనూలు): వాణిజ్యం. ఆ నాగరికత ప్రయోగించే సాధనం: ఖడ్గం తత్సాహాయకాలు బలధైర్యాలు. దాని లక్ష్యం. ఇహపర సుఖానుభవం

ఇక మన సంగతి ఎలా వుంది? ఆర్యులు శాంతిప్రియులు, భూమి దున్నుకొని వ్యవసాయం చేసేవారు, ఎవరివల్లా ఏ తొందరాలేక తమ కుటుంబాలను పోషించుకో గలిగితే వారికి చాలు అంతమాత్రానికే వారు సుఖులై తృప్తులవుతారు అలాటి జీవితంలో వారికి -కావలసినంత తీరిక వుంటుంది విషయ విచారానికీ, నాగరిక జీవనానికి కావలసినంత అవకాశం వుంటుంది. మన జనక చక్రవర్తి స్వహస్తాలతో భూమిని దున్నే వాడు - తన కాలంలోని తత్త్వజ్ఞు లందరిలో శ్రేష్ఠుడూ ఆయనే మనలో ఋషులు, మునులు, యోగులు మొదటినుండి ఉద్భవిస్తూనే వున్నారు, వారికి మొదటినుండి ప్రపంచం వట్టి భ్రమ అని తెలుసు ఎంత కొల్ల గొట్టినా, ఎంత కలహించినా, నువ్వు కోరే సుఖానుభూతి శాంతిలోనే లభిస్తుంది - భౌతిక సుఖపరిత్యాగంలోనే ఆ శాంతి లభిస్తుంది.

భౌతిక వికాసం ఎంత అధికమైనా అది సుఖాన్ని యివ్వలేదు. మనోబుద్ధుల సంస్కృతే సుఖాన్నిస్తుంది. అడవులను చక్కబరచి వ్యవసాయయోగ్యంగా చేసింది వారే.

అడవిని నరికి బాగుపరచిన స్థలంలో వారు వేదనిర్దిష్ట హోమవేదికను నిర్మించేవారు భారతదేశ నిర్మలాకాశంలో యజ్ఞాల పవిత్ర ధూమం ఎగయుచుండేది, శాంతి వెలసే ఆ వాతావరణంలో, వేదమంత్రాలు ప్రతిధ్వనించి, పునఃప్రతిధ్వనుల నీనుచుండేవి. - పశువులు యితర మృగాలు అపాయ భయంలేక పచ్చిక మేసేవి. ఖడ్గస్థానం విద్యాధర్మాల పాదాలవద్ద అని నిర్ణయించబడింది. ధర్మాన్ని సంరక్షించటానికి, మానవుల, పశువుల ప్రాణాలకు హాని కలుగకుండా చూడటమే దాని పని. బలహీనులను అపాయంనుండి రక్షించే వీరుడు - క్షత్రియుడు. నాగటికి ఖడ్గానికి ఏలికై ధర్మం - సర్వ సంరక్షకం - నిలిచి వుంది. ఆయన రాజరాజు: లోకం నిద్రించేటప్పుడుకూడా ఆయన నిరంతర జాగరూకుడై వుంటాడు. ధర్మసంరక్షణలో ప్రతివాడికీ స్వాతంత్ర్యం వుండేది.

''ఆర్యులు ఏ పరదేశంనుండో హఠాత్తుగా వచ్చిపడి ఆదిమవాసుల భూములను లాక్కొని, వారిని రూపుమాపి హిందూదేశంలో నివాసమేర్పరుచుకొన్నారు'' అనే యూరోపియన్ విద్వాంసుల మాటలన్నీ కేవలం అర్థరహితాలు; వెర్రి ప్రసంగాలు! మన హైందవ పండితులుకూడా వారి మాటలను ఒప్పుకోవటం చిత్రం! ఘోరాలైన యీ అసత్యాలన్నీ మన బాలురకు నేర్పుతున్నారు! ఇది ఎంతో దౌష్ట్యమనటం నిస్సంశయం

నామట్టుకు నేను కేవలం అజ్ఞానిని, విద్వాంసుణ్ణని నే నెన్నడూ చెప్పుకోను కాని నేను గ్రహించగలిగిన కొంచాన్ని ఆధారం చేసుకొని, 'ప-రీ' కాంగ్రెస్‌లో యీ సత్యభావాలను తీవ్రంగా ఆక్షేపించాను. ఈ విషయాన్ని గూర్చి నేను హిందూదేశ విద్వాంసులతోను, యూరప్‌దేశ విద్వాంసులతోను మాట్లాడుతున్నాను తీరిక దొరికినప్పుడు యీ సిద్ధాంతానికి అనేక ఆక్షేపణలు - సవివరంగా - పేర్కొంటాను మీకూ - మన

పండితులకు ప్రస్తుతం యీ మాటలు చెబుతున్నాను. మీరు విద్వాంసులు, మీ పురాతన గ్రంథాలను, శాస్త్రాలను పరిశోధించి మీరే విషయ నిర్ణయం చేసుకోండి.

యూరోపియన్లకు అవకాశం లభించిన ప్రాంతాల్లో ఆదిమవాసులను నిర్మూలించి, వారి భూములపై అనాయాసంగా, సుఖంగా, నివాసాలేర్పరచుకొంటారు, కాబట్టే ఆర్యులూ అలాగే చేసివుంటారని వారు భావిస్తారు! పాశ్చాత్యులు వారి స్వగృహాల్లోనే వుండి వారికున్న ఆధారాల మీదే నివసిస్తే వారు నిర్భాగ్యులుగాను, నీచులుగాను పరిగణింపబడతారు. కాబట్టి వారు లోకమంతా వెర్రెత్తినట్లు తిరిగి, యితరుల భూము లనే కొవ్వును - దోపిడిచేత, మారణ కార్యాలచేత - ఎక్కడ ఆహారించటం సాధ్యమో చూస్తారు. కాబట్టి ఆర్యులూ అలాగే చేసివుంటారని వారు తలుస్తారు! కాని మీ నిదర్శనం ఏదీ? ఊహలు మాత్రమేనా? ఐతే, మీ వింత ఊహలు మీరే వుంచుకోండి.

విదేశంనుండి ఆర్యులు హిందూదేశాని కొచ్చారని ఏ వేదంలో, ఏ సూక్తంలో వుంది? మృగప్రాయులైన ఆదిమవాసులను వారు వధించారనే భావాన్ని మీ రెక్కడ్నుండి సంపాదించారు? అలాటి అర్థరహిత ప్రేలాపాల వల్ల మీకేం లాభం కలుగుతుంది? మీ రామాయణ పఠనం నిరర్థకమై పోయింది, అందులోనుండి ఒక పెద్ద చక్కని కథను అల్లటం ఎందుకు?

సరే, రామాయణం ఏం తెలుపుతోంది? దక్షిణ భారతదేశంలోని ఆరణ్యకులైన ఆదివాసులను ఆర్యులు జయించారనా! బాగుంది! రామచంద్రుడు నాగరికుడైన ఆర్యరాజన్యుడు. అతడు యుద్ధం చేసింది ఎవరితో? లంకకు రాజైన రావణుడితో. రామాయణాన్ని ఒకసారి కొంచెం చదివి చూడండి. రావణుడి నాగరికత రాముడి నాగరికతకంటె ఎక్కువే గాని తక్కువకాదని మీకప్పుడు తెలుస్తుంది. లంక నాగరికత అయోధ్య నాగరికతకంటె కొంచెం అధికమేగాని, తక్కువ కానేకాదు ఇక యీ వానరులు రాముని మిత్రులు, సహాయులు కదా! రాముడు

ఏ వాలి రాజ్యాన్ని, ఏ గుహుని రాజ్యాన్ని తన రాజ్యంలో కలుపు కొన్నాడో చెప్పండి.

కాని కొన్ని ప్రాంతాల్లో ఆర్యులకు, ఆదిమవాసులకు అప్పుడప్పుడు యుద్ధాలు జరిగే వుండొచ్చు. జిత్తులమారి ముని లొకరిద్దరు రాక్షసుల అడవుల్లో, హోమాగ్ని పక్కన, కళ్లు మూసుకొని ధ్యాననిమగ్నులై వున్నట్లు నటిస్తూ, నిజానికి తమ మీద రాక్షసులు రాళ్ళు, ఎముకలు ఎప్పుడు పడవేస్తారో అని కనిపెట్టుకొని వుండొచ్చును. ఎప్పుడు అలా జరుగుతుందో, అప్పుడే వారు మూలుగుతూ, ఏడుస్తూ రాజుల వద్ద కెళతారు. కవచధారులైన రాజులు కత్తులు, ఉక్కు ఆయుధాలు పూని నిప్పులుకక్కే గుర్రాలపై వస్తారు. కాని ఆదిమవాసులు కర్రలతోను, రాళ్లతోను ఎంతకాలం యుద్ధం చెయ్యగలరు? కాబట్టి వారు తరిమి వెయ్యబడటమో, చంపబడటమో జరిగేది. తరువాత రాజులు తమ రాజధానికి తిరిగి వస్తారు. సరే, యిదంతా జరిగే వుండొచ్చు. కాని వారి భూములు ఆర్యులు గుంజుకొన్నారని దీనివల్ల ఎలా నిరూపితమౌతుంది? రామాయణంలో ఎక్కడ అలా చెప్పబడింది?

ఆర్య నాగరికతా వస్త్రానికి మగ్గం విశాలం, ఓడలు పయనించే అనువైన నదులు; అక్కడక్కడున్న ఎంతో పెద్దవి, వేడిమిగల చదును దేశం. ఈ వస్త్రానికి ప్రత్తి ఆర్యజాతి ప్రాబల్యంగల పూర్ణ నాగరికులు, అర్ధ నాగరికులు, నాగరికతా విహీనులు చేరిన ప్రజ. దాని పడుగు వర్ణాశ్రమా చారం[1], దాని పేక కలహ, స్పర్థాస్వభావాలను జయించటం.

''యూరప్ దేశస్థులారా! మీరు ఏ దేశాన్ని అనుకూలతర స్థితికి తెచ్చారు?'' అని మిమ్మల్ని అడగవచ్చునా? మీ కెక్కడెక్కడ దుర్బలతర జాతులెదురుపడ్డారో వారిని మీరు సమూల వినాశనం చేశారనే చెప్పాలి. వారి భూములను ఆక్రమించుకొని, అందులో సుస్థిర నివాసా లేర్పరచు

---

1 ప్రాచీన హైందవ వ్యవస్థ ఐన చాతుర్వర్ణ్యం (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులు), చతురాశ్రమాలు (బ్రహ్మచర్యం, గార్హస్థ్యం, వానప్రస్థం, సన్యాసం).

కొన్నారు. మీ అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజిలాండ్, పసిఫిక్ ద్వీపాల, దక్షిణ ఆఫ్రికాల చరిత్ర ఏమిటి? అక్కడి ఆదిమవాసులు నే డెక్కడున్నారు? అడవిమృగాల మాదిరి మీరు వారిని నిర్మూలించారు; ఊరూ, పేరూ లేకుండేట్లు చంపేశారు - అలాచేసే శక్తి మీకు లోపించినప్పుడే - అలాటి సందర్భాల్లో మాత్రమే - వారింకా సజీవులై వున్నారు.

కాని హిందూదేశం అలా ఎన్నడూ చెయ్యలేదు ఆర్యులు కరుణామయులు. ఔదార్యవంతులు, విశాలహృదయులు సముద్రం మాదిరి విస్తారమైన వారి హృదయాల్లో, మానవాతీత జ్ఞానోన్నతివున్న వారి బుద్ధిలోను, అశాశ్వతాలు - ఉల్లాసకరంగా వున్నా నిజానికి దారుణాలు - ఐన కర్మలకు తావేలేదు. నా దేశ బుద్ధిహీనుల్లారా! మిమ్మల్నొక ప్రశ్న అడుగుతున్నాను: ఆర్యులు ఆదిమజాతులను - వారి భూముల నాక్రమించుకోవటానికి - నిర్మూలించివుంటే - యీ వర్ణాశ్రమధర్మ వ్యవస్థ వుండివుండేదా?

యూరప్ దేశస్థుల గమ్యం తాము జీవించే నిమిత్తం యితరుల నందరిని నిర్మూలించటం. ఆర్యజాతి గమ్యం అందరిని తమ ఉన్నతికి - లేక, యింకా పైకి - ఉద్ధరించటం నాగరికత గరపటానికి యూరప్ దేశస్థుల సాధనం ఖడ్గం, ఆర్యుల సాధనం వేర్వేరు వర్ణాలుగా విభజించటం. ఈ చాతుర్వర్ణ్య విభజనం సభ్యతను చేరటానికి పోవలసిన సోపానం - అంటె ప్రతి వ్యక్తి తన పాండిత్యానికి, సంస్కృతికి, అనురూపంగా పైకెళ్లే అనువైన మార్గం. యూరప్‌లో అన్నిచోట్ల బలవంతునికే విజయం. బలహీనుడికి మరణం భరతఖండంలో ప్రతి సాంఘిక నియమం ఉద్దేశం బలహీనుల సంరక్షణ.